# ప్రబంధసారశిరోమణి

[ సంకలనగ్రంథము ]

పరిష్కర్త :

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి, ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.

ఆంధ్రశాఖాచార్యులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్

వాల్తేరు



1985

ఆంధ్రవిశ్వకళాపరిషత్తుచే ప్రకటితము

# ఉపోద్ఘాతము

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులుగ, ఆంధ్రశాఖ తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని అముద్రితగ్రంథములను ప్రచురించుట ప్రారంభించినది. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు ఆంధ్రశాఖాధిపతిగ ద్విపదభారతసంపుటము; ఆచార్య గంటి జోగిసోమయాజిగారు ఆంధ్రశాఖాధిపతిగ ద్విపదభారతసంపుటములు, యక్షగానసంపుటములు; ఆచార్య కాకర్ల వేంకటరామనరసింహముగారు ఆంధ్రశాఖాధిపతిగ యక్షగానసంపుటములు ప్రకటింపఁబడినవి. అవి 1943–1976 సంవత్సరముల మధ్యకాలమునందు జరిగినవి. 1979వ సంవత్సరమునందు నేను ఆంధ్రశాఖాధిపతిగ ప్రబంధసారశిరోమణి, ప్రబంధరత్నాకరము, ప్రయోగసారము ప్రకటించుటకు సంకల్పించితిని.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు 1933వ సంవత్సరమునందు ప్రకటించిన తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని తెలుగుగ్రంథముల పట్టికయందు–ప్రబంధసారశిరోమణికి నాలుగు ప్రతులు ఉన్నట్లు కలదు. అవి నాలుగును ప్రబంధసారశిరోమణి ప్రతులే అన్నట్లు, 1970వ సంవత్సరమునందు నిడుదవోలు వేంకటరావుగారు నిర్దేశించిరి. (ప్రబంధమణిభూషణము, ద్వితీయ ముద్రణము, పీఠిక, పుటలు 4-5) కాని, ఒకరెండు 190, 191 సంఖ్యల తాళపత్రగ్రంథములు ప్రబంధసారశిరోమణిప్రతులు; మఱొకరెండు 192, 193 సంఖ్యల తాళపత్రగ్రంథములు ప్రబంధసారప్రతులు. ప్రబంధసారము, ప్రబంధసారశిరోమణికి మారుపేరు కాదు. అక్కడక్కడ సమానపద్యములున్నను అదొక గ్రంథము; ఇదొక గ్రంథము అని నేను 1983వ సంవత్సరమునందు ప్రకటించితిని (నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?!, పుట 5).

190వ సంఖ్య తాళపత్రగ్రంథమునందు "సకలప్రబంధంబులలో గలిగిన పద్యములు సారముగా సంగ్రహించి వ్రాసిన ప్రబంధసారశిరోమణి" అని కలదు. 191వ సంఖ్య తాళపత్రగ్రంథమునందు "అక్కిరాజు తమ్ముడు అచ్చన వ్రాసిన ప్రబంధసారం" అని కలదు. 192వ సంఖ్య తాళపత్రగ్రంథమునందు "కళావతి వ్రాసిన ప్రబంధసారం" అని కలదు. 193వ సంఖ్య తాళపత్రగ్రంథమునందును "ప్రబంధసారం" అని కలదు. కనుక ప్రబంధసారశిరోమణి, ప్రబంధసారము ఒకే గ్రంథమను భ్రమ కలుగుట సహజము. 190, 191 సంఖ్యల తాళపత్రగ్రంథములు ప్రబంధసారశిరోమణి ప్రతులే. 192, 193 సంఖ్యల తాళపత్రగ్రంథములు ప్రబంధసారశిరోమణి ప్రతులు కావు.

192వ ప్రతియందు "శ్రీకరపరితోషిత" అను శ్రీరామస్తుతి అనంతరము, "అని ఆ తీరున రామభద్రస్వామిని వినిపించి" అని; తదుపరి "వీణాపుస్తకపాణి" అను సరస్వతీస్తుతి అనంతరము, "అని భారతీసతిని మతిని దలఁచి నేఁడు వినిపించే కథాక్రమం బెటువలె నంటేను" అని కలదు. 193వ ప్రతియందును "శ్రీకరపరితోషిత" అను శ్రీరామస్తుతి అనంతరము, అని ఆ తీరున రామభద్రస్వామిని వినుతించి" అని; తదుపరి "వీణాపుస్తకపాణి" అను సరస్వతీస్తుతి అనంతరము, "అని భారతీసతిని మతిని దలఁచి – మోదకహస్తు, మనమున రఘు, – ఆ తీరున ధీమంతుఁడైన హనుమంతుని అంతరంగమున నెంచి నేఁడు వినిపించే కథాక్రమం బెటువలెనంటేను" అని కలదు. అంతేకాదు. రత్నావతి అను పట్టణమున రాజు సుమశేఖరుడు. రాణి సుమమంజరి. రాజుసన్నిధికి చెంచులు కానుకలు గైకొని వత్తురు. వారికోరికను రాజు వేటకు వెడలును. అచట చిత్రధ్వజుని కుమార్తె విలాసవతి అను రాకుమారి కలచును. అమె కూడ సుమశేఖరుని వలచును. విలాసవతీసుమశేఖరుల వివాహము. ఇట్లుప్రబంధసారమునందు కథసాగినది. ఇక ఉజ్జయిని అను పట్టణమున రాజు సుకీర్తి. నారదుని రాక. సుపుత్రునికొఱకు సుకీర్తి తపస్సు చేయును. తపోభంగమునకు ఇంద్రుడు ప్రయత్నించును. విఫలు డగును. విష్ణువు ప్రత్యక్షమై సుకీర్తికి వరమొసగును. రాజశేఖరుడు జన్మించును. రాజు అగును. మరల నారదుని రాక చిత్రసేనుని కుమార్తె రత్నసుందరిని వర్ణించును. రాజశేఖరుడు స్వయంవరమున రత్నసుందరిని వివాహమాడును. ఇట్లు ప్రబంధసారశిరోమణియందు కథ సాగినది. కనుక ప్రబంధసారశిరోమణి కంటె ప్రబంధసారము పృథగ్భూతము.

తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని 190వ సంఖ్య ప్రబంధసారశిరోమణి తాళపత్రగ్రంథమునకు నకలు కాగితపుప్రతి ఆంధ్రవిశ్వకళాపరిషత్–గ్రంథాలయమునందు కలదు. 191వ సంఖ్య ప్రబంధసారశిరోమణి తాళపత్రగ్రంథమునకు నకలు కాగితపు ప్రతి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము నందు కలదు, ప్రబంధసారశిరోమణి ప్రధానాధారముగ 1910వ సంవత్సరమునందు మానవల్లి రామకృష్ణ కవిగారు ప్రకటించిన ప్రబంధమణిభూషణమును కలదు. దాని ద్వితీయముద్రణమును కలదు. కాని, ప్రబంధమణిభూషణము అని ఒక ప్రాచీనగ్రంథము కానరాదు. అంతేకాదు. ప్రబంధమణిభూషణమునందు కవిగారి "కరకౌశలము" కావలసినంత కలదు. ప్రాచీనగ్రంథము ప్రబంధసారశిరోమణియే. అది యథాతథముగ ఇంతవరకు ముద్రితము కాలేదు. కనుక ముద్రణావశ్యకము కలదు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్ – గ్రంథాలయములోని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖితగ్రంథాలయములోని కాగితపు ప్రతులు, తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథములకు నకళ్లు మాత్రమే. తాళపత్రగ్రంథములు

ప్రాయికముగ లేఖకదోషభూయిష్ఠములు. అవి కాగితపుప్రతులందు అల్లేకలవు. ఆంధ్రవిశ్వకళాపరిషత్ – గ్రంథాలయములోని కాగితపు ప్రతి కొంత నయము. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని కాగితపు ప్రతి దోషమయము. కనుక పరిష్కరణావశ్యకమును కలదు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్ – గ్రంథాలయములోని కాగితపుప్రతి ప్రధానాధారముగ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని కాగితపుప్రతి ఔపచారికాధారముగ, ప్రబంధమణిభూషణము నిమిత్తమాత్రముగ, స్థితిగతిచింతనముగ, యథాశక్తిని పరిష్కరించితిని. అంతేకాదు. తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునకు వెళ్లి, తన్మూలములైన తాళపత్రగ్రంథములను సంప్రతించితిని.

ప్రబంధసారశిరోమణియందు మొత్తము 805 పద్యగద్యములు కలవు. అందు 3 పద్యములు పునరావృత్తములైనవి. కనుక నికరము 802 పద్యగద్యములు కలవు కాని గ్రంథము పూర్తి కాలేదు. అంతవఱకే గ్రంథసంకలనము జరిగినదో, లేక ప్రతివిలేఖకులకు అంతవఱకే గ్రంథము లభించినదో తెలియుటకు అవకాశము లేదు. రెండుప్రతులందును పద్యములకు ఆకరములు లేవు. కాని ఒక్క ప్రతియందు (190) ఒక్కచోట మాత్రము పదిపద్యములకు ఆకరములు కలవు. (105–109; 111–116) కవికర్ణరసాయనములోనిదనిన పద్యము కవికర్ణరసాయనములోనిదే. సుభద్రాకల్యాణములోని దనిన పద్యము సుభద్రాకల్యాణములోనిదే (విజయ విలాసము). కళాపూర్ణోదయములోని దనిన పద్యము కళాపూర్ణోదయములోనిది కాదు. కవి మనోహరములోని దనిన పద్యము కవిమనోహరములోనిది కావచ్చును. గిరిజా పరిణయము లోని వనిన పద్యములు రెండును గిరిజా పరిణయములోనివి కావచ్చును. హరివంశములోని దనిన పద్యము ఎఱ్ఱన హరివంశములోనిది కాదు. హరిభట్టు హరివంశములోని దగునేమో? పూర్ణచంద్రోదయములోని దనిన పద్యము పూర్ణచంద్రోదయములోనిది కావచ్చును. లక్ష్మీపరిణయములోని దనిన పద్యము లక్ష్మీపరిణయములోనిది కావచ్చును ("నన్నెచోడుని కుమారసంభవము" నందు కలదు). వీరభద్ర విజయములోని దనిన పద్యము వీరభద్రవిజయములోనిది కాదు. శ్రీరంగమహత్త్వములోనిది. లాక్షణికోదాహరణములందు, సంకలనగ్రంథ సందర్భములందు భ్రమప్రమాదములు సంభవము. ఇంతకు, కవిమనోహరము, పూర్ణచంద్రోదయము, గిరిజాపరిణయము, లక్ష్మీపరిణయము అనుపలబ్ధములైన గ్రంథములు. ఉపలబ్ధములైన గ్రంథములందు ఆదికవి నన్నయభట్టు భారతము మొదలు అర్వాచీనకవి వెన్నెలకంటి వేంకటాచలము శ్రీకృష్ణవిలాసము వఱకు 44 ప్రబంధములనుండి ఎన్నిక చేసిన పద్యములు ప్రబంధసారశిరోమణి యందు కలవు. అందు 259 పద్యముల ఆకరములు మానవల్లి రామకృష్ణకవిగారు, 57 పద్యముల ఆకరములు నిడుదవోలు వేంకటరావుగారు గుర్తించిరి. అవిగాక 45

పద్యముల ఆకరములు నేను గుర్తించితిని. కవిగారు, వెంకటరావుగారు గుర్తించిన కొన్నిపద్యముల ఆకరములు సంపదింపలేదు. సంపదించినవి పద్యసూచియందు సంతరించితిని. ఇప్పటికి 802 పద్యములలో 361 పద్యములకు మాత్రమే ఆకరములు తెలిసినవి. ఇంకను 441 పద్యములకు ఆకరములు తెలియవలసి యున్నది.

ఇన్ని గ్రంథములనుండి అన్ని పద్యములను సేకరించి, కథాసూత్రమున మేళవించి, ఇంత చక్కని చిక్కని రసచిక్కణమైన సంకలనగ్రంథమును సంపటించిన సంధాత గుఱించి సమాచారము లేకపోవుట సంతాపకరము. సంధానమైనను ఉండుట సంతోషకరము.

పదునెన్మిదవశతాబ్ది తుదిని గాని, పందొమ్మిదవశతాబ్ది తొలిని గాని (నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా ?! పుటలు 211–12.) ఉన్న, వెన్నెలకంటి వేంకటాచలము శ్రీకృష్ణవిలాసములోని పద్యమును కూడ సంకలించిన, ప్రబంధసార శిరోమణి సంకలనగ్రంథకర్త పందొమ్మిదవశతాబ్ది పూర్వార్ధము కంటె పూర్వుడు కాడు.

కథాసూత్రము యథాలాపమైనను, ఎన్నిక చేసి మన్నిక చేసిన పద్యములు అనర్ఘ మణులే. పుర, నాయక, సముద్ర, ఋతు, సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ, కుమారోదయ, నాయికా, విరహ, వివాహ, జలకేళీప్రభృతి వర్ణనములెల్ల శిరోమణిసరణులే. పురవర్ణనము 111 పద్యములందు, నాయక వర్ణనము 4 పద్యములందు కలదు. అనంతరము గ్రంథపాతము. తరువాత రాణి విచారమునకు రాజు కారణమడుగుట 4 పద్యములందు కలదు. అనంతరము గ్రంథపాతము. బహుశః రాణి ప్రాణసఖి కారణము విన్నవించెదననుసరికి నారదునిరాక ఒక పద్యమునందు కలదు. అనంతరము గ్రంథపాతము. తరువాత సముద్రవర్ణనము 3 పద్యములందు, వేసవి వర్ణన 11 పద్యములందు, వర్షావర్ణన 11 పద్యములందు, శరద్వర్ణన 5 పద్యములందు, హేమంతవర్ణన 8 పద్యములందు, వసంతవర్ణన 37 పద్యములందు, చంద్రోదయవర్ణన 13 పద్యములందు కలవు. సుకీర్తి పుత్త్రప్రాప్తికి తపస్సు చేయుట ఒక గద్యమునందు కలదు. సుకీర్తి తపస్సునకు భంగము కలిగించుటకు ఇంద్రుడు మన్మథుని నియమించుట 3 పద్యములందు, మన్మథుని వెంట రంభా తిలోత్తమాదులు బయలుదేరుట 17 పద్యములందు, వారు తపోవాటికయందు విహరించుట, మన్మథుడు శరసంధానము చేయుట 30 పద్యములందు కలదు. వారి ప్రయత్నము విఫలమగుట 4 పద్యములందు, విష్ణువు ప్రత్యక్షమై సుకీర్తికి వరమిచ్చుట 5 పద్యములందు కలదు. సుకీర్తికి రాజశేఖరుడు జన్మించుట, జాతకర్మలు జరుగుట 15 పద్యములందు కలదు. సుకీర్తి వార్ధక్యము 5 పద్యములందు కలదు. రాజశేఖరుని పట్టాభిషేకము, రాజ్యపాలనము 6 పద్యములందు

కలదు. మఱల నారదుని రాక, సమావేశము 4 పద్యములందు కలదు. నారదుడు రత్నసుందరిని వర్ణించుట 79 పద్యములందు కలదు. రాజశేఖరుడు స్వయంవరమునకు బయలుదేరుట 10 పద్యములందు, స్వయంవరము 35 పద్యములందు కలదు. రత్నసుందరీరాజశేఖరుల వివాహము 30 పద్యములందు కలదు. సూర్యాస్తమయాదిచంద్రికావిహారపర్యంతప్రకృతివర్ణన 66 పద్యములందు కలదు. వరసమాగమమువఱకు వధూవిరహవర్ణన 120 పద్యములందు కలదు. నాయికానాయకుల శృంగారవర్ణనము 31 పద్యములందు కలదు. ప్రత్యూషవర్ణన 23 పద్యములందు, సూర్యోదయవర్ణన 10 పద్యములందు కలవు. నాయిక వర్ణన 11 పద్యములందు, నాయికోపాలంభనవర్ణన 9 పద్యములందు, నాయికా విరహముతోపాటు జలకేళివర్ణన 25 పద్యములందు కలదు. కథాసూత్రము వివిధప్రబంధములనుండి విశిష్టమైన వర్ణనములను ఏర్చి కూర్చుటకు మాత్రమే ఉపయోగి.

నన్నయ భారతము, ఎఱ్ఱన నృసింహపురాణము, మంచెన కేయూరబాహు చరిత్ర, భాస్కరాదుల భాస్కరరామాయణము, నాచన సోమనాథుని ఉత్తర హరివంశము, శ్రీనాథుని శృంగారనైషధము, జక్కన విక్రమార్కచరిత్ర, దగ్గుబల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానము, భైరవుని శ్రీరంగమహత్త్వము, వల్లభామాత్యుని క్రీడాభిరామము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలము, కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక, అల్లసాని పెద్దన మనుచరిత్ర, నంది తిమ్మన పారిజాతాపహరణము, ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యము, సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనము, పింగళి సూరన కళాపూర్ణోదయము, భట్టుమూర్తి వసుచరిత్ర, ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్ర, నారన సూరన ఉదయనోదయము, నూతనకవి సూరన ధనాభిరామము, చెన్నమరాజు చారుచంద్రోదయము, రఘునాథరాయల వాల్మీకిచరిత్ర, చేమకూర వేంకటకవి విజయవిలాసము, వెన్నెలకంటి వేంకటాచలము శ్రీకృష్ణవిలాసము మొదలైన ఉపలబ్ధగ్రంథములలోని; తిక్కన విక్రమసేనము, కేతనప్రెగడ కాదంబరి, రావిపాటి త్రిపురాంతకుని అంబికాశతకము, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము, నంది మల్లయ మదనసేనము, పెదపాటి సోమయ అరుణాచలపురాణము, పెమ్మన భావన అనిరుద్ధచరిత్ర, సర్వదేవుని ఆదిపురాణము మొదలైన అనుపలబ్ధగ్రంథములలోని; కవిమనోహరము, పూర్ణచంద్రోదయము, గిరిజాపరిణయము, లక్ష్మీపరిణయము మొదలైన అవిజ్ఞాత గ్రంథములలోని; అప్పకవీయము, లక్షణశిరోమణి, లక్షణసారము మొదలైన లక్షణగ్రంథములలోని; ప్రబంధరత్నాకరములోని పద్యములు ప్రబంధసారశిరోమణియందు కలవు.

ఏవంవిధమైన ప్రబంధసారశిరోమణి ప్రచురణకు ఆమోదముద్ర వేసిన అప్పటి ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు శ్రీ ఆవుల సాంబశివరావుగారికి, ఇప్పటి

ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారికి, రిజిష్ట్రార్ డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డిగారికి—

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని ప్రబంధసార శిరోమణి కాగితపుప్రతిని అడిగిన వెంటనే అందఁజేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖితగ్రంథాలయము మఱియు పరిశోధనాకేంద్రము డైరెక్టర్ డాక్టర్ వి. వి. యల్. నరసింహారావుగారికి—

ప్రబంధసారశిరోమణి పరిష్కరణము కావించి ఆంధ్రశాఖాధ్యక్షపదవీ విరమణము చేసినను, ముద్రణపర్యవేక్షణమును నాకు అప్పగించిన ఆంధ్ర శాఖాధ్యక్షులు డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, ఆంధ్రశాఖ అధ్యాపక సంఘమునకు—

ఆంధ్రవిశ్వకళాపరిషత్ — గ్రంథాలయములోని ప్రబంధసారశిరోమణి కాగితపుప్రతికి ప్రత్యంతరము వ్రాసి, ప్రత్యంతరములను సంప్రతించునెడ ప్రత్యహము చదువుటో, సరిజూచుటో చేసి, తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునకు వచ్చి తాళపత్రగ్రంథముల పరిశీలనమున సహాయపడి, పరిష్కరించిన చిత్తుప్రతికి మఱల శుద్ధప్రతిని వ్రాసి, సూచించిన ప్రకారము అకారాద్యనుక్రమణికను పద్యసూచిని తయారుచేసి, ముద్రణదోషములను ముందుగ సవరించి, బహువిధముల సహకరించిన పబ్లికేషన్ ఆఫీసర్ డాక్టర్ మోడేకుర్తి వేంకట సత్యనారాయణగారికి—

ముద్రణదోషములను సూక్ష్మేక్షకను సవరించిన ఛాత్రులు, సహవ్రతులు డాక్టర్ కోలవెన్ను మలయవాసినికి, డాక్టర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రికి—

ముద్రణకార్యమును ముచ్చటగ నిర్వహించిన ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జి. మదనరాజ్‌గారికి, వారి సిబ్బందికి—

కృ త జ్ఞ త లు

7–3–1985 ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
వాల్తేరు ఆంధ్రశాఖాచార్యులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్

---

ప్ర తు లు :

క. ఆంధ్రవిశ్వకళాపరిషత్ — గ్రంథాలయములోని సకలు కాగితపు ప్రతి.
చ. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖితగ్రంథాలయములోని నకలు కాగితపు ప్రతి.
ట. ప్రబంధమణిభూషణము, ద్వితీయ ముద్రణము.

# ప్రబంధసారశిరోమణి

## వినాయకస్తుతి

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ జా
ల్యాంకవిచేష్టఁ దుండమున నవ్వలి[1] చన్గబళింపఁబోవ నా
వంకఁగుచంబు గాన కహివల్లభహారముఁగాంచి[2] వే మృణా
ళాంకుర శంకనంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్. 1

ఉ. ఆదరమొప్ప మ్రొక్కెడుదు నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్రసన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్
మోదక[1]ఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్. 2

శా. జేజే యంచు భజింతు రిష్టఫలసిద్ధుల్ మదింగోరి ని
ర్వ్యాజా[1]పారకృపావలంబుని గటప్రస్యందదానాంబునిన్
పూజాతత్పరదేవదానవకదంబున్ బాలకేళీకళా
రాజత్కౌతుకరంజితోరగఘనప్రాలంబు హేరంబునిన్. 3

ఉ. మోదకహస్త హస్తిముఖ మూషకవాహన యేకదంత లం
బోదర తప్తకాంచనసముజ్జ్వలవిగ్రహ బాలచంద్రరే
ఖా[1]దృతమౌళియంచుఁ దను నచ్చపుభక్తిఁ దలంచువారలన్
మోదము మీఱఁ బ్రోచు గణముఖ్యుని విఘ్నపతిం దలంచెదన్. 4

## శివస్తుతి

సీ. తారకాసురభుజాదర్పంబుఁ దెగటార్చు
ఘనుఁ గన్నతండ్రి మా యనుఁగువేల్పు
కుండలిజ్యావల్లి కొండవింటను గూర్చు
విలుకాండ్ర మేటి మా కులగురుండు

---

1 — [1] క. ట. నుంగ ; [2] క. చ. శే.
2 — [1] చ. ఘూతికిన్.
3 — [1] క. పాద, చ. ...జవాద.
4 — [1] క. ధృత.

తలిరాకుబాకు గద్దరి వజీరుని క్రొవ్వు
మట్టు[1]వెట్టిన దిట్ట మాకుఁ బ్రాపు
హత్తి వెల్లని గిత్త కత్తలాణము నెక్కి
మహి మించు[2] నెరకాఁడు మా ధనంబు

తే.గీ. జాటజూటాగ్రవీథిని జహ్ను[3]కన్య
మమతనిడుకొన్న వగకాఁడు మా బలంబు
పార్వతీసాధ్వి సామేనఁ బాదుకొల్పి
వెలయు పటుశీలి మాపాలి వేల్పు మొదవు. 5

ఉ. వాలినభక్తి[1] మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్. 6

## విష్ణుస్తుతి

సీ. వనరాశిఁదన యంపమొనకుఁ దెప్పించిన
కోదండగురుఁడు మా కులగురుండు
తారకబ్రహ్మాభిధానంబుఁ జేసిన
వేదవేద్యుండు మా విమలవిద్య
దండకాంతరమౌనిమండలిఁ గాచిన
మనువంశతిలకంబు మాకుఁ బ్రాపు
పగవాని తమ్మునిఁ బట్టంబు గట్టిన
కరుణాపయోధి మా పరమదాత

తే.గీ. శబరి యొసఁగిన ఫలములు చవులుగొన్న
భక్తిమాత్రైకదర్శి మాపాలి విందు
కఠిన దశకంఠ భుజగర్వ గౌరవంబు
మట్టు[1]వెట్టిన విలుకాఁడు మా బలంబు 7

సీ. సీతావధూమణి మా తల్లి భృగు[1]రాము
గర్వాపహారి మా కన్నతండ్రి
దశరథాత్మజుఁడు మా దాత విశ్వామిత్ర-
మఘరక్షణచణుఁడు మాకుఁ గర్త

5 — [1] క. బెట్టిన; [2] చ. రౌతు; [3] క. కన్నె.
6 — [1] ట. మ్రొక్కుడు.
7 — [1] క. బెట్టిన.

మారీచదమనుండు మా యిలువేలుపు
కోదండపాణి మా కులగురుండు
జనకజానేత మా నెనరైన చుట్టంబు
రావణహంత మా జీవధనము

తే.గీ. కైకయీప్సితకా²రుండు మాకు హితుఁడు
హేమమృగచర్మశాయి మా స్వామి జలధి
బంధనుఁడు మాకు సంసార భారకుండు
రామభద్రుండు మాకు సర్వస్వ మరయ. 8

ఉ. శ్రీరమణీయగాత్రు సరసీరుహనేత్రుఁ బటుప్రతాపగం
భీరగుణాబ్ధిదైత్యకులభీషణుఁ బోషణభక్తలోకవి
స్తారకృపాకటాక్షు ఘటసంభవసన్నుతుఁ గార్యసిద్ధి¹కిన్
ధారుణికన్యకాపతి ముదంబునఁ గొల్తుఁ బ్రసన్నరాఘవున్. 9

శా. శ్రీరామాకుచకుంభలిప్తఘనకాశ్మీరప్రభన్ దాల్చి శృం
గారాధీశ్వరమూర్తిరేఖ మెఱయంగాఁ జూడ్కికిన్ భక్తిచే
తోరాజీవ¹పరాగరాగమధుపేంద్రుండైన చందంబు చె
న్నారం జూపెడుఁ గృష్ణుఁ డెప్పుడు మదీయాభీష్టము ల్సల్పెడున్. 10

సీ. ¹కాటుకకొండపై గాసె²డి యెండకుఁ
జెలువైన పచ్చని వలువ వాని
గగనోదరంబునఁ గాయు చందురునకుఁ
గవయైన నాభిపంకజము వానిఁ
³బొడువు గుబ్బలిమీఁది ప్రొద్దు చందంబున
బెడఁగైన రత్నంపుఁ దొడగు వానిఁ
దరగలఁ దోతెంచు నురువుల కాంతికి
⁴సమమైన మందహాసముల వానిఁ

తే.గీ. దెల్లదామర విరిమీఁదిఁ తేఁటివోలెఁ
బాలమున్నీటి లోపలఁ బవ్వళించి
యోగనిద్రాధిలోలుఁడై యున్నవాని
మెలఁత కలగంటి నంతట మేలుకొంటి. 11

8 — ¹ ట. రామ; ² క. కార్యుండు.
9 — ¹ చ. సిద్ధా.
10 — ¹ క. నరాగ.
11 — ¹ క. కాటిక; ² చ. రే; ³ క. పొడవు; ⁴ చ. నరిమైన.

సీ. [1]సెలగోలఁ గల్యాణశృంగాంకురంబుతోఁ
గక్షభాగంబునఁ గ్రమ్మరించి
[2]పిల్లఁగ్రోవినిఁ దన పీతాంబరంబున
నంతరాళంబున నంతరించి
యమృతోపమానశిక్యాహారకబళంబు
కమనీయమైన హస్తమునఁ దాల్చి
మాణిక్యముద్రికామండితాంగుళములఁ
గమ్మతావుల యూరుఁ గాయలిఱికి

తే.గీ. నింగి వేల్పులు గ్రుక్కిళ్లు మ్రింగుచుండ
నారగించు పురాతనయజ్ఞభోక్త
మరకతశ్యామలామలమహితమూర్తి
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁగాఁత. 12

సీ. పురుడుఁ బుచ్చిననాఁడె పూతన[1] నూతన
స్తన్యజీవితముల చవులు చూచె
వెన్న మ్రింగెడినాఁడు వెడఁద పొక్కిటి[2]లోని
జగము వల్లవ[3]రాజు సతికిఁ జూపె
[4]దవిలి యాడెడునాఁడు దనుజరూపములైన
మద్దుల యుద్దులు మలఁగఁ జేసె
నడవనేర్చిననాఁడు పుడమి[5]వ్రేఁగంతయుఁ
బాపఁబూనిన తన పనులు దెలిపెఁ

తే.గీ. గాచె శరణాగతులఁ బశుగణముఁ గాచెఁ
గేల గిరియెత్తి నెత్తెఁ బాంచాలిమాన
మనఁగఁ బొగడొందు దేవర నాశ్రయింతు
జిష్ణుసఖు కౌస్తుభాలంకరిష్ణుఁ గృష్ణు 13

## బ్రహ్మస్తుతి

ఉ. ఈసానరించి చూడ నొకయింతి యనంభవకేళియైన య[1]
జ్ఞానయొనర్చి రేచి పొలయల్కనటించుట బుద్ధిగాఁగ వా
క్ఛ్రీసతికిం బరాఙ్ముఖముసేయఁగనేలక[2]నవ్వు నక్కళా
ధ్యానచతుర్ముఖుండు పరమాయువు శ్రీయును మాకునీయుతన్ 14

---

12 — [1] క. సెలగోల ; [2] క. పిల్లగోలుగదలి.
13 — [1] ట. పోతన ; [2] క. లోన ; [3] ట. రాజు ; [4] క. చ. తవిడి, ట. కదవి ;
[5] క. ద్రిగ్రంతయు, చ. ప్రేఁగెంతయు.
14 — 15 — 16. చ. లో లేదు, 14 — [1] క. లుప్తము ; [2] క. నవు.

## శివస్తుతి

మ. మన[1]వెంటన్ మననంబులం[2] దిరుగఁదెమ్మాయన్న దంతావళా
జినమందించి మహోరగాభరణరాజిన్ రాజితో[3] బూదిబొ
క్కనమందించి యలంతినవ్వేలయ భిక్షాపాత్ర [4]మందించి ని
ర్ధనతాసక్తునిఁజూచి [5]నవ్వు [6]సతి చిత్రక్రీడ వర్ణించెదన్ 15

## పార్వతీస్తుతి

ఉ. కూడెడి వెన్‌ద్రుకల్ నిడుద కూఁకఁటిఁ బ్రోవఁగబొడ్డుపై వళుల్
జాడలు దోఁపఁ గ్రొమ్మొలక చన్నులు మించు దొలంగ సిగ్గునం
జూడఁగ నేరముల్ మెఱుఁగుఁ జూపులనీన హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనమువాడుట[1]గాదె దలంప నంబికా 16

ఉ. శ్రీనతియు న్సరస్వతియుఁ జేటిక[1]లొంకృతి పాదపీఠ మ
బ్జాసనపుండరీకనయనాదులు భృత్యులు దైత్యమస్తముల్
పూసలు చందమామ తలపువ్వు సదాశివదేహయష్టి భ
ద్రాసన మెవ్వరీడు త్రిపురాంబకుఁ బార్వ్వలసత్కదంబకున్ 17

ఉ. [1]ఆదిమశక్తి శంకరుని యర్ధశరీరమునన్ వసియించు ము
త్తైదువ మంచుగుబ్బలికి నాత్మజ షణ్ముఖుఁ గన్నతల్లి బ్ర
హ్మాదిసమస్తదైవతసమర్చితపాదసరోజయుగ్మ య
త్యాదరలీల శాంకరి దయాగరిమన్ మముఁ బ్రోచుఁగాఁవుతన్ 18

మ. తరుణార్కాయుతదీప్తితో మధుకరోద్యద్ధామయుక్వేణితో
సురసంపూజిత[1]పాదపద్మములతో శుంభత్తనూవల్లితో
సరసస్మేరముఖంబుతో హరువరించన్ మెల్లగానేఁగు న
గ్గిరిరాట్కన్య వదాన్యఁ గొల్చెదఁ ద్రిలోకీమోహినిన్[2]మ్రొక్కలన్ 19

చ. ననవరవికోటితేజను గనత్తనువల్లిని సస్మితాననన్
దివిజమునిప్రణామపదనీరరుహన్ భువనైకమోహినిన్
శివు వరియింపనొయ్యొ వలచే నలినంకులదామ [1]మూని [2]తా
నవిరళలీలనేఁగు తుహినాద్రిసుతన్ వరదన్ భజించెదన్ 20

---

15– [1] క. నీ [లుప్తము] ; [2] ట. దిరిగి ; [3] క. బూదిబొక్కన ; [4] క. మర్ధించి ; [5] క. నప్పు ; [6] క. నతి.
16 – [1] క. కాదె.
17 – [1] క. లొకెక్కడ.
18 – [1] క. చ. ట. ఆదిను.
19 – [1] ట. హేమ ; [2] ట. మ్రొక్కెదన్.
20 – [1] క. ము. ; [2] చ. దా.

## లక్ష్మీస్తుతి

ఉ. చందనచారుపత్త్రకము సంస్తుతకౌస్తుభకర్ణికంబు న
స్పందితలాంఛనభ్రమరసంగిమనోజ్ఞమునై తనర్చు గో
విందు నురస్స్థలంబు నరవిందముగా [1]సొగయించియున్న య
య్యిందిర సూచుఁగాత కృప[2]నింపఁగు చూపుల భక్తసంతతిన్ 21

## సరస్వతీస్తుతి

చ. తలపును బల్కు నీవె యను తత్త్వము నా మదిలోన [1]గాఢమై
యలవడియుం గవిత్వమహిమాతిశయంబులుఁగాఁ దలంపులున్
బలుకులుగావునం [ద] దనుబద్ధము భూరిభవత్కృపైకపు
ష్కలమని కోరికొల్చెద జగజ్జననీ [2]కరుణింపు భారతీ 22

క. అలకలు మోమునఁదూలఁగ
వలిచన్నుల [1]మీఁదిహారవల్లులు గ్రాలన్
తలఁపులు పలుకుల మెలఁగుచుఁ
దలవాకిటఁ బొలయు [2]చుండు తల్లిఁదలంతున్ 23

సీ. నిజముఖాబ్జప్రభానిర్జితశశిబింబ
బహులోకయువతివిభ్రమవిడంబ
కఠినస్తనాగ్రముక్తాఫలప్రాలంబ
నుతరత్నమేఖలాంచితనితంబ
కచభారనిర్జితకమనీయరోలంబ
హరిహరబ్రహ్మపదావలంబ
మందయానవిలాసనిందితకాదంబ
నిర్వికారాకారనిర్విడంబ

తే.గీ. పుణ్యనికురుంబ రుచిరోపభూరిబింబ
వరశుభాదంబ యామ్నాయవాక్కదంబ
ముక్తి [1]సారంబ పోషితమునికుటుంబ
సకలలోకైకవిమలాంబ శారదాంబ 24

---

21 — [1] ట. సొగియించి ; [2] క. నిచ్చలు.
22 — [1] ట. గాఢమై ; [2] క. కరుణించు.
28 — [1] చ. ట. మీఁద ; [2] క. చుండదల్లి.
24 — [1] ట. హారంబ.

సీ. చేర్చుక్క గానిడ్డ చిన్నిజాబిల్లిపై
సిందూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు[1]నందున్న యెలఁదేఁటి
శ్రుతికిచ్చు నంచితశ్రుతులసీన
మనమైన రారాపుఁ జనుదోయిరాయిడిఁ
దుంబీఫలంబు దుందుడుకుఁజెంద
తరుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు
నింగిలీకపు వింతరంగులీన

తే. గీ. ఉపనిషత్తులు బోటులై యోలగింపఁ
బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నించువేడుక వీణ వాయించు చెలువ
నలువరాణి మదాత్మలో నిలుచుఁగాత 25

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు
చెలికత్తె తెలుపారు [1]వలపుఁజిలుక
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు
[2]పసిఁడికిన్నెరవీణె పలుకుఁదోడు
నలువ [3]నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు
తళుకుటద్దంబు సత్కవులమనను
వేదాదివిద్యలు విహరణస్థలములు
చక్కనిరాయంచ [4]యెక్కిరింత

తే. గీ. యెపుడు నే దేవి కా దేవి యిందుకుంద
చంద్ర చందన మందార సారవర్ణ
శారదాదేవి మామకస్వాంతవీథి
నిందువేడుక విహరించుచుండుగాత 26

ఉ. అంజలిచేసి మ్రొక్కెద మదంబకు దివ్యసరోజమాలికా
పుంజసుగంధబంధకచపుష్పరసభ్రమరీకదంబకున్
రంజితకంఠహారనవరత్నవిడంబకు వజ్రకింకిణీ
మంజులమేఖలావలయమధ్యనితంబకు శారదాంబకున్ 27

---

25 — 1 క. నంది, చ. నందు.

26 — 1 ట. పలుకుఁజిలుక ; 2 క. పసరు ; 3 క. నెమ్మేను ; 4 ట. యెక్కిరింత.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి దక్షతామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్ 28

క. వీణాపుస్తకపాణిఁ బ్ర
వీణామృతమధురవేణి విపులశ్రోణిన్
వాణిన్గమలజుపట్టపు
రాణిన్వినుతింతు నే నిరంతరభక్తిన్ 29

## వినాయకస్తుతి

ఉ. అల్లనఁ దుండమెత్తి శివునౌఁదల యేటిజలంబుఁ [1]బీల్చి సం
పుల్లతఁ బాదపీఠమునఁ బొంతన [2]యున్న సహస్ర [3]నేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోక్షణసేయు [4]నట్లు శో
భిల్లు గజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్ 30

ఉ. ఇంచిన బాలకేళిఁ బరమేశ్వరు జూటకిరీటకోటిఁ గీ
లించిన చంద్రరేఖఁ గబళించి మదిం దిలకించి [1]వేగ లీ
లాంచితఫాలవీథి వికటాకృతిగా గదియించి ముద్దులన్
మించి నటించు దంతిముఖునిం బ్రణుతించెద నిష్టసిద్ధికిన్ 31

## సుకవిస్తుతి

ఉ. భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసి ఘోరసం
సారవికారసంతమసజాలవిజృంభణ[1]వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుండగు దివ్యపరాశరాత్మజాం
భోరుహమిత్రుఁ గొల్తు మునిపూజితు భూరియశోవిరాజితున్ 32

శా. ప్రావీణ్యంబెసఁగన్ గవిత్వవిటపాగ్రస్థాయియై మంజులా
రావంబుల్ సెలగంగ సంతతము శ్రీరామాక్ష[1]రాత్యూర్జనం
బావర్తించుచు విశ్వరంజనకరుండై యొప్పులోకప్రియున్
శ్రీవాల్మీకి మునీంద్రకోకిలకులశ్రేష్ఠున్ బ్రశంసించెదన్. 33

---

30 — [1] బుచ్చి, చ. పుచ్చి; [2] క. యాన, చ. యాన్న; [3] క. చ. ధేను; [4] ట. నట్టు.
31 — [1] క. కావి, ట. కాళి.
32 — [1] క.చ. బూచి.
33 — [1] ట. రావర్తనం.

శా. అంగీకారము ప్రస్తుతింపఁదగదే యార్యానుకూలంబులై
మాంగళ్యధ్వనులై ప్రసాదనిధులై మాధుర్యధుర్యంబులై
త్వంగద్భర్గజటానిరర్గళగళద్గంగాతరంగావళీ
భంగిం[1]జేర్చిన నన్నపార్యుని[2] వచఃప్రాగల్భ్య నిర్వాహముల్. 34

క. అద్యతనసుకవివర్యుల
నుద్యన్మతిఁదలఁతు గుణగణోదధిమనులన్
హృద్యానవద్యవాణీ
[1]విద్యోదితగద్యపద్యవిద్యానిధులన్. 35

సీ. ఆనక యమృతంబు దా నిట్టిచవి యని
జనుల కేర్పఱుపఁగాఁ జాలువారు
చూడక మన్మథు సుందరాకారంబు
గరిమఁ జూపఁగఁజాలు కణఁక వారు
వినకయ పరతత్త్వవిపులనినాదంబు
వినుతింపఁజాలెడు వెరవు వారు
నంటక మెఱుపులయందంబు వేగును
గణుతింపఁజాలు ప్రఖ్యాతి వారు

తే.గీ. కంపుగొనకయ కల్పవృక్షముల పుష్ప
సౌరభం బిట్టిదని చెప్పఁజాలు వారు
నెందుఁజూచిన ధాత్రిలో హృదయదృష్టిఁ
గవులు గానని మర్మంబు గలదె జగతి. 36

## కావ్యప్రశంస

ఉ. ఉదయప్రాణవిహారమై విహితవర్ణోద్యద్విభక్తిక్రియా
సదనంబై సదలంకృతిప్రభవమై సద్వృత్తమావాసమై
[1]విదితార్థాకరమై ప్రసన్నపదమై వృద్ధ[2]శ్రవోవైభవా
స్పదమై రాజును బోలెఁ గ్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్. 37

---

34 — [1] ట. బేర్చిన ; [2] ట. మునః.

35 — [1] క. విద్యాధిగత, చ. విద్యాధిత.

37 — [1] క. వివిధా ; [2] క. వృద్ధక్రతూ, చ. వృద్ధకృతో.

మ. పదబంధంబుల నగ్గలించి బుధ[1]శబ్దభ్రాజమై సద్గుణా
న్పదమై దుష్క[2]వి హృత్సరోజవనమున్[3] భంజింపుచు న్స్ఫారిన
మ్మదలీల న్విలసిల్లు[4] కబ్బము జగన్మాన్యప్రచారంబులన్
మదనాగంబునుబోలెఁ గ్రాలవలదా మాఱెందు[5]లే కుండఁగన్. 38

శా. సాయంకాలనటన్మహానటజటాచంచద్వియద్వాహినీ
స్ఫాయద్వార్లహరీవిజృంభణకళాప్రౌఢుండు సత్కావ్యమున్
జేయంబోలినఁ బోలుఁగాక సుకవిశ్రేణీసముచ్ఛిష్టవా
క్ఛాయాహారుల కెంతదవ్వు రసవత్సాహిత్య[1] సాహిత్యమున్. 39

తే.గీ. నన్నవలిపంపుఁబయ్యెద చాటులోనఁ
గాననగు నింతి వలిచన్నుఁగవయుఁ బోలి
పలుకు పలుకున కర్థంబు చులకనగుచు
నుల్లమునకు సుబోధమై యుండవలయు. 40

## పురవర్ణన

సీ. ప్రత్యగ్రరచనాతిభాసురప్రాసాద
నిర్జితగోత్రాళినీరదంబు
ప్రాకారశిఖరాగ్రబంధురమణిగణ
ద్విగుణితతారకావిభ్రమంబు
పరిఖాజలాంతరప్రతిబింబితద్రుమ
స్మారితపాతాళభూరుహంబు
[1]వనపుష్ప [2]సౌరభవర్జితమధుపసూ
[3]నీకృతామర [4]వారణేంద్రగండ

తే.గీ. మప్సరఃస్పృహణీయలీలాతిశయవి
[5]భాసనిజనేత్రలీలావిలాసజనిత
కుసుమశరబాణ[6]వైదగ్ధ్య మనదృశార్ధ
నిర్జితాలక ముజ్జయినీపురంబు. 41

సీ. [1]రాజకదంబవిరాజితంబగుఁ గాని
కంటక [2]పార్థివోత్కరము గాదు

---

38 – [1] క.చ. శబ్దరాజమై ; [2] క.చ. హృద్యరాజవనముల్ ; [3] ట. భంజించుచున్ ;
[4] ట. నత్కవి ; [5] ట. లేకున్నతిన్.
39 – [1] క.చ. సాహిత్యముల్.
41 – [1] క. వని ; [2] ట. సౌరభా ; [3] క. నృత్య ; [4] క. హరితేంద్ర, చ. హరతేంద్ర ;
[5] క.చ. లాస ; [6] క. వృద్య.

పద్మాలయాతిశోభన మన్నఁజనుఁగాని
కుముదోదయాదిసంకులము గాదు
శుద్ధసువర్ణసుప్రసిద్ధాత్మకమగుఁగాని
[3]వరచిత్రవర్ణసంకరము గాదు!
[4]పరమౌషధిప్రభాభాసురంబగుఁగాని
దుస్తృణజ్యోతివిద్రుమము గాదు

తే.గీ. వనకులంబును దత్సరోవనకులంబుఁ
జెలువమగు హర్మ్యకులము నక్షత్రకులముఁ
బోల నిన్నిటిలోనఁ దాఁబోలియున్న
ప్రస్తుతంబగు నోషధిప్రస్థపురము. 42

ఉ. కోట లగడ్త లట్టడులు కొత్తడముల్[1]గవనుల్ కవాటముల్
హాటకగేహళుల్ వివిధయంత్రము లాయుధవర్మ [2]సంపముల్
ఘోటకముల్ రథావళులు కుంజరముల్ బహువాహినీపతుల్
సాటువకెక్కు వీరభటసంకులమున్ దగు నప్పురంబునన్. 43

శా. ప్రాకారంబు లగడ్త లట్టడులు యంత్రవ్రాతముల్ వప్రముల్
వాకి ళ్లాయుధసంపదల్ గజము లశ్వంబుల్ రథంబు ల్బటా
నీకంబు ల్బహుకేతనాదులు మది న్నిర్మించినట్లుండు భూ
నాకం బప్పుర మేకొఱంతయుఁ గానంబట్ట దే పట్టునన్ 44

ఉ. కొమ్మలు వీటికోట పెను [1]గొమ్ములసందులనుండి వేలుపుం
గొమ్మలుచూడఁగల్పకపుఁ [2]గొమ్మలు వంపఁగ రాలి[3]రాలి పు
ష్పమ్ము లగడ్తనిండ నవి నర్పునతుల్ గొనిపోదు[4]రాత్మలో
కమ్ము నకెన్న నేల పరిఖా[5]పలివప్రగభీరతోన్నతుల్ 45

క. వాసిగల కోట పొడుగా
[1]కాసెడు నయ్యాయ యెఱుఁగు నగడ్తయులోఁతా
భాసురమలయసమీరము
[2]మేసెడు నయ్యాయె యెఱుంగు మేదినిలోనన్. 46

---

42 – [1] క. రాజిత ; [2] క. వార్ధికో, చ. వార్ధి ; [3] క. పర ; [4] క.చ. పరమో.
43 – [1] ట. గవఁకుల్ ; [2] ట. కంబముల్.
45 – [1] క.చ.ట. గొమ్మల ; [2] ట. గొమ్ములు ; [3] ట. వాలి ; [4] ట. రత్న ; [5] చ. పవి. ట. చయ.
46 – [1] క.చ. కాసేటయ్యె ; [2] క.చ. మేసేటయ్యె.

ఉ. మిన్నులరాయు నప్పురము మేడల నొక్కొకవేళ కన్నియల్
తిన్నని ముద్దుబాట తరితీపుగఁ బాడిన నాలకించి యా
కిన్నెరకామినుల్ [1]తవిరి కిన్నెరలందుఁ దదీయమార్గముల్
కొన్ని గ్రహించి గెల్తు రెలగోలుగఁ దుంబురునారదాదులన్. 47

క. కరితురగసుభటగాయక
నరవరసామంతగణికనారీజనముల్
వరవర్ణవైశ్యహలికులు
నరసులు తోటలను బురిని నందడిఁజెలఁగెన్. 48

తే.గీ. పోకమ్రాఁకుల మహిమ కప్పుర[1]పుటనఁటి
యాకుఁదోటలసౌభాగ్య మందె గలదు
[2]ప్రబలమౌక్తికసౌధసంపదలయందు
వీటి రహి మెచ్చవలయుఁబో వేయినోళ్ల. 49

ఆ.వె. వరుణుపురముకంటె వానవిపురికంటె
ధనదువీటికంటె దండధరుని
పురముకంటె నజునిపురముకంటెను[1] బరి
స్ఫురముగాఁగ నొక్క పురము మెఱసె. 50

క. ఆకసముతోడి చూలనఁ
బ్రాకారము పొడవు గలదు పాతాళమహా
లోకము కంటెను లోఁతెం
తో కల దా పరిఖ యెఱుఁగ దొరకునె హరికిన్. 51

శా. సౌధద్వారకవాటకుడ్యవలభిస్తంభార్గళాదేహళీ
వీథీవేదిగవాక్షచత్వరనభా[1]వేదిప్రమాణవ్రతా
సౌధాట్టాలకసాలహర్మ్యవిశిఖా[2]సోపానసంతానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁగాంచనమణిస్నిగ్ధంబులై యప్పురిన్. 52

ఉ. ఆయతవజ్రనీలమణిహాటకనిర్మితవజ్రసౌధవా
తాయనరమ్యనిర్గతసితాభ్రమహా[1]గరుధూపధూమముల్
తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహరమ్యశాఖలన్
జేయుచునుండుఁ దాండవవిశేషములప్పురికేకిసంఘముల్ 53

47 – [1] చ. తిపిరి, ట. తవిరి.
49 – [1] క.చ. పతంటి ; [2] క. బ్రతుల, ట. బ్రబల.
50 – [1] క. పరిపురము;
52 – [1] క.చ. వేద ; [2] క. సోపాన.
53 – [1] ట. గురు.

ఉ. అతతవిస్ఫురద్భవనహాటకరత్నమరీచిజాలబా
లాతపమెప్పుడుం గలుగ నన్నగరంబున గేహదీర్ఘికా
వ్రాతములంద మందమదరాగములన్ విహరించుచు న్నిశా
భీతి యెఱుంగవెన్నడును బ్రీతియె కాని రథాంగదంపతుల్. 54

ఉ. అరయఁగా విమానయుతులై ఘనమార్గమునం జరించు బృం
దారకకోటి కోట విదితంబగు కొమ్మలఁదాఁకిపోవఁగా
నేరక నిల్చునన్న రమణీయతఁ దాతకమైన తత్పురిన్ –
గారవమైన కొమ్మల సుఖస్థితి చెప్పఁగ శక్యమేరికిన్. 55

ఉ. రాజితవప్రబద్ధబహురత్నమరీచులఁ బర్వి నిత్యవి
భ్రాజితశక్రచాపనికరంబు ఘటించిన నొప్పు నప్పురిన్
రాజకుమారమంత్రిభటరాజిమహీసురదండనాథసా
మాజి[1]కదానదృష్టి సముదగ్రతకుం దగు లక్షణంబులన్. 56

క. చీటికి మాటికి వెలువడి
హాటకమయవప్రమెక్కి యహికన్నెలు మి
న్నేట విహరింతు రనినం
గోటపొడవు పరిఘలోఁతు కొలఁదియె పొగడన్. 57

మ. సతతం బుర్విచరద్భుజంగరమణీసంతానహస్తాంబుజా
న్వితచామీకరచామరానిలము పృథ్వీభారసంభావనో
న్నతమౌళిం బొలయంగ నొప్పఁ బొడగాన న్వచ్చు శేషుండు సం
స్తుతి సేయందగదే పురీ[1]పరిఖలోతున్ నీటినుండేటయున్. 58

చ. తలముల[1] గండరించిన యుదగ్రసముజ్జ్వలసింహరూపముల్
తలతలగాంచి బిట్టులుకు లక్ష్మి తురంగము వేడ్కఁ దాఁకు చే
నొతికిన చంద్రబింబసుధనో తగ జీవము వచ్చెఁ జిత్రరూ
పుల కన సుందరీగణము పొల్పగు మేడలమీఁదనాడుచున్. 59

చ. పొడవగు హర్మ్యభాగములఁ బున్నమ[1]రేల మృగాంకలక్ష్మితోఁ
దడఁబడుచున్న నెమ్మొగముఁదమ్ముల కొమ్మలఁ జూచి వల్లభుల్
దుడుతురు వారిపై మమతతోన సహింపక [2]వ్రాలుచెక్కులన్
గడుఁజెలువారఁ దారు మును కస్తురి వ్రాసిన పత్త్రభంగముల్. 60

---

56 – [1] చ. ట. కి.
58 – [1] క. పరిఘ.
59 – [1] క.చ. గండలించిన.

చ. అనిశముమీఁదటన్ మెలఁగు నంగనలన్ గని నాఁడునాఁటికిన్
[1]దనికిన కామవేదన సుధారుచి చల్లనిపట్ల[2]గాక యి
చ్చెనొయనఁ జంద్రకాంతకృతశీతల [నిర్మల] హర్మ్యవీథులన్
బెనుపుగ రాత్రు[3]లందు [బ్రతి]ఁ బింబ[ము] లెంతయు నొప్పు నప్పురిన్. 61

శా. మోదంబారఁగఁ బౌరహర్మ్యములపై ముగ్ధల్ వినోదింపఁ ద
త్పాదాంభోరుహనూపురధ్వనులకుం బ్రాపై చెలంగంగ మ
ర్యాదన్ వ్యోమ[1]పదాంతరాళములయం దబ్జావళీకేసర
చ్ఛేదస్వాదుకషాయకంఠబిలహంసీసంకులక్రేంకృతుల్. 62

మ. తమ వక్త్రాధరకేశయాననయనోద్దామప్రభావంబులం
రమణిం జాలుదురన్నఁ దత్పురసతుల్ రాజీవబంధూకభృం
గమరాళోత్పలరాజి నూరి[1]వెలి నల్కన్నిరఁ[2] ద్రొబ్బించిన
ట్లమరున్ దోయజషండముల్ బురవరోద్యానంబులందందమై. 63

మ. పరిఖా[1]సారగభీరతాపరిణతిం బాతాళముం భూరిభా
స్వర[2] వప్రోన్నతి నంతరిక్షమును విస్తారస్ఫురల్లీలమై
ధరణీచక్రము నాక్రమించి పరగున్ దైవిక్రమాటోపబం
ధురనారాయణమూర్తిఁబోలెఁ బురి సంస్తుత్యప్రకాశోన్నతిన్. 64

తే.గీ. రాయుచున్న ఘనపయోధరములు గలిగి
నడుము లేకకొంత బయలైన బెడఁగు మిగులఁ
జూడ నొప్పారు రేఖల సొంపు మెఱయఁ
గోటకొమ్మలు మరుపీటికొమ్మలట్ల. 65

సీ. జాతరూపమనోజ్ఞజాతరూపంబైన
కోటచే వలయాద్రి[1] మోటపఱిచి
మధుసుధారసపూరమధురనీరంబైన
[2]పరిఖచే వారాశి భంగపఱిచి
నవరత్నచిత్రాభినవయత్నకములైన
యిండ్లచేఁ గనకాద్రియేపు[3] గఱఁచి
కాంతనిర్మలచంద్రకాంతబద్ధములైన
కుట్టిమంబుల ధాత్రిఁ గొంచె[4]పఱిచి

---

61 - చ. లో లేదు, 1 క. దనకన; [2] క. గాశయించెనొ; [3] క. బిందుబింబలెంతయు.
62 - [1] చ.ట. ప్రహద.
63 - [1] క. చెలి; [2] ట. ద్రోపించి.
64 - [1] [illegible]

తే.గీ. కమలగర్భుండు దన సృష్టిగాని భువన
కోశదుర్గంబు నఱగింపఁగోరి దీని
వేడ్క నిర్మించెననఁ బొల్చు విమతహృదయ
[5]ఘట్టనంబైన[6] సాకేతపట్టణంబు. 66

సీ. కాలకంధరచాపఖండనోద్ధతరాము
వామోమతిప్రశరాగ్నిఁ దెగక
కలశోద్భవోదగ్రకరతనహస్తకుళీర
కోణకోటరమునఁ గ్రుంగఁబడక
యౌర్వానలాభీలదుర్వారభీకర
జ్వాలికావళిచేతఁ గ్రోలఁబడక
యక్షుద్ర రౌద్రబాహాటోపపక్షరా
ట్పక్షవిక్షేపంబు పాలుగాక

తే.గీ. రమణఁ జూపట్టు రత్నాకరంబనంగ
ఘుమఘుమారంభ సంరంభ ఘూర్ణమాన
మీనమకరోగ్రనక్రసమృద్ధిచేతఁ
బరఁగు[1] హస్తిపురంబున[2] పరిఖజలధి. 67

## విప్రవర్ణన

మ. చతురాస్యుల్ పురుషోత్తముల్ బుధగురుల్ సర్వజ్ఞమూర్తుల్మహా
శతమన్యుల్ శుచిధర్మపుణ్యజనతాశ్లాఘ్యుల్ ప్రచేతుల్ సదా
గతు లక్షణనవార్థకర్తలు కళాకాంతుల్ జగద్బంధులా
క్షితిదేవుల్ పురిదేవతామహిమలన్ జెన్నొందుటల్ చిత్రమే. 68

చ. దురితహరుల్ స్వశర్మనిరతుల్ విజితేంద్రియు లంచితవ్రతుల్
సరసులు సత్కళావిదులు శాస్త్రమతజ్ఞులు సద్గుణాకరుల్
సురుచిరపుణ్యు లధ్యయనసూనృతవాదులు సత్ప్రదీపవి
స్తరితబుధోత్తముల్ సుజనసత్తము లప్పురిభూసురోత్తముల్. 69

చ. శ్రుతి[1] గవడొందినం గమలసూతికినైన నెదిర్చి చెప్ప నే
రుతురు పురాణశాస్త్రములు ప్రొద్దున నిండ్లను గీరశారికా
తతులు పరీక్ష[2]లీ విని ముదంబునఁ బొందుదు [3]రింద్రపట్టపుం
గ్రతువులు వేయొనర్చినను గైకొనరప్పురి విప్రపుంగవుల్. 70

66 – [1] ట. నోటుపరచి ; [2] క.చ. పరిఘ ; [3] చ. పరచి, ట. గరచి ; [4] చ. పఱచె ;
[5] ట. ఘట్టనంబున ; [6] చ. బొల్చారు.
67 – [1] ట. నుజ్జయినీపురి ; [2] క.చ. పరిఘ.
70 – [1] [illegible]

చ. అతిథి సురద్రుమంబులు మహామతు లధ్వరసంప్రవర్తకుల్
చతురులు శ్రీసతీరమణశంకరపాదసరోరుహార్చకుల్
వితతకృపావిధేయులు పవిత్రచరిత్రులు పుణ్యమూర్తు లా
యతశుభనిత్యసత్యులు గుణాకరు లప్పురిభూసురోత్తముల్. 71

సీ. అంగయుక్తంబుగా నామ్నాయములు నాల్గు
చదువంగనేరని సద్ద్విజాతి
బ్రహ్మపద్మాదిపురాణేతిహాసముల్
చక్క[1] నెర్గని బ్రహ్మసంభవుండు
భాట్టవైశేషికప్రాభాకరాదిశా
స్త్రము లాఱుఁ జూడని ధరణిసురుఁడు
స్వకులోచితములైన సప్తతంతువు లెల్లఁ
బ్రౌఢితో నెఱుఁగని బ్రాహ్మణుండు

తే.గీ. కావ్యనాటకలసదలంకారముఖ్య
విద్య లన్నియు నెఱుఁగని విప్రవరుఁడు
పంచయజ్ఞంబులును లేని బ్రాహ్మణుండు
వెదకి చూచినఁ బొడమఁ డవ్వీటిలోన 72

క. బ్రహ్మత్వము లఘువగు నని
బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడు[1] గాకా
బ్రహ్మాదికళలఁ దత్పురి
బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కుపఱచరె[2] చర్చన్. 73

ఉ. అమరుల పంటచేలు వివిధాతిథివర్గము సొచ్చి[1] నిండు లా
గములు పుట్టినిల్లు దయకందువ లీఁగుల[2] యాటపట్టు స
త్యముచెలు లుగ్రకర్మములయందని మ్రాఁకులపండ్లు సర్వశా
స్త్రములు[3] పాలమ్ము లార్యచరితంబుగ నప్పురిభూసురోత్తముల్. 74

సీ. అచటి విప్రులు మెచ్చ[1] రఖిలవిద్యాప్రౌఢి
ముది మది దప్పిన మొదటివేల్పు
నచటి రాజులు[2] వేడ్క నలరి భార్గవునైన
బింకానఁ బిలిపింతు రంకమునకు

---

72 — [1] క. నెరుగని, చ. నెర్గని.

73 — [1] క. కాగా ; [2] ట. చేర్చన్.

74 — [1] క. నట్లునా ; [2] క. యాలపట్టు ; 74-75 చ. లో లేవు ; [3] క. పొలంతులు.

నచటి మేటి కిరాటు లలకాధిపతినైన
[మును] నంచి మొదలిచ్చి మనుపఁ[3]జూతు
రచటి నాలవజాతి హలముఖాంతవిభూతి
నాదిభిక్షువు భైక్షమైన మాన్చు

తే.గీ. నచటి వెలయాండ్రు [4]రంభాదికాప్సరసలఁ
గాసె కొంగున వారించి [5]గడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టినఁ జిగురు[6]కొమ్మైనఁ జేవ. 75

## క్షత్త్రియ వర్ణన

సీ. పగలైనఁ దెలివి గోల్పడని రాజులు శరం
బులు నన్న వెలవెలఁబోని ఘనులు
ధనదాశ కేలు[1]మోడ్పని సార్వ[2]భౌమాంకు
లని వెన్కముందుఁ జూడని కుమారు
లరి మెచ్చఁ గరములు నెఱపని యిను లాల
మున వాలు మఱువని పురుషసింహు
లనయంబు నడకఁ దప్పని గోత్రపతు లెప్పు
డును[3] సీదరము లేని యనమభోగు

తే.గీ. శౌర వీరన వీరనయైకపరులు
వరలుదురు వీటఁ బుష్పవద్వంశ్యు లగుటఁ
గువలయాధారకమలానుగుణవిహార
సారసౌజన్యధరులు రాజన్యవరులు. 76

చ. అలఘుతరప్రతాపమున నంతకుఁ దేజమునన్ దివాకరున్
బలమున శేమనిం గడిమి భార్గవరాముని వైభవంబునన్
బలరిపు సాటిసేయఁదగి బాహుజయార్జితశత్రుమండలో
జ్జ్వలధనవంతులై మహిమ వ్రాలుదు రప్పురిరాజనందనుల్. 77

ఉ. రాజులు విక్రమోగ్రమృగరాజులు విశ్రుతదివ్యకాంతి రే
రాజులు రూపురేఖ రతిరాజులు మానగుణంబునందురా
రాజులు దానశక్తి ధనరాజులు వైభవభోగవృద్ధి స్వా
రాజు లనంగ నొప్పుదురు రాజితతేజులు తత్పురంబునన్. 78

---

75 — [1] క. అధిక ; [2] చ. బంటునంపి ; [3] చ. దక్షు ; [4] క. రంభాది యప్సరసలు, చ. రంభాదులైన నొరయ ; [5] క. గడవ ; [6] కొమ్మైనచాన, గోమైనచాన.

76 — [1] క. మోడ్వని ; [2] చ. భేమాంబ ; [3] క. శిరము, చ. శిము ; ట. కమ్మగు.

క. తిరుగరు పలుక రర్థులకును
మరుగరు ధన మిత్తు రితరసుదతుల సుఖముల్
మఱుగరు రణములఁ బిఱిఁదికి
నరుగరు రాజన్యతనయు లానగరము[1]లోన్. 79

చ. ద్విచరణకేసరుల్ మనుజవేషసువర్ణమహీధరంబు ల
ప్రచలితసాగరంబు లన[1]పాయమనోహరచంద్రబింబముల్
సుచరితచిత్రరూపము లశోకసముజ్జ్వలరామవాకృతుల్
ప్రచురమహానిధుల్ పురవరంబున రాజకుమారు లందఱున్. 80

ఉ. చందనకుందనిర్మలవిశాలయశోధరఖేచరాదిరా
ణ్ణందను లిద్ధధర్మరవినందను లాహవకేళిఁ బార్వతీ
నందను లాఢ్యరూపహరినందను లద్భుతవిక్రమాంజనా
నందను లప్పురంబు నృపనందను లాశ్రితబృందనందనుల్. 81

ఉ. [1]ధానులు రాజ్యవర్ధనులు తత్త్వవిచారులు దారులింగిత
జ్ఞానులు మంత్రకోవిదులు సత్యవచస్కులు విద్విషత్తమో
భానులు ధీయుతుల్ చతురుపాయసమర్థులు[2]రాజకార్య సం
ధానపరాయణుల్ వినయతత్పరు లాది ప్రధాను లప్పురిన్. 82

క. స్వామిహితశక్తిమంతులు
ధీమంతులు చండధామదీధితిమంతుల్
భీమాహవభుజవిజయ
శ్రీమత్కృతిమంతు లప్పురిసామంతుల్. 83

తే.గీ. నూఱు క్రతువులు సేయని పాఱు నిల్లు
కోటిపడగలు లేని కిరాటు గృహము
జాతిరత్నంబుగాని పాషాణకులము
[1]వెదకి చూపిన వీటఁ బన్నిదము గలదు. 84

## వైశ్యవర్ణన

సీ. అమ్మెద ననినఁ బద్మాక్షు కౌస్తుభమైన
వెలవక కొనియెడు వెరవు గలిగి
విలువ [1]యిచ్చెదమని వేఁడినఁ బులి జున్నుఁ
గమ్మపసిండియు నమ్మఁ గలిగి

79 — [1] చ. ట. నవ్.
80 — [1] క. చ. వాయ.
82 — [1] ట. దానులు ; [2] క. చ. రాచకార్య.
84 — [1] క. చ. వెదకిచూచిన, ట. వెదకిచూపంగలేరు పన్నిదమునకును.

యే వస్తు వెంత ప్రా ద్దెందరు చనుదెంచి
యెంతటి కడిగిన నెదురఁ గలిగి
తమ యింట లేని యర్థము లర్థపతి యింట
నైన వెదకిన లేవగుట గలిగి

తే.గీ. తమ కులాచార [చారు] వర్తనము కొఱకు
నంగడుల యొప్పనకును బేహారు మాట
గాని లాభంబునకు నాట గా దనంగ
వరలుదురు పురవరమున వైశ్యవరులు. 85

క. [1]భిక్షుకునకుఁ జెలికాఁడని
యక్షుని నపహసింతు రనవరతంబున్
దక్షతఁ జెలికాండ్లును దా
మక్షయసంపదలఁ బొదలి రప్పురివైశ్యుల్. 86

ఉ. వెచ్చముఁ బెట్టుమన్నఁ బదివేలకు నుద్దర[1] లొల్ల రర్థముల్
తెచ్చిన శేషు నౌదలల దివ్యమణుల్వలె నన్న విల్వలన్
హెచ్చును గుందులాడుకొన కిత్తురు లాభముఁ గోర రెన్నఁగా
నెచ్చటఁ గోటికిం బడగనెత్తని వైశ్యుఁడు గల్గఁ డప్పురిన్. 87

ఉ. పచ్చల మంటపాగ్రములపైఁ గరమూలమనోహరప్రభల్
మచ్చుగ [1]నిండి నూత్నకుచమండలదీప్తులమీఁదఁ బర్వఁగా
నిచ్చలుఁ బద్మరాగమణు లేర్చి వణిక్కుల బాలికాజనం
బచ్చనగండ్లు నాడుదురు బాపురె యా పురి చెప్ప నేటికిన్. 88

## శూద్రవర్ణన

క. భద్రకరపుణ్యమతు ల
క్షుద్రపరాక్రములు బలనిషూదనవిభవుల్
భద్రేభసత్త్వు లప్పురి
శూద్రులు మెలఁగుదురు మనయశోధనులగుచున్ 89

85 – [1] క. చ. యిచ్చేమని.
86 – [1] క. చ. భిక్షుకునకుం.
87 – [1] క. చ. వొల్ల, 88 చ. లో లేదు.
88 – [1] క. నింద.

తే.గీ. దారు బలభద్రు లననొప్పి ధవళకీర్తి
నధికులై శ్రీధరశ్రేష్ఠు లనఁగఁబరఁగి
భోజచరితల మోదంబుఁ బొందుటరుదె
హలధరులు[1]గారె యప్పురి హాలికవరులు. 90

క. చెలువలు దముఁజూపు నెలుం
గుల డాయఁగ జీరుటలుగఁ గోరి తలఁచి రా
చిలుకలు కాపుండును మం
దలుగొని యప్పురము రాజనపుఁ[1]జేలలలోన్. 91

చ. పఱవఁగ లేక యూరుకుచభారవశంబునఁజేసి చప్పటుల్
జఱవఁగనేర కాతతకుచద్వితయోన్నతిఁజేసి సారె వా
చఱవఁగ నోపకాత్మవిలసన్మృదులధ్వనిఁజేసి చేలపై
కెఱఁగు శుకాళికిం[1] జొలతురెంతయుఁ బామరభామినీజనుల్. 92

చ. కులగిరులెత్తనైన వడిఁగుంభిని [1]గ్రుంగగఁ దాపనైన వా
ర్థులఁగలపంగనైనఁ జము [2]దున్నను బాఱఁగఁదోలనైన ది
గ్వలయమదేభకుంభములు వ్రక్కలు[3]సేయఁగనైనఁ జాలు దో
ర్బలములఁగెల్తు రాజిఁ బరిపంథుల[4]నాపురి వీరసద్భటుల్. 93

మ. [1]బలిచూడామణులందు విష్ణుపదజుల్ పాటించు ధాన్యంపుఁ ది
ప్పలు చంద్రామృతసాంద్రసేకమునఁబె పై [2]మోనులెత్తంగఁ ద
క్కలమాంకూరము[3]లంపుమేయు నెలజింకన్ సారె వారించు వా
తల తోఁబుట్టువు గంగ పద్మముఖనిర్యద్భృంగనాదార్భటిన్. 94

క. సంగరము లేక యుండిన
సింగంబులఁబులుల నమదసింధురములనే
కాంగి దొడరఁబడ వైతురు
పొంగుచు తమ కుబుసు పోకఁబురి వీరభటుల్. 95

క. పులుల పగిదిఁగంఠీరవ
ములక్రియ శరభములమాడ్కి ముదితమదేభం
బుల తెఱఁగున నానావిధ
కలహమదోద్భటులు భటులు గలరా వీటన్. 96

---

90 – [1] ట. గాదె.
91 – [1] చ. శేసులలోన్; 91, 92, 93, 94 – వ. లో లేవు.
92 – [1] క.చ. సొంతు.
93 – [1] చ. ద్రొక్కఁగనైన నత్త; [2] చ. దున్నలఁదూలఁగ; [3] క. కాయగ: [4] చ. నందుల.
94 – [1] క. జలి; [2] క. మాను: [3] చ. మేయుచున్.

## అశ్వ వర్ణన

చ. వెనఁ గదిలించి [1]వో యనిన వ్రేల్మిడిలోననె నిల్చు కంధరం
బునుమక బిట్ట[2]దల్చిన చివుక్కున సాగరమైనదాఁటు బల్
వసమున ఱాఁగలం దరిమి వాగె వదల్చిన [3]నప్పుడాజవం
బెసఁగఁగ గాలిమీఱుఁ బురినెన్నిక కెక్కిన ఖత్తలాణముల్. 97

ఉ. ఆ రనిశంబునేఁగు దెసఁదప్పక యొండొక దిక్కుఁబోవఁగా
నేర వనేకభంగి గతినేర వధీశు వహింప నొంటిమై
నేరవు రాత్రుల న్మెఱయనేరవు పోలగ నెట్లునేర్చునా
నీరజబంధునశ్వము లనింద్యములైన పురీహయంబులన్. 98

శా. పక్షంబుల్ మును శాలిహోత్రుఁడు శపింపంబోయినం బోవనీ
శిక్షానైపుణిఁగర్ణు తేజుల నధిష్ఠింపింపఁగాఁజాలిన
ట్లక్షీణత్వర నింగినైన గతిఁజేయంజాలు నుచ్చైఃశ్రవ
స్సాక్షాత్కారము లప్పురిన్ దురగముల్ శంపాకళానంపదన్. 99

## గజవర్ణన

సీ. ఉన్నచో గతిమాలి యునికి [1]కష్టంబని
గ్రుమ్మఱనేర్చిన కొండలనఁగ
గాలిచేఁ దూలెడు కష్టంబు వోవఁగ
ఘనమైన నీలమేఘములనంగ
వినురూపమైయున్కి వెల్లదనంబని
కడునల్లనైన దిగ్గజములనఁగ
తిమిరారియఁట యని ద్యుమణితో మార్కొని
నిలిచిన యిరుల మన్నీలనంగ

ఆ.వె. దానవారినాభిదమ్మమై వీథుల
నేఱులట్లు పొంగిపాఱుచుండ
[2]బవనిఁబోయివచ్చు ప్రథనకేళిజయ
[3]కారణములు పురము వారణములు. 100

---

97 — [1] క. హెూ ; [2] క.చ. వేలిమి, ట. దల్చిననుబోరన ; [3] ట. ఋవ్వనం.
98–99 చ. లో లేవు.
100 — [1] ట. ఇష్టంబని ; [2] క.చ. భవతి ; [3] క. హరణములు, ట. సారణములు.

మ. తమ కుంభంబుల పెంపు తుండముల సౌందర్యంబు హేలాలస
ద్గమనశ్రీలఁ గుచోరుయానములచేఁదత్పట్టణ [1]స్త్రీసమూ
హము కొల్లాడి యణంచికొన్న మొఱయో యన్నట్లు ఘీంకారనా
దము లేపారఁజెలంగు నప్పురి నితాంతక్రీడమత్తేభముల్. 101

మ. అతులక్రీడఁజరించు నందడుల నన్యోన్యస్తనాభోగసం
గతులం బెల్లుగఁద్రవ్వి రాలు గణికాహారావళీమౌక్తిక
ప్రతతుల్ ప్రోవులు గట్టుఁ దత్పురవరోపాంతంబునందు న్మ[1]దో
న్నతదంతావళగండమండలగళద్దానప్రవాహంబులన్. 102

చ. వరబలసంపదన్ సుకవివర్ణితదానసమగ్రవైభవ
స్ఫురణను వంశశుద్ధిఁ గరశోభితపుష్కరభాతి భద్రను
స్థిరవిజయోన్నతిన్ గుణవిశేషసముజ్జ్వలభంగి నెంతయున్
గరులు మదించి భూభుజులకైవడి ద్రిమ్మఱు నప్పురంబునన్. 103

సీ. సుందరీసమితికి మందయానంబుల
[1]యిరవులు గఱపెడు గురువులనఁగ
మధుకరబృందంబు మదజలక్షేపణఁ
జేసి యాకర్షించు సిద్ధులనఁగ
జనుల చూడ్కికిఁ గులశైలభావంబులుఁ
జూపియాడెడు బహురూపులనగఁ
బరమవీరభటుల నుద్ధురభీషణాకృతి
[2]భంగుల వెఱపించు గొంగలనఁగ

తే.గీ. గతులయొప్పును దానాంబుగంధములును
నున్నతులయొప్పుఁ జేష్టానముద్ధతులును
నతిశయిల్లుచుఁ బురిఁ బొలుపారుఁజిత్త
రంజనా[3]కృతులై భద్రకుంజరములు. 104

## వేశ్యావర్ణన
(కవికర్ణరసాయనము)

సీ. శృంగారరసమునఁ జికిలిసేయించిన
కంతుమోహనసాయకంబు లనఁగ
[1]మెఱసిపోవకనిల్చి మెలఁతలై కనుపట్టు
కారుక్రొమ్మెఱుఁగుల గములనంగ

---
101, 102, 108, 104 — చ. లో లేవ; 101 — [1] క. శ్రీ.
102 — [1] చ. మదోన్మద.
104 — [1] క. విరవులు; [2] క. బంటుల; [3] చ. కృతులగు.

వరరూపలావణ్యవైభవశ్రీమూ[2]ర్తు
లన మించు నవకల్పలతిక లనఁగ
ముఱిపెంపు నడలచే గరువంబు దళుకొత్తు
పనమించు రాయంచ [3]పదుపులనఁగఁ

తే.గీ. జిత్తజుని తేరికలికి రాచిలుకలనఁగఁ*
మగల [4]నెలయించు మరునిదీమంబులనఁగ
వారసతు లుందు రప్పురవరమునందు
వలఁచి వలపింపనేర్చిన తలిరుబోండ్లు 105

(సుభద్రాకల్యాణములోని పద్యము)

సీ. అతివినోదముగాఁగ రతుల మెప్పించు నీ
పచ్చల కడియాల పద్మగంధి
చక్కెరమోవిచ్చి చవులఁ దేలించు నీ
ముత్యాల కమ్మల ముద్దులాడి
తృణముగా లోఁజేయు నెంతటి [1]వానిని
నీలంపుముంగర నీలవేణి
వెలలేని పొందిక విడివడిమెఱయు నీ
కెంపుల[2]బొగడల కీరవాణి

తే.గీ. యనుచుఁదమలోన నెఱజాణతనము మీఱ
వారకాంతామణుల [3]మేలివార్తలెల్లఁ
[4]దెలుపుచును వెన్నెల బయళ్లఁగలసినగుచు
విటులు విహరింతు రప్పురవీథులందు 106

పుష్పలావికల వరన

(కళాపూర్ణోదయము)

సీ. ఇవియని యెత్తిన యిగురాకుఁ జేతులఁ
బొందుగాఁ [1]జెంజాయ[2]పొడిచికొనఁగ
వెల నుడివిన దంతముల మోవిసొంపునఁ
జెన్నుగ వేఱొక్క వన్నెదోఁపఁ

---

105 — [1] ట. మెఱచి ; [2] ట. ర్తిలలి ; [3] క. చ. వదవు ; [4] క. వలయించు.
*ఇందలి మూడవపాదము లేకుండ
"గాంతిఁజూపట్టు నవచంద్ర శశికలనఁగ" నని ట — ప్రతిలో రెండవపాదము కలదు.
106 — [1] ట. వారిని ; [2] క. చ. బుగడల ; [3] క. చ. మేలు ; [4] ట. వెన్నెల బయళ్లఁ గేలిగావించినగుచు.

గలయఁజూచుటయుఁ జూడ్కుల వెల్లిముంచిన
దొడిఁబడ [3]నెక్కువ దోఁపకుండఁ
దండడినెత్తుచోఁ దనుకాంతి చేరువఁ
బసిఁడిపువ్వులు వోలెఁ బ్రజ్వరిల్ల

తే.గీ. మరునిచక్రంబు మెయి గాపు తిరుగుననఁగ
నెసఁగు [4]నూర్పులయింతుల యెడలఁజేరి
కదుపు నుడియాడఁ బువ్వు లమ్ముదురు వీటఁ
బుష్పలావికా [5]యువతు లప్పురములోన 107

(కవిమనోహరము)

సీ. దరహాసచంద్రిక దళుకొత్తఁ బలికించు
వేడుక నందంద వెలలువేఁడి
బాహుమూలంబులు పరికించువేడుకఁ
గేలుసాచినఁ జూచి చాలనలరి
కలుషించి నెమ్మొగంబులు నూచువేడుకఁ
బలుమాఱుదండల బాగుఁదెగడి
కరము కరంబుతోఁ గదియించు వేడుకఁ
బరువంపు విరులైన [1]నురలనిచ్చి

అ.వె. విచ్చి [2]పోక కొనక [3]వేడబంబాడెదు
రసికజనము లప్పురంబులోనఁ
బొలుచుఁ బుష్పలావికల చూపులకు మున్ను
తూఁగివచ్చి తాఁకుఁదూపు విరులు 108

(గిరిజాపరిణయములోని పద్యము)

చ. [1]మొలకమెఱుంగునువ్వుఁ గరమూలములం గనుచాటొనర్పఁగాఁ
గలయఁగఁ బువ్వు [2]బెత్తులకుఁ గమ్మని యూర్పుల తావి [3]కగ్గమై
యలు లెగయంగ లోలనయనామలదీప్తులనెల్లఁ బువ్వులం
దెలుపుగఁబుష్పలావికనతీతతి యెత్తు లతాంత[4]దామముల్ 109

---

107 – [1] క. తేజాయ, ట. గెంజాయ ; [2] ట. బొదివి ; [3] ట. నెక్కడ ; [4] క. టూర్పుల, చ. రూపుల ; [5] ట. వితతుల.
108 – [1] చ. మురల, ట. నరుల ; [2] క. పోక ; [3] క. వేడబులాడెదు, చ. వెడబుట్లాడెదు.
109 – [1] క. మెలత : [2] క. బింతులకు ; [3] క. కర్గమై ; [4] క. దానముల్.
109, 110 చ. లోపేవ.

సీ. కరమూలముల నునుఁగాంతి [1]పూవులు [2]గట్టి
మరుబాలికాచ్ఛాయఁ బురుడుసేయ
నలరులెత్తిన [హస్త] తలముల చెలువంబు
చిత్తజు చిగురుల చెలువుగెలువ
బొమలందు మురిపెంబు పుట్టించు వాలుఁజూ
పులు కామునలరుఁ దూపులజయింప
వెలయాడు సరసంపుఁబలుకుల యొప్పు ర
తీశువీణాశ్రుతి నెలమిమించ

తే.గీ. మదను వరియింపఁ బుష్పదామంబువట్టి
యమరనిల్చిన రతిచెన్ను నభినయించి
లీలనిత్తురు సుందరశ్రీలుమెఱయఁ
బుష్పలావికాజనము లప్పురములోన 110

## వేశ్యావర్ణన

(హరివంశములోని పద్యము)

సీ. అంగరాగద్యుతు లను సంధ్యలడరంగఁ
గుచచక్రయుగములు కొమరుమిగుల
నెలనవ్వులను వెన్నెలల ముంచికొన వద
నాంబుజముల చెలువగ్గలింప
శ్రవణభూషణరుచిజాలంబు పొదువ, న
పాంగాంశులను మీనపంక్తినిగుడ
ఫాలార్ధచంద్రులొప్పఁగఁ గుంతలంబుల
కప్పునఁదనరు చీకట్లుమెఱయఁ

తే.గీ. దమకుఁజిత్రసౌందర్యవిధములు మెఱయు
తెఱఁగు విటకోటి చూడ్కుల దిగువమరుని
మదకరుల రూపులైయున్న మాడ్కివార
వనిత లొప్పుదు రప్పురవరమునందు 111

---

110 — [1] క. పూలు ; [2] ట. గట్టిన.

## సరోవర్ణన

### (పూర్ణచంద్రోదయములోని పద్యము)

క. అలోలవీచి [1]డోలా
జాలవిహరమాణచక్రసారసహంసీ
కోలాహలనిస్వనవా
చాలములై యప్పురంబు సరసులు దనరున్ 112

## ఉద్యానవర్ణన

### (లక్ష్మీపరిణయములోని పద్యము)

మ. తమ వక్త్రాధరకేశయాననయనోద్దామప్రభావంబునన్
రమణంబోలుదురన్న దత్పురసతుల్ రాజీవబంధూకభృం
గమరాళోత్పలరాజి నూరి వెలి వల్కన్నీర ద్రొబ్బించిన
ట్లమరుం దోయజషండముల్ పురవరోద్యానంబులందందమై 113

తే.గీ. అళులత్రొక్కనంజేసి మట్టవిసియాడు
[1]నంచపదువులు సరకాల [2]నదరుచున్న
గాలికొలంకులం దమ్మికెంధూళియెగయం
బచ్చవిల్తుని దండెత్తి వచ్చినట్లు 114

### (గిరిజాపరిణయములోని పద్యము)

క. నూనంబులు నిందిందిర
గానంబులు [1][ మదపరభృత ] కలకంఠకుహూ
స్వానంబులు నప్పురియు
ద్యానంబుల నమరుం దరువితానంబుల[2]పైన్. 115

### (వీరభద్ర విజయములోని పద్యము)

సీ. [1]మదషట్పదంబుల మధుపాన భూములు
రాజకీరంబుల రచ్చపట్లు
పుంస్కోకిలంబుల భోజనశాలలు
మలయానిలంబుల మలయు నెడలు

---

112 – [1] ట. దోలన.
114 – [1] క. పవలలు, చ. పవల, ట. పదువులు ; [2] చ. నడుమనున్న, ట. నదరకున్న.
115 – [1] క మత్తకోకిల, చ.ట. మత్తకీర ; [2] కోన్.

నవమయూరంబుల నాట్యరంగంబులు
మకరకేతను [2]సభామండపములు
విటవిటీజనముల విరులచప్పరములు
మధులక్ష్మి నైపథ్యమందిరములు

తే.గీ. నలవసంతుని లీలావిహారసీమ
నిట్టలంబుల[3]తలపుల పుట్టినిండ్లు
చిరపరిశ్రాంతపథికసంజీవనములు
[4]పావనములు నప్పురము కేళీవనములు. 116

ఉ. పూవులప్రోవులై చిలుకబోదలకోయిలపిండు మందలై
[1]తావులదీవులై యలివితానము గానము తానకంబులై
కావను [2]బండఁజాలుట త్రికాలముఁగల్గ వరంబు గన్నయ
ట్టై వనవాటి పొల్పగుఁ బురాంతికభూముల నెల్లఁజూడఁగన్. 117

చ. చిరవిభవప్రదేశములు చిత్తజు రాజ్యరమానివేశముల్
పరభృతకీరజాలములు భవ్యనికుంజలతాలవాలముల్
గురుకుసుమాభిరామములు కోమలసత్ఫలరమ్యధామముల్
పురవనవాటికల్ విమలభూరిసుగంధవిశేషపేటికల్. 118

చ. [1]దళముగ రాలు నూతనలతానివహంబుల పుష్పరేణువుల్
పులినతలంబులై చెలువుఁబూనఁగఁ తేంట్లులతోడఁ గేతకీ
దళములు పెద్ద యోడలవిధంబులఁ దేలఁగఁ బాఱు[2]నేఱులై
ఫలరసపూరముల్ పురియుపాంతవనంబుల నెల్లచోటులన్. 119

క. [1]హేలావతులును బురుషులు
కేళీగృహములను మదనకేళిఁ జరింపన్
రాలిన మృగమదమెల్లను
వాలెరువగుచుండుఁ బురమువనముల కెల్లన్. 120

---

116 – [1] ట. మధు ; [2] క. సుధా ; [3] చ.ట. వలతుల ; [4] చ.ట. పావనముల న్వరమ్ము కేళీవనములు.
117 – [1] క. నూవుల ; [2] క. ఖంఠ.
119 – [1] క. దళిమగ ; [2] క. మేరలై.
120 – ట. లీలావతులు.

## మారుత వర్ణన

సీ. రమణీయమందిరారామనానావిధ
పుష్పరేణువు [1]లోలిఁబోసికొనుచు
బహుగంధశీతలవిహరణదీర్ఘికా
జలశీకరంబులఁజల్లికొనుచు
సతతదానాంబునిష్యందసామోద్భవ
సురభిగంధంబుల[2]నొరసికొనుచుఁ
గాశ్మీరవిరచితకామినీఘనకుచ
స్థలపత్త్రవల్లులఁ దలఁచికొనుఁచుఁ

తే.గీ. బజ్జ నంతంత దగులఁ జూపఁబవిధమున
వెనుకదేంట్ల దాటులు వెనువెంటఁ దిరుగఁ
గ్రాలునెల్లెడ మృదుగతిఁగాముమత్త
వారణంబనఁ బౌరసమీరణంబు 121

సీ. కలయంగ విపణివీథులయందు వివిధంబు
లైన యామోదంబు లాదరించు
లలితలీలోద్యానములయందు విహరించు
గృహదీర్ఘికలయందుఁ గేలిసల్పు
నలఁతివాకిళ్ల నల్లల్లన సొచ్చు ను
ల్లాసియై మేడలయందుఁ బొలయు
నెలఁతల కుంతలంబులచిక్కు లెడలించు
రతిఘర్మజలకణరాజిఁ దేల్చు

ఆ.వె. మానినీజనముల మనములు నురియాడుఁ
దిన్నదనము మెఱయఁ దిరుగుచుండుఁ
బుర[1]వనమున సొంపు ముప్పిరిగొనుచుండ
మారుతంబు విటకుమారు మాడ్కి. 122

మ. వనవాటీలతికానికుంజముల క్రేవంబొంచి యాపైన మె
ల్లననేతెంచి గవాక్షరంధ్రముల లీలాగేహము ల్సొచ్చి ది
గ్గన కందర్పనితాంతకేళిరమణీఘర్మాంబుముక్తామణుల్
మనమారంగ హరించుఁ జోరునిగతిన్ మందానిలుండప్పురిన్. 123

---

121 — [1] ట. బొలి; [2] క. నొరలి.

122 — ఆ.వె. లో మొదటి పాదము తర్వాత "చ" లో "కాశ్మీరవిరచిత కామినిఘన కుచస్థల పత్రవల్లుల దలిచికొనుచు" అని కలదు ; [1] క. వరమున.

చ. చిలుకలతేరుఁ గోవిలలసేనయుఁ దుమ్మెదపిండు నారియుం
గలువల యమ్ములుం బ్రసవకార్ముకమున్ మగమీనిటెక్కెమున్
మలయసమీరుప్రాపుఁ గల మన్మథుఁడప్పురిలోనఁ గ్రుమ్మఱున్
లలనల ప్రాపునం బతుల లజ్జల నుజ్జనసేయుచుండగన్. 124

## పుష్పలావికలు

చ. గురుకుచయుగ్మముల్ గదలఁ గోమలపాణితలాగ్రదీధితుల్
గరము వెలుంగ వాలుఁదెలికన్నుల చూపులు క్రేళ్లు దాఁటఁగా
మురిపెముతోడ నిల్చి కరమూలరుచుల్ దివిఁబ్రాఁకజోకలై
యరుదుగఁబువ్వుటెత్తు లొగినమ్ముదు రప్పురిపుష్పలావికల్. 125

చ. కలికితనంబు లీను తెలికన్నులు చిక్కని గుబ్బచన్నులుం
బలుచనిచెక్కులుం గలిగి పంచశిలీముఖరాజ్యలక్ష్ము ల
ట్లలరి సమస్తలోకహృదయంగమలీలలఁ బుష్పలావికల్
వెలయుచుఁ బువ్వులమ్ముదురు వీథుల నప్పుటభేదనంబునన్. 126

చ. అరుదుగ [ నొప్పు ] నప్పురి వనాంతలసన్మణిమందిరంబులన్
మరకతగేహళీద్యుతిసమాజము పర్వినయట్టి[1]ముంగిలిన్
బరువడి ముగ్ధలైన నవపద్మదళాక్షు [ లెడంద ] మోదమం
కురితముగాఁగ నమ్ముదురు [2][కోమలపుష్పమనోజ్ఞదామముల్] 127

## వేశ్యావర్ణన

చ. అలవడి దేవకామినులయట్లనె యప్పురి కాంతలెంతయున్
జెలువు వహించియున్న సరసీరుహగర్భుఁడు మర్త్యభావమున్
దెలుపుటకై యొనర్చె గణుతింపఁగ వీడెపుఁ గెంపుసొంపులున్
గలికితనంబులీను తెలికన్నులు మూయుటలుం గ్రమంబునన్. 128

చ. పగఱకు సంగరస్థలులఁ బాఱినవారికి వారిఁ గూడుటే
తగు నటుగాదెయేని విదితంబుగ దేశము మానిపోవఁగా
నగునను నీతిపొందెఱిఁగి యప్పుడు దాఁ బ్రతిబింబమూర్తియై
తొగలసఖుండు సొచ్చెఁ బురితోయజనేత్రల చెక్కుటద్దముల్. 129

సీ. కలితసౌందర్యరేఖల మించు మదనుని
రతిమీఁది కాంక్ష మోరంగఁజేయ
సత్కాంతి విలసిల్లు చంద్రుని రోహిణి
సతిమీఁది మోహంబుఁ జప్పసేయ

---

127 [illegible]

రాజితంబగు రాజరాజతనూజుని
మది రంభపై మేలు వదలఁజేయ
నవ్యతేజోమూర్తి నలచక్రవర్తికి
దమయంతిపైఁ బ్రేమ శమనసేయఁ

తే.గీ. గలిగి మెలగంగ నేర్తురు ఘనవిశేష
నతననన్నుతరతికళాచారువిభవ
లలితనిజరూపరేఖావిలాసమహిత
వరగుణంబుల నప్పురి వారసతులు. 130

సీ. మెఱసిపోని తళుకు మెఱపులు రతికేళి
గలికి రాచిలుకలు పలుకనేర్చు
బంగారు ప్రతిమలు ప్రాణంబు లెసఁగిన
చిత్రరూపంబులు చిత్తభవుని
మోహనాస్త్రంబులు ముదితలై చరియించుఁ
జంద్రరేఖలు మహీస్థలి నటించు
కల్పవల్లులు పులుగడిగిన ముత్యంపుఁ
దళుకులు శృంగారతతులు చెలులు

తే.గీ. కన్నులార్చెదు వేలుపు కన్నెలౌఅవు
వెలుపుమెత్తని మణిశలాకలు విలాస
సీమలనఁ గాముకేళికిఁ జిత్రగతుల
వాసికెక్కుదు రప్పురి వారసతులు. 131

సీ. హరినీల[1]రుచుల నీలాలకంబులుగావు
చిత్తజు మధుపశింజినులుగాని
క్రొన్నెలవంక[2]బాగుల భ్రూలతలుగావు
విషమాస్త్రు తియ్యని విండ్లుగాని
యలనంబులైన వాలారుఁ జూపులుగావు
రతిరాజు మోహనాస్త్రములుగాని
బంధురస్థితిఁ బొల్చు కంధరంబులుగావు
కందర్పు విజయశంఖములుగాని

తే.గీ. నళిన[దళ] లోచనలుగారు నడువనేర్చు
కంతు నవశస్త్రశాలలుగాని యనఁగ
నంగకంబుల సౌభాగ్య మతిశయిల్ల
వారసతు లొప్పుదురు పురవరమునందు. 132

132 - [1] క. రుచిర, చ. రుచి ; [2] ట. లాగుల.

ఉ. వాలికచూపుఁదూపు లిరువంకలఁ జూపఱమీఁదఁ దూల లీ
లాలసమందయానముల నందెలు చిందములై చెలంగ నీ
నాలుగు[1] దిక్కులం[2] గలయనంపిన కాముని సేనలో యనన్
బాలలు నిండుజవ్వనులు ప్రౌఢలు లోలలు మింతురప్పురిన్. 133

క. జిగిబిగి గల చనుగవలును
బగడపు[1]టధరములుఁగలికి పలుకులు మురువుల్
నగు[2]మొగము లంచనడపులు
తగవులు నప్పురము వారతరుణులకొప్పున్. 134

చ. పదములు చారుపద్మములు భాసురకంఠము లొప్పుశంఖముల్
రదములు కుందముల్ కచభరంబులు నీలములట్లు[1]గాఁగ స
మ్మదమున కాంతలై నిధులు మానుగనున్నవియైన నాపురిన్
సుదతుల తుచ్ఛమధ్యములఁ[2] జొక్కిన లేములు బాయువెన్నడున్. 135

## పురవర్ణన

ఉ. అతిసమాను లర్జునసమాధికశూరులు దేవవర్ణినీ
పుత్త్రమహాధనుల్ విదురపూర్ణగుణుల్ మదనాయుధోపమా
[1]పాత్రులు నుగ్రసింహనిభబాహుబలుల్ పరగంగ బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రగణికానుభటోత్తము లప్పురంబునన్. 136

మ. శరధి ప్రఖ్యము వేదమూర్తులు కుభృత్సంకాశము ల్మారుతో
ద్ధురవేగంబులు కిన్నరేశధను లుద్దూతారు లభ్రంకష
స్ఫురణౌన్నత్యము[1] లభ్రగేహనిభముల్[2] పుణ్యాప్తముల్ తత్పురీ
పరిఖావిప్రగజాశ్వవైశ్యసుభటప్రాకారసౌధోన్నతుల్. 137

ఉ. భామినులెల్లఁ బద్మినులు బ్రాహ్మణులెల్లఁ గృతాధ్వ[1]రోత్సవుల్
భూమిపసూనులెల్లఁ బటు[2] భూరిభుజాబలవిక్రము ల్వీట
గ్రామణులెల్లఁ[3]గామరసకావ్యకళాకలనావిశారదుల్
కోమటులెల్ల నర్థకులు గుజ్జములెల్లను దేజులప్పురిన్. 138

---

133 - చ.లో లేదు ; [1] క. దిక్కునం ; [2] క. గలువ.
134 - [1] క.చ. రదములు ; [2] క. మొగమంచ.
135 - [1] ట. గాన ; [2] చ. జోకిన, ట. జొచ్చిన.
136 - [1] ట. పాత్రములుగ.
137 - చ.లో పూర్తిగలేదు. [1] క. నాగ ; [2] క. పుష్పోపముల్.
138 - [1] క.చ. రోత్సుకుల్ ; [2] క.చ. [illegible] [3] [illegible]

తే.గీ. నూఱు క్రతువులు సేయని పాఱునిల్లు
కోటిపడగలులేని కిరాటుగృహము
జాతిరత్నంబుగాని పాషాణకులము
వెదకి చూపంగలేరు పన్నిదమునకును. 139

క. తిలకంబులఁ గెమ్మోవుల
వలనగు పాపటల మెఱయు వనితల కరణిం
దిలకంబులఁ గెమ్మోవుల
వలనగు పాపటల వృక్షవాటిక లమరున్. 140

ఉ. వారవధూముఖాంబురుహవాసనఁ గ్రోలితదబ్జలోచనా
చారుతనూలతాశిశిరచందనచర్చలఁ గ్రాలి తద్వధూ
భూరి[1] కటిప్రదేశహతిఁ బోవఁగ నేరక సోలి నిచ్చలున్
సౌరభశైత్యమాంద్యగతిఁ జైత్రసమీరము వీఁచుఁ బ్రోలిలోన్. 141

ఉ. మాడలునూఱు జీతమొక మానిసికి న్నెలనాళ్ల కట్టడ
మ్మాడకు నూఱుచిన్నములు మానుగఁ జిన్నము నూఱుగాను ల
వ్వాడనె కొడ్డకయ్య + ల వత్తురు కానుకు నూఱుబయ్యెపుం
బోడలు [1]తెక్కు ప్రానఁగులు పోకకుఁ బుట్టెడు పట్టణంబునన్. 142

ఉ. అందములై మధువ్రతవిహారసమంచితమంజరీమధు
స్యందములై మనోజ్ఞఫలసంపదాపరిణద్ధశాఖమా
కందములై దళన్నళినగంధవిశంకటదీర్ఘికారమా
కందములై దనర్చు నవకాననము ల్తదుపాంతభూములన్. 143

శా. సందానీకృతసాంద్రచందనలతాజాలంబులం దూఁగి మా
కందీమంజులమంజరు ల్గదల వీఁకన్ సోఁకి క్రీడానరో
మందాందోళితవీచికావితతుల న్మట్టాడి చిత్తంబులా
నందించున్ విహరించు నప్పురములోనం గాలి యెక్కాలమున్ 144

సీ. ఘనసారకస్తూరికాగంధము లనన్య
గంధబంధంబులు [1]గలపి కలపి
తను[2]మితవల్లికాలసితవీథులఁ జొచ్చి
చని సరోగృహముల మునిఁగి మునిఁగి

---

141 - 1 క. కటీప్రదీని.
142 - 1 పెక్కుప్రానుఁగులు, చ.లో పూర్తిగలేదు.

సమధికాహార్యాంగసంగీతములతోన
కన్నెతీఁగెల కాట గఱపి కఱపి
కుముదకుట్మలకుటీకోరకంబుల దూఱి
యలిదంపతుల నిద్ర దెలిపి తెలిపి

ఆ.వె. యను[3]దినమును నప్పురాంతికంబున[4]గట్టి
వాలుఁబోలె విప్రవరుఁడుఁబోలె
[5]నట్టువోజువోలె నచ్చిన చెలివోలె
మలయు చుండు మందమారుతంబు 145

ఉ. కుండలి [1]రాజకన్యకలకుం [2]దమ వాచవిఁ జూపి ముత్యముల్
బండెడునీటఁ దోఁగి పరిపాండురకోమలపాండ్యకామినీ
గండరతిశ్రమాంబువులు గైకొని యల్లన రాఁదొడంగె శ్రీ
ఖండపుఁ గొండగాడుపు ల[3]ఖండతఁ బూవిలుకాఁడు మెచ్చఁగన్ 146

సీ. మాధవీమంజులమంజరీమకరంద
ధారాలవంబులఁ దడిసి తడిసి
జలజాతజాతసంకులసారకాసార
వీచిపంక్తులమీఁద విడిసి విడిసి
పరపుష్టవరపుష్టికరపల్లవోల్లాస
చూతపోతములలో సుడిసి సుడిసి
రతివిభ్రమాక్రాంతరమణీజనస్వాంత
జనితఖేదములలో జడిసి జడిసి

తే.గీ. కలితపరిపాకకవితావికాసకరణ
చతురవిహరణముదితషట్చరణమిథున
మధురకలగీతిసంస్తూయమానుఁడగుచుఁ
గదలి చనుదెంచె దక్షిణగంధవహుఁడు 147

సీ. వికచారవిందదీర్ఘిక [1]మోహరించిన
నలి కమ్మతావుల ననఁగి పెనఁగు
కుసుమితనవలతావిసరంబుఁ గదిలించి
[2]యెలదేనియలసోన[3] నలముకొనుచు

---

145 — [1] క. చ. గరపి గరపి ; [2] క. చ. మతద్వ ; [3] చ. దినమ్ము ; [4] క. చ. గద్ది ;
[5] నట్టు వొజ్జ.

146 — [1] క. కావరాచ. చ. రాచ ; [1] ట. రాచ ; [2] క. చ. దను ; [3] క. చ. ఖండప
మాన్విలుకాడు.

సహకారపాదపచ్ఛాయలకై యేఁగి
శశికాంతవేదుల నంచలించి
సురతకేళిశ్రాంతి సొగియు ముద్దియలపై
చిట్టాడు తనువుల చెమటలార్చు

తే.గీ. చంచరీకంబురీతిఁ బర్జన్యుభాతి
విరహపరితాపహరుమాడ్కి సురటిపోల్కి
నప్పురంబున సకలజనానుమోద
కరణదక్షుఁడు దక్షిణగంధవహుఁడు 148

సీ. పాండ్యసీమంతినీపాండుగండాభోగ
పులకాంకురంబులఁ బ్రోదిచేసి
లీలారతిశ్రాంతచోళవిలాసినీ
ప్రస్వేదజలములఁ బాయఁజేసి
కాంచీపురాంచితకమలాననానూన
మారధైర్యంబుల మానమెఱిఁగి
కర్ణాటకామినీకాముకకామిత
ప్రణయసంగంబులఁ బదిలపఱిచి

తే.గీ. కుంతలస్త్రీల యాలోలకుంతలంబు
లెలమిఁదీర్చుచువచ్చె నేర్పులు దలిర్ప
మహితమధుమానవాసరమండనములు
మలయగిరిజాతశీతలమారుతములు 149

సీ. మృదువేదికంటి [1]క్రొవ్వేడుగఁబుట్టినయట్టి
కందర్పు మాఱట బొంది యనఁగ
నెలదీఁగెలనియెడు నెలనాగలకుఁ [3]ప్రీతి
నర్తనంబులు సూపు నటుఁడనంగఁ
గళికల పరువంపుఁ గన్నెఱికంబులు
వెరవుతో నెడలించు విటుఁడనంగ
[2]వనములఁ గ్రీడించు వల్లభరమణుల
సురతాంతమునఁ గ్రోలు సురటి యనఁగ

---

148 – [1] ట. విహరించిన ; [2] క. చ. లీల ; [3] చ. గ్రోలుకొనుచు.

తే.గీ. నామనికిఁ బ్రాణమనఁగ నుద్యానమునకు
సొబగనంగను గొలఁకుల చుట్టమనఁగ
నచ్చవెన్నెల నెచ్చెలియనఁగఁ[3]బొలిచెఁ
జందనపుఁగొండఁ బుట్టిన చల్లగాలి 150

ఉ. శాలివనాళిఁ గ్రాలి జలజాతపరాగము దూలి పద్మినీ
కూలలతాంతసౌరభముఁ గ్రోలి మధూలితపక్షజాతవా
తూలమునేలి వాఃకణము దోలి మదేభమదాంబుధారలం
దేలి వనాంతరాళములఁ ద్రిమ్మఱు గాలి ప్రమోదశాలియై 151

నాయకవర్ణన

సీ. తనయాజ్ఞ చతురంతధారుణీపాలక
శిరముల కవతంసపరికరముగఁ
దనకృప శరణాగతక్షితీశ్వరులకు
సతతంబు వజ్రపంజర[1]మనంగ
తన [యీగి యాచక] జనులకు వేల్పుల
నచ్చినపాడియై యిచ్చనల్ప
తనకీర్తి దిక్ప్రతంబినులకు నొప్పు లి
ప్తార్ద్రచందనలీల నతిశయిల్ల

ఆ.వె. వఱలువాఁడు సూర్యవంశావతంసుండు
భరతనలదిలీపచరితఁ బఱఁగు
కీర్తిధనుఁడు నా సుకీర్తివసుంధరా
వల్లభుండు రాజవల్లభుండు 152

క. శశిసదృశుం [1]డనదృశతర
దశదిక్కలితయశుండు ధరణీరక్షా
కుశలతజనలోకము తన
వశముగ నా నగరమేలె వైభవయుక్తిన్ 153

క. శోభాగణనీయయశో
లాభాగమనాభిలాషలంపటుఁ డగుచున్
భూభాగ మేలె నాతఁడు
నాభాగ దిలీపరంతి [1]నహుషుల భంగిన్. 154

---

150 — [1] ట. క్రొవ్వడు పంగఁజాలిన ; [2] ట. వనమున ; [3] చ. ట. బొలసె.
152 — 160 చ. లోపవ, [1] ట. మొనంగ.
153 — [1] క. దనితతర.
154 — [1] క. దేవల.

క. ఆ రాజు రాజ్యమున ధర
యారూఢి వహించెఁ జిరతరాయురనేక
శ్రీరుచిరపుత్త్రపౌత్త్రన
దారోగ్యసుభాగ్యసంతతానందమునన్. 155

* * *

ఆ.వె. ఇందువదన బాష్పబిందుసంయుతములై
క్రొత్తముత్తియములు గ్రుచ్చినట్టి
కరణి నీదు కలికి కన్నుల తెప్పలఁ
గాన బడెడి దేమి కారణంబు. 156

సీ. అఱకాళ్ల లత్తుక [1]మెఱుఁగెక్క దదియేమి
పదముల నందియ ల్గదియ[2]వేమి
బలితంపుఁగటితటి మొలనూలు [3]లేదేమి
పలిచన్నుగవ గంధములఁద[4]వేమి
గళమున హారముల్ గనుపట్ట [5]వేమి తాం
బూలరాగము మోవిఁ జాలదేమి
కన్నుల కాటుక చెన్నొంద దదియేమి
నెఱివేణిఁ బువ్వులు మెఱయ[6]వేమి

తే.గీ. వేడినిట్టూర్పు నిగుడంగ వెల్లఁ బారి
చేయి చెక్కిటఁ జేరిచి చింత నొంది
యెన్నఁడును లేమి నేఁడు నీవీ తెఱఁగున
నుండుటదియేమి చెప్పుమో యుత్పలాక్షి. 157

క. వారిరుహానన నీకుం
జేరిక నపరాధ మేను జేసితినో నా
వారలు చేసిరొ నేఁడి
ట్లూరక చింతింపుచుండు టుచితమె నీకున్. 158

క. నా రాజ్యము నా ప్రాణము
నేరుపుమై నెన్నిచూడ [1]నీయవి గావే
వారక[2]యీ చందమున వి
చారింపఁగ నేమి కతము చయ్యన చెపుమా. 159

* * *

157 — [1] క. మెఱుఁగెక్కనది ; [2] క. దేమి ; [3] ట. లేదేమి ; [4] క. లేమి ; [5] క. దేమి ;
[6] క. దేమి.

159 — [1] క. యది ; [2] ట. యానందమున.

చ. తలఁప నృపాల నీవలనఁ దప్పొకయింతయు లేద యెన్నఁడున్
నెలకొను లోకభర్తవగు నీకును బట్టపుదేవివైయైన యీ
యలికుల నీలకుంతలికి నవ్వుల నెగ్గొనరించు వారలుం
గలరొకొ యివ్విధంబునకుఁ గారణ మెంతయు విన్నవించెదన్. 160

సీ. మహనీయకాంచనమౌంజీనమేతమై
జిగి చెల్వమగు మృగాజినము మెఱయఁ
బరిలిప్తపాండురభసితరజోభూషి
తములైన బ్రహ్మసూత్రములు మెఱయఁ
గరనఖచంద్రికాకలితయై నిర్మల
స్ఫటికాక్షమాలిక ప్రజ్వరిల్లఁ
బుణ్యతీర్థోదకపూర్ణమై దీప్తిమం
డలిఁ బొల్చు మణికమండలువు మెఱయఁ

ఆ.వె. బల్ల జడల కెంపు బాలార్కరుచి సొంపు
గడవ ధరణి విభునికడకు వచ్చె
రమ్యకాంతి జితశరన్నీరదుఁడు వీ
ణావిశారదుండు నారదుండు. 161

*   *   *

## సముద్ర వర్ణన

సీ. సిరి పుట్టినిల్లు రాజీవలోచను సెజ్జ
పట్టు మహీకాంత కట్టుఁజీర
గిరులు [1]దాఁగెడి [2]గొంది గిరిభేది పగఱకుఁ
బలుకోట బడబాగ్ని బ్రతుకు చోటు
పటుపయోధరములు[3] పానగోష్ఠిభూమి
యమృతాంశు పొడుపున కను[4]గలంబు
మరియాదలకు గుఱి మహిమల కందువ
యఖిలరత్నమునకు నాకరంబు

తే.గీ. సురల తరియిల్లు వాహినీసుందరులకుఁ
గూర్మినిలుకడ గంభీరగుణము నెలవు
[5]తరుణచోద్యంబులకు నెల్లఁ దారకంబు
వనధిఁ గొనియాడఁ జతురాననునకు వశమె. 162

---

162 – [1] చ. జాగెడి, ట. దాఁగెదు ; [2] క. గొండి ; [3] ట. పాలిప్రపాసీమ ; [4] క.చ. కులంబు ; [5] ట. తనరు నొప్పిదముల కెల్లఁ దానకంబు.

క. ధరణీధరసానుతటములఁ
బరిమళవంతములఁ జేయుఁ బాయక యెపుడున్
కరి కండూయనవిశ్రుత
సరళక్షీరప్రసూతసౌరభలహరుల్ 163

* * *

సీ. నడు మింత నిక్కించు నాసికాగ్రంబునఁ
దిరముగా నిశ్చలదృష్టి నిల్పి
రెండు గాడ్పులు నొక్కరీతిగా నంధించి
[1]మేలి కుండలికన్య మేలుకొల్పి
తల క్రిందుగానున్న తామరలాఱును
[2]గమకంబుతో నున్ముఖములు సేసి
ముక్కోణముల చక్రమున రాజు ననలంబు
నంచితంబుగ వెలిఁగించి మించి
తే.గీ. సరవిఁ జిద్గగనామృత[3]కరు గరంచి
తత్సుధాసార ధారలఁ దడియనేర్చు
పరమయోగీంద్రుఁడును బోలె భానుకులుఁడు
నతిమహోన్నతగతి తప మాచరించె. 164

వ. ఆ సమయంబున 165

## వేసవి వర్ణన

చ. మలయజ వారి[1]సేకముల మౌక్తికనూతనహారవల్లులన్
వలిపపు సన్నకావులను వారిరుహాక్షుల వీఁగుఁజన్నులం
గలిగిన [2]చల్మిరిం బ్రదికెఁగాక జనాళికి నిట్టి వేసవిం
గలదె శరణ్య మన్య మనఁగాఁ గడుఁ బెర్చె నిదాఘదాహముల్. 166

ఉ. భూచరు లంబరంబునను వోవుట మేలన నంబరేచరుల్
భూచరవృత్తి మేలనఁగ భూచరఖేచరులా జలప్రకే
ళీచరణంబు మేలన జలేచరు లంబరమధ్యయానధా
త్రీచరణంబు మేలనఁగఁ[1] దీవ్రనిదాఘము పర్వె నుర్వరన్. 167

---

164 – [1] క. మెరి; [2] క. గ్రముకంబు, చ. గముకంబు; [3] ట. మణి.
165 – చ. లో లేదు.
166 – [1] క. శీత; [2] క. చెల్మిలిల బ్రతికెగావున, ట. చల్మిరిం బ్రతికెంగాక జనాళికి.
167 – [1] క. ద్రివ, చ. ద్రివర.

క. తలఁచిన డెందము [1]గఱఁగును
బలికిన నోరెల్లఁ బొక్కు ప్రభఁ జూచిన తె
ప్పలు [2]గమరు ననఁగఁ బటుతర
విలయానలభాతి నెండ వేసవిఁ గాసెన్. 168

తే.గీ. [1]అదరిపాటున వేసవిపాదిలికొనినఁ
గలగి తొలఁగి పోనేరక మలయపవనుఁ
డిండుఁదలదూర్చు కొనియె నా నింపొనర్చె
నమరు తాళవృంతముల మందానిలంబు 169

సీ. అతిమరుద్ధూతశాఖాన్యోన్యసంఘట్ట
నోత్థాగ్నిదగ్ధ [1]దారూత్కరంబు
చండభానుప్రభా [2]సాహసజృంభణా
టోపప్రభిన్నగండోపలంబు
మృగతృష్ణికానిమ్నమిషదంబుధి [3]స్ఫుర
దవిరతోదన్య [4]భిన్నాధ్వగంబు
తప్తతోయాశయాంతర్గతత్పాలీన
కమఠనక్రగ్రాహసముదయంబు

తే.గీ. విటపకోటరసంలీన విహగకులము
నగలతాకుంజవిభ్రాంతమృగచయంబు
[5]శాతనిర్మగ్నభూధారసైరిభంబు
నగుచు మించె నిదాఘసమా[6]గమంబు 170

మ. ప్లుతనాడింధమనీరజవ్రజము సంప్లుష్టాటవీశ్రేణిభాం
కృతిమ[1]ద్ధామము ధూమ్రదిఙ్ముఖరశుష్కీభూతకాసార[2]ముల్
ఘృతనీహారము దీర్ఘవాసరము నిర్వ్యేషార్ఘవౌఘంబు పు
ష్పితహేమప్రసవక్షమారుహము వచ్చెన్ గ్రీష్మ మత్యుగ్రమై 171

ఉ. [1]వాసవదిగ్వధూటి గరువంబునఁగూడి సుఖానురక్తుఁడై
పాసి చలింప [2]రోసి పటుభానుఁడు పల్మరు[3]నార్చు దీర్ఘని
శ్వాసములో యనంగ వడచల్లగఁ బెల్లుగఁజొచ్చె నిచ్చలుం
వేసవి దావపావకనవీనశిలానికరంబు బల్పునన్ 172

---

168 — [1] క. గననగు ; [2] క. చ. గరుగ.
169 — [1] ట. అదరుఁబాటున.
170 — [1] క. దావో ; [1] చ. దారో ; [2] చ. సహనమ ; [2] ట. సహనముల్ ; [3] క. చ. దావనిదరితో ; [4] ట. నానా ; [5] ట. శాద ; [6] ట.ర్గళంబు.
171 — [1] క. ద్యాభ్రమము ; [2] ట. ముద్ధృత.
172 — [1] ట. వానర ; [2] క. రోక, ట. లేక ; [3] ట. గూర్చు.

క.　హరిశరధిఁ జొచ్చె నభవుఁడు
సురనదిఁ దలఁదాల్చె నజుఁడు గ్రమ్మఱ నం
బురుహంబుఁ జొచ్చె నతిదు
స్తరదుస్సహ [1]తీవ్రనిదాఘ సమయమునందున్ 173

సీ.　కడువేఁడిపెల్లెండ పుడమిపేర్చినఁ బ్రొద్దు
లాకాశగతియ మేలనితలంప
వాత్యాభిహతి లగ్గ వాడి వియచ్చరు
లవనిపైఁ జనుట మేలనితలంప
వడవడగా నీళ్లు లుడికిన జలచరుల్
వనచరవృత్తి మేలనితలంప
వనముల గార్చిచ్చు దనరిన వనచరు
లంబునంచరణ మేలనితలంప

ఆ.వె. వాఁడియెండ గాసె వడిగొనె సురగాడ్పు
లెసఁగె వడయుగాలి [1]యెగచివీచె
దావదహనమడరె జీవులకధికసం
తాప[2]కారియగు నిదాఘవేళ 174

సీ.　కలయంగ ధారుణీతలమగ్నితప్తమై
నుప్పరిపెనమట్టు లుచ్చియుండఁ
గులపర్వతంబులు గొలిమిలోఁ గ్రాఁగిన
యినుపముద్దల క్రియ నెసఁగియుండ
జలనిధు లుజ్జ్వలానలదాహమునఁ గ్రాఁగి
పొంగెడుతైలంబుఁ బోలియుండఁ
దనరునాకాశంబు దావపావకశిఖా
మండలివిధమున మండుచుండఁ

ఆ.వె. దలపఁదడవ మనము దరికొనుఁ జూచిన
జెప్పలెల్లఁ గమరి యొప్పదఱుఁగు
[1]నరులఁ బేరికొన్న నాలుక వొక్కు ని
దాఘకాలతపనతాపమడరె 175

173 — [1] ట. తీవ్రతరనిదాఘభయమునన్.
174 — [1] క. చ. వెగలి, ట. నెసఁగిజాల ; [2] ట. కాలమగు.
175 — [1] క. నరులువెట్టిగొన్న, చ. నరులువెరిగొన్న.

చ. మృదునయనాగ్నిఁ గ్రోలి హరుమేచకకంఠముమీఁద వ్రాలి య
జ్జడనిధిబాడబానలము చక్కటిఁదేలి రవిప్రభాతతుల్
తడబడఁదోలి దోలి బెడిదంబుగ వేడిమితోడ వచ్చె న
ప్పడమటిగాలి లోకముల ప్రాణులజాలి నిదాఘవేళలన్ 176

ఉ. ఎండెఁగొలంకు లెల్లను మహీరుహముల్ దవవహ్నికీలలన్
మండె ధరాతలం బినుపమంగల[1]మున్ వలెనుండె నట్టి యా
యెండలనేమిచెప్పఁ బరమేశ్వర యావరణాంబురాశిలే
కుండిననాఁడె పొక్కి పడకుండునె పద్మభవాండభాండముల్ 177

మ. అమరె న్వేసవి మల్లికాసుమసముద్యద్గంధకుక్షింభరి
భ్రమరంబై యరుణప్రభా[1]నలనలత్పద్మాకరంబై[2]పచే
లిమమోచాఫలమై దళత్కుసుమ[3]పాళీదేదివత్పాటల
ద్రుమమై వానరమధ్యమాధ్వగ[4]పదారూక్షద్రజోజాలమై 178

మ. అట్టి యనేహముంగడపె [1]నాన్నృపకేసరి నాల్గుదిక్కులం
బిట్టు మిణుంగురుల్ చెదర భీకరవహ్నులు మండుచుండఁగా
నెట్టన మధ్యభాగమున నిల్చి పదాగ్రము నేలనూది మా
ర్వెట్టని[2]చూడ్కు లుగ్రకరబింబములపై నిడి యూర్ధ్వబాహుఁడై 179

## వర్షర్తువర్ణన

మ. జలదాటోపవిశాల మింద్రధను[1]రంచద్వారుణీకూలము
త్కలికాదంబ[2]కదంబసాల[3] వనమధ్యస్ఫార[4]సంధ్యావళీ
కలనా[5]వాల ముదారకైతకపరాగ[6]వ్యాళ ముర్వీధర
స్థలనృత్యన్మదకేకిజాలమగు వర్షాకాలమొప్పెన్ గడున్ 180

సీ. ప్రమదమారంభించెఁ బ్రాగ్గంధవాహుండు
నుదయించెఁ బ్రతిసూర్యుఁ డుత్తరాన
జలరాశి బుధశుక్రచంద్రు లుండిరి యింద్ర
ధనువును [1]బశ్చిమముదరిని బొడిచె

---

177 — ట. ముంబలె.

178 — [1] క. నలనల ; [2] ట. భిదేళిమ ; [3] క. సాళిందేళిదత్పాటల ; [4] ట. పదారో. రుద్రాజో.

179 — 180 చ. లోలేవ. [1] యాన్వయశేఖరు ; [2] క. యూర్పు.

180 — [1] క. చంచ ; [2] క. లంబ ; [3] క. మనవద్య ; [4] క. నవ్యా ; [5] క. పాలతారకతక ; [6] క. వ్యాల.

బైట మండూకముల్ బకబకధ్వనులిచ్చెఁ
    బ్రకటించి మెఱసె నీరాళిగొంది
మిహిరాస్తమానాన మింట నెఱ్ఱలు [2]దాల్చె
    మోచె గ్రుడ్లు పిపీలికాచయంబు

తే.గీ. [3]క్రోల్చెఁ గాకంబు కలవింకకులము పొదలె
పసి నుమాళించె నింద్రగోపములు పొడమె
నాడెఁ బురి విచ్చి మఱి మయూరాన్వయములు
కురిసె [4]నిఖిలంబు మెచ్చ మేఘుఁడు సువృష్టి. 181

తే.గీ. అంబుదంబులు రత్నాకరంబు నీరు
దలిచి పద్మరాగములతో దళము దప్పి
ద్రావి దక్కింపఁజాలక ధరణిమీఁదఁ
గ్రక్కెనో యన నింద్రగోపములు పొలిచె. 182

ఆ.వె. అలుల మ్రోఁతలు డిగె నన్యపుష్పంబులు
పూయుటుడిగెఁ జంద్రు గాయుటుడిగె
నిల విరహుల నలఁపఁ దొలుకారు [1]జాలించి
మరుఁడు మూలబలము మాన్పెననఁగ. 183

క. ఉఱుముచు దిక్కుల సంధులు
విఱుగఁగ మేఘములు దాల్ప వ్రేఁగుగ దివికిన్
దొఱదొఱలుగ ధారలు ధర
నఱిముఱిఁ బడగురిసె వానలద్భుతభంగిన్. 184

సీ. శుంభదంభోధరస్తోమభీమారంభ
    గంభీరగర్జావిజృంభణంబు
దృగనహ్యచటులదీధితిమత్సముద్దామ
    [1]సతతతటిద్దామసంకులంబు
ఝంఝా[2]మరుద్ధూత [3]సారధారాసార
    నీరంధ్రతమధరణీ[4]ధరంబు
రోదోనిరోధకాగాధపాథఃపూర
    వాహినీ [5]వర్ధితవార్ధిజలము

---

181 — [1] క.చ. పొడిచెను పశ్చిమంబుదరిని. ట. పశ్చిమమున ద్వారమెత్తె; [2] ట. వాలె;
[3] క. వ్రేల్చె; [4] ట. నఖిలంబు.
183 — ట. దారించు.

తే.గీ. కర్దమస్థలచంక్రమక్రమణ [6]వర్గ
దర్దు [7]రోత్కరవికటపృథగ్విధప్ర
భూతనిర్ఘోషబధిరితాశాతటంబు
నగుచు మించె నభోనభస్యాంతరంబు. 185

క. అంభోధరముల ధారలు
కుంభినిరనవతుల వ్రేలు గుదులో యనఁగా
కుంభద్రోణంబులుగా
శుంభద్గర్జితము వాన [1]జోరునఁ గురిసెన్. 186

సీ. కంధరపటలాంధకారితవ్యోమంబు
విస్ఫురత్స్ఫురధనుర్విభ్రమంబు
సంకోచితాఖిలాశాచక్రవాళంబు
తాండవితాహిభుఙ్మండలంబు
[1]కూలంకషాభ్రకల్లోలినీసందోహ
ముచ్చావచాంబుధారోద్గమంబు
[2]కర్దమా [ ంకిత ] బలిక్ష్మాతలాభాగంబు
దూరావమజ్జితాంభోరుహంబు

తే.గీ. పథికజనచిత్తదత్తమన్మథమహాగ్ని
జాలపాలభయంకరస్తనితరవము
పక్షివీక్షణబోధదుర్భిక్షమంబు
జాప్తకరదుర్గమంబు వర్షాగమంబు 187

సీ. కమనీయనీరదకబరీవిభాసిత
దేవబాణాసనభ్రూవిలాస
నిరుపమ [1]సౌదామనీనేత్రవిభ్రమ
భాసురకందళీహాసలలిత
దళితబంధూక[2]దంతచ్ఛదశోభిత
ధవళిమవరకుందదంతవిభవ
బకమాలికాకాంతపాండుగండస్థల
యూథికాస్తబకపయోధరాఢ్య

185 — [1] ట. సంకులజీమూత సంకరంబు; [2] ట. మరుద్ధత; [3] క.చ.ట. స్ఫార; [4] ట. నభంబు; [5] ట. వార్ధిత; [6] ట. నగర్వ; [7] ట. రోత్తర.
186 — [1] క. బోరన.
187 — [1] ట. కూలంకషాప; [2] క.చ. కర్దమాత్మబలి.

తే.గీ. కేతకీగంధనవపురుహూతగోప
వనజ [3]రాజభూషణశిఖినినదవచన
[ యగుచుఁగాల మన్వల్లభునాౢక్రమించు ]
చతుర నా నొప్పె జలవాసనమయలక్ష్మి. 188

చ. మిగుల జగంబు [1]బెగ్గడిల మించెఁ [2]దదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘసముదగ్రనిరర్గళఘర్ఘరార్భటీ
లగనఘనోచ్ఛలజ్జలరుఖీళంఝుళనిర్ఝరజర్ఝరీభవ
న్నగవిగళచ్ఛిలాఘనఘనాఘనఘోషణభీషణంబుగన్. 189

ఉ. ఆ సమయంబునన్ విరహితావరణంబగు చోటఁబ్రౌఢప
ద్మాసన[1]బద్ధవిస్ఫురితుఁడై బహులాశనిజాతపాతసం
త్రాసము లేక భూరిజలధారల నెప్పుడుఁ దొప్ప దోఁగుచున్
జేసెఁ దపంబు రాజకులశేఖరుఁ డక్షయధైర్యశాలియై. 190

## శరదృతు వర్ణన

శా. శ్వేతద్వీపము చంద్రబింబము మహాక్షీరాబ్ధి దత్ జ్యోత్స్న ద
ద్భాతింగృష్ణుఁడు దన్మృగాంకము లనత్ప్రద్మాలయాక్షిద్యుతుల్
బ్రీతిం[1]బోలు చకోరదంపతులు నాఁ బృథ్వీధరుంబోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాభినుతరాకారాత్రు లత్యున్నతిన్. 191

ఉ. అంత నిరంతరంబును దురంత[1]పమున్ మతిమంతమయ్యె హే
మంత ముదారవిస్ఫురితమంజులమౌక్తిక[2]చారురుల్లరీ
కాంతిలసత్తుషారకణికాపరిగుంభితభిల్ల [3]భిన్నసీ
మంతము దుర్దమక్రమవిమర్దితపద్మవనాంత మెంతయున్. 192

తే.గీ. హిమముచే సంఖరంబెల్ల [1]నిడుముకొనిన
నుష్ణకరుఁడును గరము లొయ్యొయ్యఁజాచి
తాను ననలాంశ [2]జనియింపఁబూనె[3]ననిన
నెంత యనవచ్చు నింక హేమంతమహిమ. 193

---

188 – [1] క. సౌదామనేత్ర విభ్రమప్రవిలా ; [2] క.చ. దంత్త ; [3] ట. రాగ.
189 – [1] ట. బగ్గడిల ; [2] క. తదద్భుత.
190 – చ. లో లేదు. [1] క. బంధ విస్ఫురణుఁడై.
191 – [1] ట. జారు.
192 – [1] ట. సమున్నతి ; [2] ట. జాల ; [3] క. విద్ధ.
193 – [1] ట. నిముడుకొనగ ; [2] ట. ధరియింప ; [3] ట. వనఁగ.

ఆ.వె. పొడుపుఁగొండమీఁదఁ[1]బొడుచుట మొదలుగాఁ
[2]ఖరుగు వెట్టి నినుఁడు పశ్చిమాద్రి
[3]మెఱుపుఁజొచ్చెఁగాక మెలసిన చలిచేతఁ
జిక్కఁజిక్కె ననఁగఁ జిక్కకున్నె. 194

ఆ.వె. శంభుకంట నొకటి జలరాశి నొక్కటి
మఱియునొకటి మనుజమందిరముల
నొదిగియుండెఁగాక యున్న మూఁడగ్నులు
చలికి నోడి భక్తి సలుపకున్నె 195

## హేమంత వర్ణన

మ. బలుసుంబండుల చాయ శాలివనముల్ పక్వంబుగాఁ బండి కాం
తలకుం గుంకుమచర్చ మైనలఁదఁ జిత్తప్రీతి సంధిల్లెఁ[1] ది
ప్పలుగాఁ బాయక మూఢమంచుఁ గవిసెన్ బంధూకము ల్చెన్నుగా
నెలమిం బువ్వులుదాల్చి కెంపు మిగిలెన్ హేమంతమాసంబునన్. 196

సీ. ప్రత్యూషజృంభితప్రాలేయదుర్లక్ష్య
మాణపద్మభవాండమండితంబు
సంకు[1]లద్వానరనమయ[2]మందిరభవ
ద్యోతఖద్యోతభానూత్కరంబు
వితతనిశీథినీవేళాప[3]హసిత
శీతరుగ్బింబవిజృంభణంబు
శీతాళుదుర్విధవ్రాతసంచితకరీ
షాగ్నిధూమావృతాశాంతరంబు

తే.గీ. నగుచు నంతంత కెనఁగె నీహారధరణి
ధరనముద్భూతనిబిడశీతలసమీర
[4]ణాభిసంపాతజాత[5]మాయాతిభీత
జంతుసంతానమగుచు హేమంతమహిమ. 197

సీ. లాలితచంద్రికాజాలంబు మత్తశుం
డాలంబు ఘనభిదాలోల[1]రమణ
బాలకదంబ ప్రవాళంబు విగతజం
బాలం బకలుషితాంభోలఘుత్వ

---

194, 195, 196, చ. లో లేవు; 194 – [1] క. పొడిచింది; [2] క. పరువు; [3] మరుపు.
196 – [1] క. తీవులుగా.
197 – [1] క. మదధ్వాన; [2] క. మండిత; [3] క. హాస్ఫిత; [4] క. కోధి; [5] క. ఛాయా.

మూలముద్యత్ సరిత్కూల ముజ్ఝితజలా
భీల[1]ప్రవాళకల్లోల మంబు
జాలంకృతిశ్రీవిశాలాంతరాళమ
రాళజాలాలతికాలవాల

తే.గీ. మమలదిక్చక్రవాళ మస్తమితబర్హి
తతివచోహేల[2]ముదితకుందప్రభాను
కూల [ముదితాజి కండూయనైకహృన్ని
పాల] మతులజృంభితశరత్కాల మొప్పె. 198

ఉ. భూనతికిన్ నభంబునకుఁ బోల్పెనఁగంగ శరత్సమాగమం
బానకలప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసితరాజహంసగతిఁబాసి ప్రసన్నసరస్వతీక మ
బ్జాననశోభితంబు నగు నబ్జజయానముతో సమానమై. 199

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసారథముఁదాల్చి సుధాంశువి[1]కీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరపూరితంబులై. 200

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ[1]బొంపిరి [2]వోవ నిరస్తనీరదా
వరణములై[3] భవత్కమలవై భవలక్షణముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్. 201

సీ. వారిపంచలి యన వారికిఁ జవియయ్యె
విరులఁ దుమ్మెదలు వావిరుల [1]వెలసెఁ
[2]గాశంబు తుహినసంకాశమై విలసిల్లె
ఘనములు నైర్మల్యఘనములయ్యె
నగములఁబాసి పన్నగములు విహరించె
గతులఁ జలించు సంగతులఁ గూర్చెఁ
గలకంఠరుతులు వికలకంఠరుతులయ్యె
నెలయించె వెన్నెల యెలసి యెలసి

---

198 - [1] ట. మరుణ. [2] క. ముచిత.
200 - [1] క.చ. విసార.
201, 202, 203 - చ.లో శేవు ; 201 [1] క. జూపిరి ; [2] క.ట. వోయి ; [3] ట. దళ.

తే.గీ. తారకంబులు దీప్తివిస్తారకంబు
లగుచుఁ దెలుపారి పొలిచె వియత్తలమున
మదవిఘూర్ణతఁ గరులు సమ్మదముఁ దాల్చె
నభి[3]నుతంబైన నవశారదాగమమున. 202

శా. ఆ హేమంతదినంబులన్ ధరణిపాలాగ్రేసరుం డద్భుతో
త్సాహాటోపమునన్ గళద్వయసపాథఃపూరమధ్యస్థుఁడై
యాహారంబు జలంబుగా నచలదేహస్వాంతుఁడై నిర్జర
వ్యూహంబుల్ వెఱగందఁగా మెఱసె నత్యుగ్రప్రకారంబునన్. 203

## వసంత వర్ణన

క. అంత వసంతము వచ్చిన
సంతసమునఁ బొంగి విరహిజనముల మీఁదన్
గంతుం డెంతయుఁ బువ్వుల
కుంతం బెగురంగవైచి కోయని యార్చెన్. 204

ఉ. సంతతపుష్పసౌఖ[1]సుజాత[2]దినాంతము[3]పాంథమర్మభి
త్కుంత ముదాత్తమత్తపికఘోషితమన్మథరాజ్యవైభవో
దంతము జంతుజాలసుకరస్థితిమంతము దూరధూతహే
మంతమునై వసంతము సమగ్రతఁజూపె వనాంతరంబులన్. 205

సీ. కలకంఠమధురవాగ్వైఖరీకారణ
[1]మహితసారస్వతమంత్రవిద్య
నానావనీజాతనవయౌవనప్రదాం
చితరసాయనయోగసిద్ధఘుటిక
కుసుమసాయకనిరంకుశరాజ్యసప్తాంగ
సన్నాహ [2]వైభవాస్థానసీమ
మందమందాగతమలయానిలాంకుర
వ్యాపారసులభ[3]ఘంటాపథంబు

తే.గీ. చేతనద్వంద్వసౌఖ్యసంజీవకరణి
విరహిదశ[4]మదనావేశవిషమవేళ
శిశిరమదకుంభిసంరంభసింహమూర్తి
లీల నేతెంచె మధుమానకాలమంత. 206

---

202 - [1] ట. నెలసె ; [2] క. కాకంబు ; [3] ట. మతంబైన.
205 - [1] ట. సుజాతి ; [2] ట. దిగంత ; [3] క.చ. వాద.
206 - [1] క.చ. మధుర ; [2] క.చ. వైభవస్థాన ; [3] క. కరఘట్టపథము ; [4] క.చ. ముదశా.

సీ. తమకించు తేఁటిమొత్తముల యాఁకటి [1]పంట
కొదమరాచిలుకల కోరు కోర్కి
సరవి కోకిలములఁ జదివించు నొజ్జలు
మ్రాఁకుల ముదిమెల్ల మాన్పు వెజ్జు
విలసిల్లు దక్షిణానిలుతపంబు ఫలంబు
చండివియోగుల గుండెదిగులు
[2]మతులలోనుబ్బు దంపతుల ప్రాణపదంబు
వెలఁదుల ప్రాణంబు వీడుకోలు

తే.గీ. వఱలు వలఁతేని తగురాజ్యవైభవంబు
పసిమినఱగిన బడుగుతాపసుల మనసు
మఱల నెసకొల్పు మగసిరి మందునగుచు
జగతి నంతంత కెనఁగె వసంతమహిమ. 207

సీ. ప్రాలేయవిభ్రమారంభంబు బొదివిచ్చఁ
తరులకారాకులు ధరణి దుల్ల
నఖిలజీవులకు నత్యానంద ముప్పొంగ
వనవాటికలకు యౌవనము వొదల
మృదుగతిఁ గమ్మదెమ్మెరలు నాలుకలార్పఁ
గౌముదీవిభవంబు గాలుద్రవ్వ
సంకల్పసంభవోత్సాహంబు తలలెత్త
[1]పాంథులమానముల్ బయలుపడఁగ

తే.గీ. సమదకలకంఠవరకీరచంచరీక
కలకలంబులు గగనంబుదలయఁబర్వ
వచ్చెనెంతయు ననమానవైభవమున
నఖిలమును దానయై వసంతాగమంబు 208

ఆ.వె. పసిమిఁబాసి ముదిరి పసిమెక్కి పరుసనై
పరగు మిగిలి [1]తుదలువగిలి పలకి
పండి తొడిమె వెడలి నిండుచుఁ గారాకు
దుల్లెఁ దరుల రవముఁబెల్లుగాఁగ 209

---

207 – [1] క. పట్టు; [2] ట. నతులలో.
208 – [1] క. పాథుల.
209 – [1] క. మరలు, ట. మదలు.

ఉ. అంతవసంతకాలము సమంచితసాలము కోకిలాగవా
క్రాంతదిగంతరాళము శుకప్రియలీలము మత్తభృంగ[1]వి
శ్రాంతలతాంతజాలము పరాగవిశాలము పాంథకామినీ
కాంతమనోవిశాలము జగత్త్రయమోహనలీలఁ దోఁచినన్ 210

క. కారాకు రాలి [1]కెంజిగు
లీరికలెడ[2]నణఁగి శాఖ లేకవిధంబై
పేరెఱుక బడకయుండెను
భూరుహములు కొన్ని దివసములు వనవీథిన్ 211

ఉ. పల్లవపుష్పసంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై
యెల్లవనంబు సంకటము[1]లేఁదఁగఁదారొడికంబు [మీఱ] న
ట్లల్లనఁగ్రోలి క్రోలి మలయానిలుఁడందుఁబురాణపత్రముల్
డుల్లగఁజేసె సత్క్రియఁబటుత్వముకాముఁడు పిచ్చలింపఁగన్ 212

క. భూరుహములెల్ల నామని
గారాకులు రాలి చిగురుఁగలయనలమి సొం
పారెను మధు[1]వాసరముల
గారంబులు దొలిచి క్రొత్తఁగప్పినభంగిన్ 213

క. అల వలరాజు ప్రతాపా
నలకీలలకోయనంగ నవకములగుచున్
గలయఁగ లతికానోకహ
ములఁగెంజిగురాకుజొంపములుచూపట్టెన్ 214

క. ఆకాముఁడువిరహులపై
భీకరముగదండు వెడలఁ బికశుకమధుపా
నీకములదండు రమ్మని
యాకులిడిన క్రియను దశువులాకులు వెట్టెన్ 215

సీ. అభినవస్ఫురణమై నలరారె వనములు
వనములయందెల్ల వాలెలతలు
లతయందొదవె నుల్లసితకోరకంబులు
కోరకంబులయందు [1]మీఱెఁదావి

---

210 — [1] ట. విక్రాంత.
211 — [1] క. కొంజిగు ; [2] ట. నదరి.
212 — [1] ట. లెండఁగ.
213 — [1] చ. మానము, [1] ట. మానవిభుసక.
216 — [1] ట. గోరె

తావులఁగొని వీచె దక్షిణపవనంబు
దక్షిణానిలువెంటఁ దగిలె నలులు
నలిమాలికలయందు నలరె ఝుంకృతులు ఝుం
కృతులకు నొంచె దంపతులమనసు

తే.గీ. మనసులందెల్లఁ దలచూపె మన్మథుండు
మన్మథునియందు నంతంతమదము వొదలె
సూటిగా ధాత్రి నారామవాటికలను
వితతవాసంతలక్ష్మి ప్రవేశవేళ 216

ఉ. పొన్నలుపూచెఁ బొన్నలొగిఁ[1]బూయకముందఱఁ బూచె గోఁగులా
పొన్నలుఁగొండగోఁగులును [2]బూయకముందఱఁబూచె[3]బూరుగుల్
పొన్నలుఁ గొండ గోఁగులునుబూరువులుం దగ [4]బూయకుండఁగా
మున్నవనంబునంగలయ మోదుఁగు[5]లన్నియుఁబూచె[6]నెల్లెడన్ 217

చ. లలితలతాంతసౌరభవిలాసముగలుకుజంబు[1]లెన్నియేన్
గలుగఁగ వానిమీఁద మదగర్వభరోన్నతి దానముందఱన్
వలవనిపుష్పభారవిభవంబున విఱ్ఱవీఁగు కింశుకిన్
గిలకిలనవ్వినట్లు పరికింపఁగఁబూచెను మాధవీలతల్ 218

క. సారంబులగుచు వనసహ
కారంబులు వకుళకర్ణికారంబులు ఖ
ర్జూరంబులు కింశుకజం
బీరంబులు గురువకములుఁ బెల్లుగఁ బూచెన్ 219

తే.గీ. విషమశరుఁడను గాలాఁపు వేఁటకాఁడు
[1]మతకపు విరహిమానస మత్స్యములను
దివియ గాలంబులో యన నవకమెక్కి
గరిమఁజూపట్టెఁబాటలీతరుల విరులు 220

తే.గీ. ఆ రతీశ్వరు చాపగహ్వరరవంబు
మెండు వినినట్టి విరహులగుండెలవిసి
తొరఁగియున్న కడింది నెత్తురులపగిది
నేలఁగింశుక పుష్పముల్ రాలియొప్పె 221

---

217 — [1] ట. బూవక ; [2] ట. బూవక, [3] ట. బూరువుల్ ; [4] ట. నొగిబూవ ; [5] ట. లొప్పగ ; [6] చ. నామనిన్.
218 — [1] ట. లెన్నియున్.
220 — [1] క. చ. మతకమున.

సీ. మంజులమహనీయకుంజసందోహంబు
రమణీయధారాధరములుగాఁగఁ
జంచరీకాఘోషఝుంకారములు మహా
ద్దండభీషణగర్జితములుగాఁగ
గాలితాఁకున నేలరాలు పూమొగ్గలు
కడమించు వడగండ్ల కరణిగాఁగ
దోరమై యెడలేక తొరఁగు పూఁదేనియ
విడువక జడిగొన్న వృష్టిగాఁగ

తే.గీ. వాడి[1]కై వ్రాలి తొడిమల తోడనూఁడి
జాఱుపువ్వులు ఫేనపుంజములుగాఁగ
నంచితస్ఫూర్తిమై వసంతాగమంబు
ధరణి వర్షాగమంబు చందము వహించె 222

సీ. దీపితమదనప్రతాపాగ్నియై తోఁచు
దారుణి మేఘనిదాఘమహిమ
వర్ధితమకరంద వర్షమై యొదలించుఁ
గమనీయ ఘనఘనాగమవిభూతి
జనితవియోగిసంచలనమై యొదవించు
నభినవ శిశిరోద[1]య ప్రభూతి
వికసితదంపతిప్రకరచితాబ్జమై
యొదవించు శరదాగమోత్సవంబు

తే.గీ. కేతకీరేణు[2]భరసమాకీర్ణదశది
గంతమై తోఁచు నిబిడహేమంతమహిమ
యఖిల ఋతువులు తానయై యతిశయిల్లు
కరణి మధుమాస మమితవిస్ఫురణఁ దనరె. 223

సీ. కొమ్మలు నయము దూఁకొని మోసులడరి లేఁ
జిగురాకువెట్టి గెంజిగిఁ దలిర్చి
జొంపముల్‌గొని జగజంపులై పొదలి క్రొ
న్నన లెత్తి మొగ్గలఁ దనరినిగ్గు

222 – [1] క. కైరాలి; [1] ట. యవవిభూతి.
223 – [2] ట. ధర.

తులకించి మొగడలు దోఁచి లోరేకులు
బిగిసి తలలు నిక్కి నిగిడివచ్చు
పువ్వు [1]గుత్తులమించి పూపలనిండారి
పిందెలై వగరెక్కి పెరిగి పులుసు

తే.గీ. మిగిలి కరికట్టి కలఁగి దోరగిలవారి
యారఁబండిన ఫలముల నమరిగొలల
వ్రేఁకుఁదనమున గొమ్మల విఱ్ఱవీఁగి
పరఁగి తరువులు గన్నుల పండువగుచు. 224

చ. గునియుచుఁ గుజ్జుమావి[1]సెల [2]గొమ్మలవ్రాలి యెసంగి సోగలై
గొనలు దెమర్చి కెంజిగురుగుంపుల లింపులు మేసి[3]క్రొవ్వినన్
గొననొగరెక్కి డగ్గుపడు గుత్తుకలం గొద[4]లొత్తు నూతన
స్వనములు పంచమశ్రుతులఁ జట్టికొనం జెరలించెఁ [5]గోవిలల్. 225

చ. మనసిజు మంత్రఘోషములు మన్మథు నానతి మాటలిందిరా
తనయు విలాసహాసములు దర్పకునార్పు టెలుంగులం గజ
న్మని చదువుల్ మనో[1]భవు మనోహర గీతులనంగఁ జారుఖే
లనములనెల్ల దిక్కులఁ జెలంగె మదోత్కట కోకిలధ్వనుల్. 226

ఉ. ఆపువువింటిజోదు మధుపావళి నారి నమర్చి చిక్కఁగా
మోపిడిపట్టి ఝుమ్మనుచు మ్రోయఁగ మీటుచునున్నవాఁడు మా
కాపనిగాదు తాల్మి[1]గొఱకాదిఁకఁ జన్నులనంటఁబట్టి కొం
డోపతులన్ లతాంగులనుసోజ గరం[2]బెలుఁగిచ్చెఁ గోయిలల్. 227

చ. మెకముల క్రొత్తనెత్తురుల మించు నునుంబులిగోరుబాగు సొం
పుకుఁ బనసూపువాడి కొనముక్కునఁ బక్వఫలంబులొత్తి యం
జక వెసఁగ్రమ్ము తియ్యని రసంబులు గుత్తుక బంటిగ్రోలి రా
ట్చుకములు పోతరించి రొద సొప్పడ నెల్లెడఁబల్కెఁ బెల్లుగన్. 228

క. వలరాజు దండు వెడలఁగ
బలముల నియమించి సైన్యపతు లెదురెదురం
దల తలఁడను నెలుఁగుల క్రియ
గలయఁగ నెలుగిచ్చె నెల్లకడ రాచిలుకల్. 229

224 – క. కొత్తుల, చ. గోతుల.
225 – [1] చ. కల; [2] ట. గొమ్ముల, నిమ్ముల; [3] ట. క్రొవ్విపీఁకను; [4] ట. లేని;
[5] ట. గోవెలల్.
226 – [1] చ. భవునిమోహన.
227 – [1] క. గొరలందిరి; [2] క. బొగలించె.

చ. అపవిరిగమ్మత్రమ్మివిరులందును నెందును సోడుముట్ట న
బ్బురముగ నుబ్బు మేలివలపుల్ పసిగొంచుఁ జెలంగి[1]వీఁగిలో
గురువులు వారి కర్ణికల గొందుల వాచవులూను తేనె వు
మ్మరముగఁ గ్రోలి యన్నుకొని మానక ఝుమ్మని మ్రోసెఁ దుమ్మెదల్. 230

ఉ. మ్రూఁగి విపంచి చందమున మ్రోఁగి లతావనమందు డోలలం
దూఁగి మరందధారలను దోఁగి మనోహరగంధలీలచే
వీఁగి సుపంచకంబు గని వేఁగి ప్రసూనగుళుచ్ఛపంక్తిలో
నీఁగి సరోవరంబునకు నేఁగి యళివ్రజమొప్పు నామనిన్. 231

ఉ. తెమ్మెరలూపఁగా నరుదు తేనియలాని మదించి యింపునన్
దుమ్మెదలే[1]మ లాలతులతో మధురస్ఫుటకాకలీనినా
దమ్ములు వాడుచుండెను లతావనడోలలఁ[2] దూఁగియాడుచున్
గమ్మని వింటిజోదు జయ[3]గాథలు పుష్పితభూజవీధులన్. 232

మ. మలినాంగుండవు చంచలుండ వరయన్మాతంగదానంబు గొం
[1]దెలమిం బుష్పవతీలతాసతికి మోహింతెల్లకాలంబు చె
ట్టల[2]నయ్యాట మధుప్రియుండవట ముట్టంగాదు నిన్నంచు న
య్యాలి నాస్ఫోటనఁజేసెఁ జంపకము చైత్రా[3]రూఢగర్వంబునన్. 233

చ. మిలమిలమంచు మించుఁజలిమెచ్చుల ముద్దుల చందమామ కాం
తులఁ దులఁదూఁగు క్రొమ్మొలక తూడుగొనల్ గబళించి త్రుంచి వి
చ్చలవిడి మేసి గబ్బుకొని సమ్మదనాదములింపఁగేలి లీ
లల మెలసెం గొలంకుల కెలంకుల రాజమరాళదంపతుల్. 234

ఉ. వామన దిగ్గజంబు మదవాసనకుం జన [1]కోహటించి యు
ద్దామగతిన్నభోమణి రథంబు [హయంబు]లనూరుఁడుద్ధతుం
డై మగిడింపఁగా మగుడ [కష్టము] దాటెననంగ నుత్తరా
శాముఖవీథినేఁగెదివసంబులు దీర్ఘత పల్లవింపఁగన్. 235

ఉ. ఎక్కడఁజూచినం జిలుకలెక్కడఁ జూచినఁ గోకిలంబులున్
ఎక్కడనైనఁ బుష్పములనేఁచి[1] సుడిన్ [2]భ్రమియించు తుమ్మెదల్
వెక్కసమయ్యెనామని సవిస్తరసంపద యేమిచెప్పఁదున్
తెక్కలతేజి పుష్పాడులు రేగి వసంతము లాడెనయ్యెడన్. 236

---

230 - [1] ట. మ్రూఁగి.

232 - [1] క. మరాళతతుల ; [2] క. దూఁగియుండుచున్, చ. నూగియాడుచున్ ; [3] క. దాళలు, చ. గాథలు.

233 - [1] దెలమిం ; [2] క. నియ్యాల, చ. నియ్యాట ; [3] ట. గూఢ.

235 - [1] క. కోహళించి, చ. కొహరించి.

236 - [1] క.చ. సుడిన్ ; [2] క.చ. భ్రమరించు.

సీ. సమవర్తి రాణివానముల పాలిండ్లపై
[1]మృగమదామోదంబు మేఁతవట్టి
దర్వీకర [2]స్త్రీలు తన్ను వాచవిచూడ
గంధంపుఁ గొండచెంగట సుఖించి
దర్దురశైలమధ్యమునఁ గర్పూరంపుఁ
దరువాటికలలోనఁ దెరువుదప్పి
తామ్రపర్ణీఖ్యాతిఁ దనరారు ముత్యాల
యేటియంబువులలో నీఁదులాడి

తే.గీ. విరహి[3]జనముల హృదయ కోటరములందు
రాజు మదనానలము[4] మించ రవులుకొల్పి
[5]యెల్లదిక్కులు దానెయై మొల్లముగను
నల్లనల్లన వీచె మందానిలుండు 237

చ. మరువముఁ బొందిపొంది విరిమల్లియ పువ్వులఁ జెందిచెంది కే
సరములఁ గ్రాలిక్రాలి జలజాతపరాగము దూలితూలి క
ప్పురమున నేచియేఁచి సురపొన్నల వాసన మోచిమోచి తె
మ్మెరలు నిరంతరంబును భ్రమించుచునుండు నిరంతరంబులన్ 238

ఉ. గంధపుఁగొండ నెత్తముల కందువ నేలకి తీవయిండ్లలోఁ
గెందలిరాకు పాన్పుల సుఖించి[1] నితాంతరతిశ్రమంబులం
జెందిన చెంచుగుబ్బెతలచెక్కులఁ జిమ్ము జవాదివాసనల్
విందులసేయుచున్మెలఁగె వేమఱుఁ గోమలగంధవాహముల్. 239

సీ. నిండార ముత్యముల్ పండెడి నీటిలో
లీలమై సోలుచు నోలలాడి
చందనతరువులఁజెందిన [1]నునుఁబాప
కొమ్మల నిమ్ములఁగూడియాడి
సారకల్హారకాసారతీరంబున
నేపారగాఁ బిల్ల తీపులాడి
కర్పూరభూరుహకాంతారవీథులఁ
బలుమాఱు నుప్పనబట్టెలాడి

---

237 – [1] క. మృదు; [2] క.చ. శ్రీలు; [3] ట. జనులకు; [4] ట. మించి; [5] ట. కార్క పీఠంబు దపమున్న కాననమున.

239 – [1] ట. రతిశ్రమ పారవశ్యలై.

తే.గీ. ద్రవిడవరవర్ణినీమనస్తన విలిప్త
లలితకాశ్మీరధమ్మిల్లకలితవివిధ
కుసుమనూతనగంధంబుఁగొల్లలాడి
మహిమఁదిరుగాడె దక్షిణమారుతంబు. 240

## చంద్రోదయవర్ణన

సీ. తళుకు నుప్పాతి [1]ముత్యాల మించులమించు
మెఱయు చుక్కలజేని మెఱుఁగు దఱిమి
కలికి రాయంచ ఱెక్కల రేవ[2]గిలుమాడి
విరిమల్లె గుత్తుల మురువు దెగడి
చదువుఁదొయ్యలిమేని చాయ నుల్లసమాడి
తెలితమ్మి మొగడల తెలివిగెలిచి
జిగిమీరు తొగజేని సిరులకు నసమిచ్చి
పాపరాయని వన్నె క్రేపుచూపి

తే.గీ. పాల మున్నీటి తరగలబాగునవ్వి
కొండ యల్లుని మై తెల్పుగొంచె పఱిచి
కుప్పతిలు చుట్టుఁగొండను గొనలు సాఁగి
వెలఁదివెన్నెలలామని వెల్లి విరిసె 241

ఉ. సారపుఁ దేటవెన్నెలరసంబులు [1]మేలిమి నల్లగల్వపూ
గోరలనించి చందనపుగుబ్బలి [2]గాఁబోడ మూపు గాడ్పులన్
సారెకుఁజల్లఁజేసి [3]మృదుచంచుపుటంబులచేఁజకోరముల్
కోరికనిచ్చు మచ్చికఁ జకోరికలింపుల గోరగింపఁగన్. 242

వ. ఆ సమయంబున 243

సీ. అరుదైనకర్పూరతరువనంబులలోన
నల్లన నెలమావి గొల్లెనెత్తి
పారిజాతంబుల బాగుగా[1]ఁబన్నిన
[2]తలిరుఁజొంపంబులఁ దడియమర్చి

---

240 – [1] క. పొవర, చ. పాప.
241 – [1] ట. ముత్యముల, [2] చ.ట. గిలుమాడ్కి.
242 – క. మేలిమె, ట. వేలిమి; [2] ట. పైఁజనుదెంచు.
242 – [3] ట. తమి.

గురువిందతీవె పందిరి విప్పఁగావించి
కన్నె చెంగల్వలఁగలయఁ గప్పి
నెత్తమ్మిరేకుల యెత్తు గద్దియ మీఁద
చేమంతి పూబంతి చేతనునిచి

తే.గీ. చంద్ర వాసంతు లిరువంక నరవిఁ గొల్వ
మదనుఁ డమరాజు గొలువుండి మనసులోన
విరహిజనములపై దండు వెడలఁదలఁచి
భేరి [3]వేయించెఁ బాంథులు భీతినొంద. 244

మ. వరముగ్ధాహృదయాంతరంగజలధివ్రాతంబు [1]ఘూర్ణిల్లె బం
ధురమధ్యామహనీయధైర్యగిరిసందోహంబు [2]లూటాడె సం
భరణప్రౌఢవధూటికాజఘనభూభాగంబు [3]గంపించె న
ప్పురుషానేకహకోటి[4]వార్ధుల నిలన్ పుష్పేశు భేరీధ్వనిన్. 245

క. నిండిన విరహుల మీఁదను
దండెత్తఁగ వలయుననుచుఁ దనబలములఁ దా
రండని [1]కాలరి తుమ్మెద
తండముచే మరుఁడు పనిచెఁదద్దయు నాకుల్. 246

ఉ. పంపినఁగాలరుల్గదలి పంకజరేణువు నంబళంబుగాఁ
బెంపునఁబోయి ఝుమ్మనుచుఁబిల్చినఁ దద్చల మెల్లరేఁగి ని
ష్కంపితులై పతింగొలువగల్గెఁగదాయని వచ్చి రోలిమై
తెంపును సొంపునుంగలిగి తీవ్రత నా రతినాథుఁజేరఁగన్. 247

క. వనములఁ గొలఁకులఁ దిరిగెడు
వనకోకిలకీరభృంగవర్గంబెల్లన్
జనుదెంచి మ్రొక్కి [1]నిలిచెను
మనతర[2]బాలార్క తేజుఁగామునిఁగణఁకన్. 248

సీ. వెలయంగ నేర్పుతో బలముల నిలుఁడని
[1]పడవాయి కోయిల పంక్తిఁ[2]బనిచె
భేరీమృదంగాది చారు నాదంబులు
నెనయఁ దుమ్మెదల మ్రోయింపఁబనిచె

---

244 – చ. లో రెండు పాదములే కలవు, [1] క. పిన్నిన ; [2] చ. తతిరుల బాలాడ వట్టి పేర్చి ; [3] క. వాయించె.
245 – [1] ట. ఘూర్ణిల్ల ; [2] క. బూటాడ, చ. టాటాడె, ట. టాటాడ ; [3] ఉ. కంపింప; [4] చ. వార్ధులగేరెన్, ట. వాలఁజెలఁగెన్.
246 – [1] క. కాలది.
248 – [1] చ. కొలిచెను ; [2] క. శైలార్క.

రాజకీరంబుల రథము తెమ్మని [ తన ]
సంగడికాని వసంతుఁబనిచె
మహనీయ మగుచున్న మన సైన్యములలోన
గమనింపు మని [3]కమ్మ గాలిఁబనిచె

ఆ.వె. [4]మేటిబలము వాఁడు మీను టెక్కెము వాఁడు
నిఖిలమెల్లఁ గలయ నేర్పువాఁడు
పచ్చవింటివాఁడు పరగఁ బూటమ్ముల
గములవాఁడు ప్రౌఢగతులవాఁడు. 249

సీ. కమలషండము నున్నఁగావించి యిరుసు
గాఁజేసి కెందమ్మి కండ్లు గూర్చి
[1]నిగినించు మోసుల నొగలుగాఁగీలించి
కరమొప్పఁగేదఁగి కాడి వెట్టి
సంపంగి మొగ్గల సను గొయ్య లొనరించి
పల్లవంబుల [2]తోడ పఱపుసేసి
చెలువైన పొగడ [3]దండల [4]త్రాళ్ల బిగియించి
[5]లేఁదీగె పల్పులు లీలఁ జొనిపి

ఆ.వె. కడిమిపూల తేనె కందెనగాఁ బెట్టి
గండురాజకీర గణము గట్టి
మెఱయు చిగురుఁగొడుగు మీను టెక్కెముగల
తేరు వన్ని సురభి తెచ్చెనంత . 250

వ. ఇవ్విధంబున విచిత్రమహిమాతిశయంబుగాఁ గుసుమరథ మాయి
తంబు సేసి తెచ్చి వసంతుఁడనంత వైభవంబున నంగసంభవుఁగాంచి, దేవా!
దేవర యానతిచ్చిన విధంబునఁ దేరా యితంబు సేసి తెచ్చితి, నదియునుంగాక
శుకపికమధుపమరాళనాయకులు దండునకుఁ గండు మానసులై, రతీంద్రా!
నీ రాక గోరుచు మొగసాలనున్నవారని విన్నవించిన నవధరించి మోదించి
విరహిజనంబుల మీఁద వెడల గమకించి మోదించి విజృంభించి సముచిత
పుష్పబాణాననతూణీరుండును త్రిభువనభువనాభినవసుందరుండును
[1]భృంగి సంగీత పాఠకానేక నిర్మల మహనీయనాదమోద మనస్కుండును,
భూరికీరకైవారనిజగుణాలంకారుండును, బికకలహంసికాగణపరివేష్టితుండు
నునై రథం బెక్కె యుద్దర్పితుండు. 251

249 — [1] క. బతు ; [2] క. బలిచె, ట. సునిచె ; [3] ట. నన్న ; [4] క. మెచెలి, చ. పెలిమె.
250 — [1] చ.ట. విగునించు ; [2] చ.ట. లేఁత ; [3] ట. పండుల ; [4] క. తాల, చ. తా
ట. తావి ; [5] క. తివిఠె, ట. నూలి.
251 — చ. భృంగ ; ట. వందిమాగధ గీత.

ద్విపద. పూటంపదొనలు వీఁపున [1]భుజసీమ
గాటంపుఁ జెఱకుసింగాణి కెంగేల
మోదుగ [2]విరివంకి మొనయు గుర్వింద
పూఁదీగె వాగెమైఁ బొగడపూ[3]జోదు
పగడంపు నిద్దంపు [4]వడదలనంటి
జిగిఁవేలు నెలమావి చిగురు [5]ఫిరంగి
వెనుక దామరపాకు వెడఁద కేడెంబు
మునుదెన చెంగల్వ మొగడ కటారి
కళుకైన పొన్నమొగ్గల తురాసిగను
తెలిపొందు రాచిల్క తేజి నందంద
దుమికించి [6]చౌపదల్ ద్రొక్కఁజేయుచును
గమిగూడి [7]తేఁటి మూకలు ముందఁ [8]బిఱుద
రాయంచ పడవాళ్లు రా నిరు మేలఁ
బాయక కోకిలపాఠకుల్ గొలువఁ
జక్కని వెలిదమ్మి జగజంపు గొడుగుఁ
డెక్కుల మగమీల టెక్కెంబు మెఱయ
ననుసరింపుచు మలయానిలుం డరుగఁ
బెను శారికావందిబృందంబు పొగడ
మఱి మయూరములు చామరములు వీవ
హరునంబున వసంతుఁడను దళవాయి
బలము నెన్నడుమ నొప్పఁగ వలరాచ
బలు రాచపొర వచ్చెఁ బంతంబు మీఱ. 252

చ. అరుదుగఁ దేఁటితీఁగ గొనయం బెనగంగను బచ్చ వింట ని
బ్బరముగ మోపి క్రొందొవల బాణములం [1]బరువంపు మావి క్రొ
వ్విరిబలువాడితూఁపులను బీరము నుబ్బను నెమ్మనంబులోఁ
బిరిగొన నేసి తొప్పరులు వెట్టె ననంగుఁడు పాంథలోకమున్. 253

ఉ. ఏయఁదొడంగె మన్మథుఁడు నిక్షుశరాసన మెత్తి పాంథులం
గూయ దొడంగె మావిసెల [1]గొమ్మల నిమ్ముల గండుగోయిలల్
మ్రోయ దొడంగెఁ బద్మవనలోలములై మదభృంగసంఘముల్
గాయ దొడంగె వెన్నెల ప్రకాశగతిం బెలుపెక్కు యామినిన్. 254

---

252 — [1] ట. దొండుపేసి ; [2] ట. విరవంకి ; [3] ట. బోదు ; [4] చ. పడలదల, ట. పదదల ; [5] క.చ. భిరంగి ; [6] క. చౌపటాల్, చ. చౌపడాల్ ; [7] క. కంటి ; [8] క. బిరుంద.
253 — చ. లో లేదు ; [1] క. బలువంపి.
254 — [1] క. గొమ్మల.

వ. అట్టి వసంతసమాగమంబున నచలఘోరతపోవర్తియగు సుకీర్తి
ఁరేంద్రుని తేజోభావంబు గలంప నిలింపపతి యాత్మ[1]పదప్రార్థనాశం క
ొక్రాంత [2]శంకించుచు. 255

ు. భాసిల్లు పువ్వుల బాణపంక్తుల వానిఁ
గొమరారు కెందమ్మి గొడుగు వానిఁ
గలకంఠశారికా కలహంసములవాని
వెలుఁగొందు తియ్యని వింటివాని
మందానిలమువాని మదభృంగములవానిఁ
దెఱఁ గొప్ప విరవాది తేరివాని
బలుమీను టెక్కెంపుఁ బడగ నొప్పెడువాని
నామని సారథియైనవాని

ఆ.వె. నాత్మ [1]బుద్ధివాని నకళంక శృంగార
విభవలక్ష్మిచేత వెలయువాని
మోహవృత్తివాని మోహనాకృతివానిఁ
గాము దలఁచె నాకధాముఁ డపుడు. 256

క. తలఁచిన నింద్రుని కడ క
వ్వలరాయఁడు [వచ్చి] యేను వచ్చితి నీకున్
వలసిన పని సాధించెద
బలసూదన పంపుమనుచుఁ బలికెన్ మగుడన్. 257

ు. ఎంతవారికినైన నెదురెక్కు టెక్కెంబు
మిన్నులపైప్రాలు మేటిహరులు
మొనతలవాఁడని ఘనమైన బలువిల్లు
మొరయింపక తనంత ప్రోయునారి
తల మోచినపుడ సత్త్వము చూపు శరములు
చిత్తవిభ్రమ లీలఁ జెలఁగు రథము
ఎదిరి లోపలి కృత్య మెఱుఁగ నేర్చిన దూత
జనులు మామాయనఁ జను ప్రధాని

తే.గీ. యలికులంబుల సేనయు నంచ దొరలు
గలిగి విలసిల్లు జోదవుగాన నిన్నుఁ
దలఁపఁ బనిగల్గెఁ జెప్పెదఁ దద్విధంబు
వంచనము మాని యిటు విను పంచబాణ. 258

255 — చ. లో లేదు; [1] క. వర ; [2] క. శంకింపుచు.
256 — 1 ట. భువన.
257 — చ. లో లేదు.

వ. వసుమతీస్థలంబున మార్తాండకులజాతుండు సుకీర్తి యను రాజేంద్రుండు త్రికూటాచలసమీపకాననంబున ఘోరతపంబు చేయుచున్నవాడు. నాకుఁ బ్రియంబుగా నతని తపోభంగంబు సేసి రావలయునని బహువిధంబులఁ బ్రార్థించిన నట్లకాకయని యనంగుండతని వీడ్కొని తనకు సహాయంబుగా రంభాదికాంతాసమూహంబుఁ దోడ్కొనిపోవు సమయంబున. **259**

ఉ. పట్టుగుడారముల్ చికిలి బంగరు వ్రాఁతల చిక్కు బీగపుం
బెట్టెలుఁ బచ్చరాపలక పీటలు [1]మేలి నఖాసి కుట్టు మేల్
కట్టులుఁ గ్రొత్త నెత్తపలకల్ తెరలుం బికదాడి బారువా
పిట్టల గూండ్లుఁ గ్రొమ్మెఱుఁగుఁ బిందెలుఁ గొందఱు దెచ్చి రయ్యెడన్ **260**

సీ. దంట నీలంపుఁ జిక్కంటులు దంతంపు
దువ్వెనల్ కుంకుమపువ్వుఁ బఱపు
నకినెలమంచముల్ చౌకంపు [1]హొంబట్టు
బటువులు రాచిల్క పంజరములు
పరిమళంబుల యుబ్బు బరణులు చంద్రకాం
తపుఁ గోరలు దిరి కుందనపు గిండ్లు
నిలువుటద్దములు వీణియలు దండియలును
[2]దాళముల్ వేణువాద్యము లురుములు

తే.గీ. నావజంబులు ముఖవిలాసానకములు
మద్దెల ఉపాంగములు స్వరమండలములు
మొదలుగాఁగల సాధనమ్ములు ధరించి
గొంద అరిగిరి వెనువెంటఁ గూడి యపుడు. **261**

చ. నడచిరి యంత రంభ భవనంబున నుండెడు సోమయాజు లె
క్కుడు తమిఁ [1]బాయ వేఁడి వడిగూడఁగ రండిటు వాజపేయు లె
క్కడి పయనంబు వచ్చె మన కర్మము లీగతి నుండె నేఁటికిన్
జడిసెదుఁ బౌండరీకులని సారెకుఁ బల్కుచు నెండ కళ్కుచున్. **262**

క. పెంజెమట జాఱ దోవతి
పింజలు మాటికిని గాల్లఁ బెనగొనఁగడుపుల్
గుంజులు బెట్టగ వేలుపు
లంజియలంగూడుకొని హళాహళి మెఱయన్ **263**

260 — [1] ట. మేలివఖాను.
261 — [1] ట. హొంబట్టు; [2] ట. తాతముల్.
262 — [1] క. చేయు.

సీ. రత్నకంబళ్ళ మతిరాత్రులు గొంచురా
సర్వతోముఖులు వేసరఁగనేల
తాళవృంతంబు మాపాలిది చయనులు
జగడంబులాడక చనుఁడుకడకుఁ
గపురంపుఁబెట్టె మీ కట్టడ యెఱుఁగరా
సత్రయాజుల కింతచలముగలదె
ముత్యాలచవుకట్లమూట మా[1]మోపాట
తెలియదా వాజిపేయులకు నెపుడు

తే.గీ. నాఁడె క్రతువులు రామార్పణముగఁ జేయ
కునికి నీ పాటు వాటిల్లె [2]మనకు ననుచు
సొరిదిఁ జనుదెంచు[3]సోమయాజులను జూచి
యవ్విబుధ[4]కామినులు వారి ననిచి యచట 264

సీ. కలహంసకర్పూర కలికిపద్మావతి
మందారవల్లరి మధురవాణి
సౌందర్యలహరి పుష్పసుగంధి చిత్రాంగి
కాంచనమాలిక కనకరేఖ
రామమోహిని కుమారసరస్వతి సుశీల
మదనాభిరామ మన్మథమళూరి
మంజుభాషిణి భానుమతి రమాతిలకంబు
కామమంజరి చంద్రకళకిశోర

తే.గీ. మత్తగామిని పద్మాక్షి మధురబింబ
యువతి మదిరాక్షి సుందరి యుత్తమాంగి
కామినీమణి శుకవాణి కమలవదన
యనఁగఁ బేర్వొప్పు చెలువెల్ల మొనసికొలువ 265
వ. అంతట రంభోర్వశులు మొదలైన యప్సరసలును. 266

సీ. నునుముత్తియపుఁదీవ పనికుట్టుగనుపట్టు
పట్టుచన్కట్టు సంభ్రమముఁజూప
నిండు[1]చెందిర కావి నెఱిక[2]చెఱఁగారు
కడవన్నె బంగారుకాసె వొసఁగ

---

**264** — [1] చ. మాపొటు ; [2] ట. ననుచు మనల ; [3] ట. యజ్వలంజూచినవ్వి ; [4] క. చ. కాంతులు.

వలిచుట్టు పూదండ వెలిచుట్టు గననొప్పు
కప్పుచిప్పిలుసాము గొప్పదనర
ఝుళఝుళంఝుళనాద హళహళితంబైన
బిరుదు వజ్రపుజల్లి పెండెమమర

తే.గీ. మాటికిని [1]మోల జలడిండిమములు మొరయ
[3]నయము భయమును బ్రియము ననయమునమర
నమరవల్లభుకొల్వున కరుగుదెంచె
రంభ సన్నుతనాట్య సంరంభయగుచు 267

సీ. వలరాజు [1]మదదంతి [2]తలమాలికయనంగ
గలికిచన్నులఁ బట్టు కంచె లలర
రతిచేతి జీనిసురటియొ నిదియనంగఁ
గళుకుబంగరువ్రాత కాసె[3]మెఱయ
శృంగారఫణిఫణాభంగి తాయెతు చుట్టఁ
గప్పుమీఱెడుసాము గొప్పదనర
నంఘ్రిపద్మముచుట్టు నతివలయంబుగా
నీలాల[4]సరిపెణల్ నీటుసూపఁ

తే.గీ. బసిఁడి తీఁగెకునార్చిన పటికవోలెఁ
జిటులు గంధంబునెమ్మేనఁ జిగి దొలంక
[5]నృత్యవేషంబు మిక్కిలి బిత్తరించి
వచ్చెనూర్వశి నకియు లిర్వంకఁ గొలువ 268

క. గ్రక్కునఁ జనరా [1]దచటికిఁ
జిక్కఁగఁ గుసుమాపచయమిషంబునసొంపుల్
నిక్కగను బోయి యాతనిఁ
[2]జొక్కింతము మౌనులింత సులభులె తలఁపన్ 269

క. అని పలుకుచుండునంతకు
మునుపె వసంతుండు పికసమూహము వొగడన్
మనసిజుఁడు బనుప మలయప
వనసహితుండగుచు నచటివనములనిల్చెన్ 270

---

267 — [1] క. ఇందురుగాచి ; [2] క. చేరనిగారు ; [3] ట. రయము.
268 — [1] క. మామంతి ; [2] ట. తలమాళిగె ; [3] క. పొసగ, చ. వొసగ, [4] క. సరపి ణల్ ట. సరపణల్ ; [5] ట. నృత్త.
269 — [1] ట. దక్కడ ; [2] క. బొంకింతను

సీ. మోదుగుల్ జిగిరించెఁ [1]గేదఁగుల్ ననలొత్తె
గురువిందలును గలుగొట్లుఁబూచె
మల్లియల్ గొనసాగె మొల్ల మొగ్గలువైచె
మావులుఁ గ్రోవులుఁ దావి[2]యొనఁగెఁ
బొగడపుప్పొడి రాల్చెఁ బొన్న [3]తేఁటులఁబొల్చె
నిమ్మయు గోఁగుఁ దేనియలుగురిసె
సంపెగల్ వికసించె జాదుల్ మదాళించె
గోరంట తిలకంబు [4]గుత్తులెత్తె

తే.గీ. వావిలియుఁ బ్రేంఖణంబును వంజుళంబు
గడిమ[5]చెట్లును నలరె నిప్పుడు వసంత
సన్నిధివిశేషమున వనస్థలమునందు
భువియు దివియును ఘుమ్మని పొదలుచుండ 271

వ. ఇట్లు పయనమైయున్న రంభాదికాంతలను జూచి శతముఖుండు. 272

సీ. చెఱకువిండ్లుం[1]గని వెఱకుమీ యా కొమ్మ
బొమవింట నళిమౌర్వి వేతుగాని
కాలంబుగాదని కళవళ పడకుమీ
కలికిపాటలఁ బూచినిలుతుగాని
యెదగుందునని గుంది యెదవడకుండుమీ
నకి మోముచాయనే చనుతుగాని
గందంపుఁగొండపై పొందులేదనకుమీ
చెలియూర్పు నెత్తావిఁ బొలుతుగాని

తే.గీ. [2]మదన మాధవ శశధరమలయపవన
యనుచు గతిచూపి శుకపికహంసభృంగ
కేకులకు పతివల్కును గీతి నడయుఁ
జూపుఁ గురులును బలభేది చూపియనుప 273

తే.గీ. ఇంత మాత్రంబు మీరాన తెచ్చినపుడె
యెంత యుగ్రుండొ యా మౌనియైన నేమి
యేమి పనిగల్గి పొమ్మన్న స్వామి యెట్టి
కార్యమైనను సాధింపఁగలము సుమ్ము. 274

---

271 — [1] క. గావగుల్ ; [2] ట. నెనఁగె ; [3] ట. తేటల ; [4] క. గొంతు ; చ. గొత్తు ; ట. గుత్తు ; [5] క. చెట్టునుగల యెప్పుడు వసంతు.
272 — [1] క. దని. ట. జూచి ; [2] క. [illegible]

క. మంద[1]మరుదిందుమాధవ
కందర్పాదులను దోడుగా నిడుకొని నం
క్రందన! కదలెద మేమిదె
మందాకిని దాఁటి నేఁడు మహిమండలికిన్. 275

క. మందారకల్పతరుహరి
చందనసంతానపారిజాతంబులఁ బెం
పొందఁగ భూలోకంబున
[1]కుందగిన సువస్తుతతులు గొనుచున్వేడ్కన్. 276

క. నందనము వెడలి పైనపు
టందముగ జవాది పూత లలంతి తొడవులున్
గుందనపుటచ్చు [1]వగజిలు
గుందెలిసాలియలు జాఱుఁగొప్పులు నొప్పన్. 277

క. తగువారి వెంటరమ్మని
గగనంబున నడచి రింద్రు మనసాధంబుల్
మగిడి మగిడి చూచుచు న
మ్మగువలు మఱి వారినంటి మార్గమునందున్. 278

ఉ. ఇక్కరణిం బురందరపురేందుముఖుల్ చనికాంచి రెంతయున్
జక్కని చాయనుల్లసితసారసహంసరథాంగభృంగన
మ్యక్కలనాదమేదురనిరంతరతుంగతరంగఘోషముల్
దిక్కుల నిండఁ బాండురుచిఁ దేలు సురాపగ వేడుకన్ దగన్. 279

ఉ. కన్నె మిటారి బేడిసలుకన్నుల చెన్ను వహింప జక్కవల్
చన్నుల చంద మొప్ప జలజాతపరాగము హత్తి ప్రత్తి పూ
వన్నియలీల నొప్పఁగను వారవిలాసినిఁబోలి యందమై
యున్నది యిన్నదీమణి తిలోత్తమ చూచితెయెంత యొప్పెడున్. 280

చ. పగడపుఁజాయ ముక్కులును బాదయుగంబులుఁ బైఁడి ఱెక్కలున్
జిగును [ నుసో ] గ వెన్నెలలఁ జిమ్మెడి మేనులు మించనంచ లీ
గగనతరంగిణీవికచకాంచనకంజవనీగృహంబులన్
సొగిసి రమించుచున్నయది చూచితె చారుకురంగలోచనా. 281

---

275 — [1] క.చ. మధురిందు.
276 — [1] ట. గుందని వను.
277 — [1] వగ.

క. అని తన్మహిమముఁ బొగడుచుఁ
జని చని తమసాతటంబు చాయనె గగనం
బున నుండి దివికి నిర్జర
వనిత లవనితలము నవయవద్యుతిఁ గ్రమ్మన్. 282

సీ. జలదకదంబముల్ చంద్రబింబంబును
శరభముల్ విద్రుమసముదయములు
శంఖసంఘములు కాంచనలతా వలయముల్
చక్రవాకంబులు జలరుహములు
మెఱుఁగుఁ దీగియలు గ్రొమ్మించు మానికములు
నావర్తములు సైకతావళులును
గరికరంబులు బాలకమఠముల్ మౌక్తిక
పాళికల్ నవ్య ప్రవాళములును
తే.గీ. గగనజలనిధిలో నుండి కలిసి యొక్క
పఱియతో [1]డిగె ననఁగఁ జూపఱకుఁ దోఁచెఁ
గాంతి దర మించు గీర్వాణ కాంత లెల్ల
తీవి మెఱయంగ నవనికి డిగ్గునవుడు. 283

సీ. వియదంబునిధిలోన వెడలి వచ్చు ననేక
లావణ్యమయమహాలక్ష్ములనఁగ
బ్రహ్మాండఖనిఁబుట్టి పఱతెంచు జీవక
ళా [1]కిలితమణిశలాకలనఁగ
జలదబృందంబులోపలి నుండి దిగువకే
తెంచు కాఱుమెఱుంగుఁ దీగెలనఁగ
మిన్నేటి నుండి భూమికి వ్రాలు కన్నె ప్రా
యపు మేటి పసిఁడి రాయంచలనఁగఁ
తే.గీ. జూడఁదగియా సురుల్లోకసుదతు లవని
కవతరించుచుఁ దమసాతటాంచలమున
నిలిచి తమతమ సాతన్యములు చెలంగ
మెలఁగు చుండంగఁ బరిచారకులు కదంగి. 284

ఉ. సమముగ మిట్టు పల్లములు చక్కఁగఁజేయుచుఁ జుట్టు నీరు వా
టము గని నాల్గు వంకల గుడారములెత్తిరి జీనిపట్టు ప
గ్గముల బిగించి గూటములు గొట్టిన రాతులు గూర్చి ముందటన్
గొమరగు పైడితీవె పనికుట్టుల చప్పరముల్ చెలంగగన్. 285

---

283 — 1 క. దిగె, చ. రిగె.

284 — 1 క.చ. కలిత మణి.

ఉ. అక్కడి చాయ రంభయును నాత్మసఖీమణులెల్లఁ గొల్వఁగాఁ
డెక్కెనలాడు రాచిలుక టెక్కెపు మేలి గుడారునందు సొం
పెక్క వసించె నూర్వశియు నిష్టవయస్యలఁ గూడి గండు మీన్
టెక్కియపుంగుడారమున నిల్చె బథిశ్రమముల్ దొలంగగన్. 286

ఉ. అంతట నంశుమంతుఁడపరాంబుధి జాఱె శకుంతసంతతుల్
బంతులుగట్టి గూండ్ల కెగఁబాఱె దిగంతములందు నెంతయున్
సంతమసంబు [1]జేరె జలజంబులు తాఱె రథాంగ పంక్తికిన్
గంతులు దీఱె నుత్పలవనంబుల నాడఁగఁజేరె భృంగముల్. 287

సీ. గగనాంబునిధిలోన గనిపించు మౌక్తిక
నికరంబులనఁగఁ దారకలు నిక్కెఁ
దారకాంగనలెల్లఁ దమినాడు కుందకం
దుకము చందమునఁ జంద్రుండు దోఁచెఁ
జంద్రుఁగన్గొని పాల సంద్రంబుపై కుబ్బి
నిండెనాఁ బండు వెన్నెలలు గాసె
వెన్నెలబైట గర్వించి పంచశరుండు
కలువ తూపులను లక్ష్యంబు లేసెఁ

తే.గీ. గల్వ తూపుల మర్మముల్ గాడ బెదరి
పదరిమెత్తని తలిరాకుఁబాన్పులందు
వల్లవుల గౌగిలించిరి పల్లవోష్ఠు
లలఁతి తెమ్మెర నెమ్మేని యలఁతఁదీర. 288

చ. నిలిచిన తేటవెన్నెలల నీడలఁ జూచుచు [1]నట్టి వెన్నెలన్
[2]జిలుగు మెఱుంగు ముక్కుతుదఁజించి [3]మెసంగుచుఁ దప్పి గప్పినం
బలుచని తియ్య వెన్నెలలఁ బానము సేయుచుఁ బ్రేమ డాయుచున్
మెలకువ మించ నయ్యెడ రమించఁదొణంగెఁజకోరదంపతుల్. 289

క. ఇమ్మాడ్కి జనానందక
రమ్మగ వెన్నెలలు గాయ రంభోర్వశులున్
గుమ్మెత గుడారములకడ
ఘుమ్మనఁ గపురంపు జగతిఁ గూర్చుండితగన్ 290

---

287 — [1] ట. చేఱె.

289 — [1] చ. గట్టి ; [2] క. చిలుక ; [3] ట. పెనంగుచు.

తే.గీ. దండియలు మీటి రహిగాన దండి చెలఁగ
నింద్రుమీఁదను బదములెన్నేని వింత
వర్ణములఁబాడి యుత్పలవాసితంబు
లైన గంధోత్తములఁ గ్రోలి హాళిఁ దేలి. 291

ఉ. సొక్కుచు నచ్చటన్ ముదముసొంపున సోలుచునుండి యంతటన్
జక్కని పైఁడి[1]తీవె పనిచప్పర మంచము లన్వసించి రిం
పెక్కఁగ నూడిగంపుఁజెలు లివ్వలనవ్వలఁ గంకణధ్వనుల్
పిక్కటిలంగఁ దాళగతి లీలలు హత్తి పదంబు లొత్తఁగన్. 292

వ. అంతటను. 292-A

ఉ. తూఱుపు తెల్లవాఱె శశి తోయధిపొంతకుఁ జేరె వెన్నెలల్
తారలలోన మీఱెఁ గుముదంబులు నిద్రలఁ[1]గూరె జక్కవల్
కేరెఁ బ్రసూన సాయకునికిం బనిదీఱె దిగంతరంబులన్
జాఱెఁ జకోరసంపము లుదారతమీఱెను సాంధ్యరాగముల్. 293

చ. తిమిరముఁ[1]బాసి యంబుజతతిన్ వికసింపఁగఁజేసి చక్రవా
కములకుఁ బొత్తునర్చి పరికల్పిత దిగ్వలయ ప్రకాశుఁడై
కుముదము నిద్రఁబుచ్చి పరికుంఠితచంద్రమరీచిజాలుఁడై
సముదితుఁడయ్యె భాస్కరుఁడు సర్వజగజ్జనబోధకారియై. 294

ద్విపద. మెఱుఁగుఁ దీగెలఁబోలు మేనులు నెఱులు
గిఱిగొన్న యలినీల కేశపాశములు
తరుణేందు[1]నుపమింపఁదగు లలాటములు
కరివంక బొమలును గ్రాలు కన్నులును
సుధలొల్కు పల్కులు సుమమదంతములు
మధురాధరంబులు మందహాసములు
చంద్రబింబమునొప్పు సరకుగాఁ గొనక
చంద్రిక నిభనొప్పు సరి నాననములు
తమ్మినెత్తావులఁ దలపింపఁబోలు
కమ్మని యూర్పులు కంబుకంఠములు
పసిఁడిమించులఁబోలు బాహుమూలములు
కిసలయంబులనొప్పు కెంగేలుదోయి
కందర్పు నభిషేక కలశంబులనఁగ

---

292 - [1] ట. తీవ.
293 - [1] క. గోరె.
294 - [1] చ. బాచి.

నొంది[2] దర్పోన్నతి నొసఁగు చన్గవలు
సన్నంపు హరినీల సరణిచందమున
చెన్నైన[3]యూరుల శిథిల మధ్యములు
నాభిసరోమార్గ నవ్యసోపాన
శోభాపరంపర సూచించువళులు
గంభీరనాభులు ఘననితంబములు
రంభానిభాకృతి రాజిల్లు తొడలు
గలిగినచెలు [లెల్ల] గ్రై సేసి యంత
తులలేని రత్నంపుఁ దొడవులు పూను. 295

చ. చందుర కావిపావడలు జాతి పిఱుందలఁ జిందు(ద్రొక్కఁగాఁ
గందు బిసాళి [1]సాలియలుగట్టి కదంబపుఁ బూలతావికిం
జెందిన తేఁటిదాటులనఁ దెన్నగు కీలుజడల్ నటింపఁగా
సుందరు లంద అవ్వనముఁ జొచ్చి చలన్మణినూపురంబులన్ 296

ఉ. కేరుచు నవ్వధూమణులు గేలివని న్విహరించి రొండొరుం
జేరుచు కన్నెగేవఁగులఁ జీరుచుఁ బూఁబొదరిండ్లు వేడుకన్
[1]దూరుచు రాని నెచ్చెలుల దూఱుచుఁ గమ్మని పువ్వులోల్లలో
గూరుచు సారసౌరభముఁ గూరుచుఁ జల్లని గాడ్పుగోరుచున్. 297

మ. కులుకుందేఁటుల పాట మందపవనాంకూరంబు లచ్చోటఁ జి
ల్కలకుం గట్టిన పేట కోకిలలకుం (గానంబు పెన్మాట య
వ్వలరాజుండెడి [1]కోట చైత్రుఁడెపుడు [2]స్వర్ణింపఁ దాపూట యౌ
నల సింగారపుఁదోట గన్గొని తదీయారామ మధ్యంబునన్. 298

క. నిలిచి విభునెదుటఁ బుష్పాం
జలి చేసి యసంయుత[ంబు సంయుత] హస్తం
బులు చూపి పసిఁడి గజ్జెలు
చెలఁగెడి చరణముల రవళి చేయుచువేడ్కన్. 299

సీ. తరుణీమణి యొకర్తు తంబురా మొరయింప
వెలఁదియొక్కతె ముఖవీణె యూఁద
సరసిజాక్షి యొకర్తు స్వరమండలము వాఁచ
బోఁటియొక్కతె దండెమీఁటి పాడ

295 - [1] క. సుపరిబుప్పు, ట. గనుపింప ; [2] ట. గర్వోన్నతి ; [3] ట. యూరుల.
296 - [1] క. సోలియలు.
297, 298, 299, 300 చ. లో లేవు.
297 - [1] ట. దూఱుచు.
298 - [1] క. తోట ; [2] క-చ. వర్ణించ.

విమలాంగి యొక్కర్తు వీణియఁ బలికింపఁ
గలికి యొక్కతె యుపాంగంబుఁ బూనఁ
గిసలయాధర యొర్తు కిన్నెర మీటంగ
లోలలోచనయొర్తు తాళ మొత్త

తే.గీ. మఱియుఁ గొందఱు సుదతులు మద్దెలయును
నావజము మొదలైన వాద్యములఁబట్టి
శ్రుతులు ఘుమ్మని హవళింప నతివ దేశి
నాట్యవైఖరిఁజూపె భూనాథునెదుట. 300

సీ. సరిలేని బంగారు జలపోసనము వీణె
మెఱుఁగుడాచనుగుబ్బమీఁద నిల్ప
[1]తులలేని వజ్రకాంతులు పెల్లు వెదఁజల్లు
గొనగోళ్లఁ దంత్రులుగూడ మీట
నిగ్గులు దులకించు నిడువాలుఁ గన్నులు
తళుకుసారెలమీఁదఁ దడబడంగఁ
గంకణంబులు ఘణఘణమ్రోయ బహుతాళ
గతులొలయించు సంగతులు మెఱసి

తే.గీ. క్రమముతో మంద్రమధ్య తారముల శుద్ధ
మిశ్ర సాళగముల రాణమీఱరాగ
వితతితగు మిత్రముల మేళవించిపాడెఁ
దెఱవయొక్కతె సంగీతదేవియనఁగ. 301

చ. కదలఁ గుచద్వయంబు వణకం దనుమధ్యము కక్షదీధితుల్
సెదరఁగ మోమునం జెమట చెన్నొదవం జెలువంబు గన్గవం
బొదలఁగ గంకణశ్రుతులు పొల్పెనగం గుసుమాస్త్రుదర్పముల్
ముదురఁగనుల్లసిల్లె నొకముద్దియ కందుకఖేలనంబునన్. 302

శా. వన్నెల్ మీఱఁగ జూపులందు మెఱుపుల్వ్రాలంగ నొక్కుమ్మడిన్
జన్నుల్మీదికిఁ జౌకళింప నడుముల్ జవ్వాడ[1]పాదందియల్
ఎన్నేరీతుల మర్దల ధ్వనులకున్ నింపారి మ్రోయన్మఱిన్
గన్నెల్గూడి నటింపఁజొచ్చిరి మహాకౌతూహలాలీలలన్. 303

వ. ఇట్లనేక ప్రకారంబుల నెలయించి యతి నిందెరలుపఁజాలక. 304

---

301 - క. తుహిలీల; చ. తుమిలీల.
303 - [1] క. పారంధియల్, చ. పాందియల్, ట. పాదాందియల్.

ఉ. మేనక విన్ననై చనియె మెల్లన మోమరవాంచె రంభ లో
నూనినచింత నివ్వెఱఁగు నొందెఁ దిలోత్తమ గర్వహీనయై
దీనతనొందె నూర్వశి మదిం జలియించె ఘృతాచి యన్యకాం
తానికరంబు మెల్ల దవుదవ్వులనిల్చె భయంబు పెంపునన్. 305

వ. ఆ సమయంబున. 306

చ. [1]బలుపుగఁ జిల్కుతత్తడికిఁ బల్లము వేసిన వార్త హేతిచేఁ
గలఁగె ధరిత్రి యల్ల నలకాపురి చంచల మొందె [2]స్వర్గమా
కులపడె వెండికొండ వయికుంఠము బిట్టు దలంకె దిక్పతుల్
మలయుచునుండె రేదెనల మన్మథవీరకుమారు ధాటికిన్. 307

సీ. పాటించి మృగనాభిపంకంబు మైఁబూసి
కప్పురంబునఁ దిలకంబుఁ దీర్చి
కమ్మని పువ్వుల సొమ్ములు ధరియించి
లాలితమణికుండలములుఁ బెట్టి
వెన్నెల నిగ్గు రేవెలుఁగుఁ జీరలతోడ
[1]పసిఁడి హంసావళి పట్టుగట్టి
మాధవీమల్లికామాలతీ[2]నవకుంద
దామంబు లింపారఁ[3] దనరఁ దుఱిమి

తే.గీ. పాంథజనముల గుండెలు వగుల నిగిడి
మొనయ నందియ డాకాల మొరయుచుండ
మగల మగువలఁ గరగించు మాయలాఁడు
లలితశృంగారవైభవలక్ష్మి మెఱయ. 308

సీ. రాయంచగములు గారవముతో మదకరి
[1]ఘటములై యిరువంకఁ గదిసి నడువఁ
గీరపోతంబులు చేరి సంభ్రమలీల
బాగా హయంబులై పరిఢవిల్లఁ
గలకంఠములు పెక్కు కలరవంబుల వీర
భటకోటియై మహార్భటముఁ జేయ
మలయానిలుఁడు దన దళవాయియై పెక్కు
సౌరభ శ్రీవిలాసములు [2]నడపఁ

---

307 — [1] ట. బలువగ; [2] ట. స్వర్ణ; [3] ట. దిక్కరుల్.
308 — [1] ట. పహిడి; [2] ట. వకుళ; [3] చ. గఁబంచి.

తే.గీ. బొలలు వేమావు లున్నత స్ఫురణ మెఱసి
మేలిజిగజంపు గొడుగులై మెండుకొనఁగ
వేడ్క వలరాయఁడను రాజు విరహిజనులు
తడబడంగను వనముల దండు విడిసె. 309

సీ. కలకంఠగణముల కలనాదములతోడఁ
గలహంసనాదముల్ గడలుకొనఁగ
అందె డాకాలి పెండార నాదంబుతో
ఝుంకారనాదంబు జడిగొనంగ
భూరిసుందరరాజకీరనాదంబుతో
వెడ వింటి నాదంబు సుడిగొనంగ
నందంద చెలరేఁగి యార్చు నాదములతో
[1]నలి వేదనాదంబు చెలువు మిగులఁ

తే.గీ. గలికి వెన్నెల గాయంగఁ గమ్మగాలి
యెలమి వీవంగఁబూ వింట నెక్కువెట్టి
పుష్పబాణము లైదు నద్భుతముగాఁగ
రాజసము మీఱ నా రతిరాయఁ డేసె. 310

క. అయేటురవడిఁ గనుఁగొని
కోయని వెసనార్చి గండుకోయిలగమి భూ
నాయకుఁడు చంచలింపమి
కాయెడ వెఱగంది యేసె నతఁడు న్మతియున్. 311

తే.గీ. అట్లు పుంఖానుపుంఖంబు లగుచు నిగుడు
నతనుబాణపరంపర లానృపాలు
నిచ్చ [1]వేలింపఁజాలక విచ్చిపోయె
జగతిఁ బువ్వుల కదియ నైజంబు కాదె. 312

క. తా ననమాస్త్రం తనియును
మానవపతి మానినీసమన్వితుఁ డనియున్
బూని మది దురభిమానము
మానక వెఱగంది మరుఁడు ప్రమాన్పడి నిలిచెన్. 313

---

309 – [1] ట. ఘటలయై; [2] క. కరవ.
310 – [1] క.చ. కరకేగ.
312 – [1] ట. దెరలింవ.

తే.గీ. అఱఁగె మలయానిలుండు సొంపఱె వసంతుఁ
డెలమి భ్రాంతిని బొందె గోయిలలు బెదరెఁ
జెదరి మోములు వంచె రాచిలుక పిండు
చిన్నబోయిరి దివి[జ] [1]రాజీవముఖులు. 314

సీ. ఉదయాద్రిశిఖరిపై నొప్పు భానునిక్రియ
మౌళిఁ గిరీటంబు మహిమ వెలుఁగ
విపులవక్షఃస్థల[1]పీఠికాంతరమందుఁ
గౌస్తుభమాణిక్యకాంతు లలమ
నాజానుదీర్ఘంబులగు చతుర్భుజముల
శంఖచక్రంబులు సంభ్రమింప
రమణీయపీతాంబరప్రభాపటలంబు
కటిమండలమున శృంగారమొప్ప

తే.గీ. రూఢిఁ బెంపొంద విహగాధిరూఢుఁ డగుచు
దివ్యతేజంబు దిక్కులఁ దేజరిల్ల
సిరియుఁ దానును గరుణార్ద్రచిత్తుఁ డగుచు
రమణఁ బ్రత్యక్షమయ్యె నారాయణుండు. 315

క. సురపావకయమనైఋతి
వరుణానిలధనదశివులు వచ్చిరి వేడ్కన్
గరిమేషమహిషనరఝష
హరిహయవృషభముల నెక్కి యా హరితోడన్. 316

క. ఆ రాచతపసి యొయ్యన
శ్రీరమణునిఁ జూచి తనదు చిత్తం బలరన్
గోరిన కోర్కులు తగ నమ
కూరె ననుచు మ్రొక్కి లేచి కోరి నుతించెన్. 317

అ.వె. కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ
యప్రమేయ వరద హరి ముకుంద
నిన్నుఁ జూడఁ గంటి నీ మూర్తిఁ బొడగంటి
నఖిల సౌఖ్యపదము లందఁగంటి. 318

వ. అని యనేక విధముల స్తుతిచేసి సాష్టాంగ [దండ] ప్రణామంబులు సేసి నిలువంబడు నెడ శ్రీరమణుండు నీ యభీష్టం బెయ్యది తెలుపు మనిన

---

314 – 1 చ. చెలువలంత.
315 – 1 చ. ట. పీఠికా.

దేవా ! వరం బొసంగెదేని, దీర్ఘాయుష్మంతుండును, బలపరాక్రమవంతుండును, రూపవంతుండును నగు కుమారుండు గలుగను, నా చిత్తంబు భవత్పాదంబులపై నిలుచునట్లుగా వరంబు దయసేయ[1]వలయు ననిన, నట్లు కానిమ్మని యద్దేవుండతని వీడ్కొని నిజ నివాసంబునకుఁ జనిన సుకీర్తి భూపాలుండును, సంతోష[2]చిత్తుండై తన పురంబుఁ బ్రవేశించి తదనంతరంబ. 319

చ. కలికితనంబు లుల్లసితకాంక్షలు నిండి తొలంగు [టొక్క బా]
గుల తమకంబు లింపొదవఁ గూరిమి చాలఁగఁ బుట్టఁ జేయునే
ర్పులఁ గడలేని కూటములఁ బొందగు మాటల బుజ్జగింపులం
గలసి పెనంగి [1]రొక్కెడన కాంతయుఁ గాంతుఁడు పెక్కు భంగులన్. 320

క. వదనంబును బదయుగమును
బెదవులుఁ జేచేయి కదియఁ బెనచుచు వలపుల్
పొదలఁగ రతిఁ గ్రీడించిరి
యిది బగలిది రాత్రి యనక యిరువురు వేడ్కన్. 321

క. ఆలోనవె యొక కొండొక
కాలము సుఖలీల [1]జరగఁగా నొయ్యన యా
బాలాలలామ కాదట
చూ లేర్పడి గర్భ మొప్పె సురుచిర భంగిన్. 322

క. పలపలనై పిదపిదనై
కలనంబై కరడుగట్టి కలనాదముతో
తలయేర్పడి గర్భంబై
నెల మనలెన్ జీరఁజిక్కె నెలఁతకునంతన్ 323

[గర్భచిహ్నములు]

ఉ. తోరములయ్యెఁ జన్నుగవతోన తొడల్ తనుకాంతితోన తె
ల్పారె విలోకనంబులుఁ గుచాగ్రతలంబులతోన యారు[1]గ
ప్పారెఁ గచంబుతోన వళులల్లన డిగ్గపడందొడంగె శృం
గారముతోన పాల్పడరె గర్భవిలాసము మందహాసమున్ 324

---

319 — 1 ట. దగు ; 2 ట. వంతుండై.
320 — 1 క. రొక్కడన, చ. రొక్కెనట, ట. రొక్కటన.
322 — 1 క. జత.
324 — 1 క. చ. కెంపారె.

క. నెలఁత శిశువునకుఁ బ్రొద్దుల
నెలనమృతమునించి యింద్రనీలపుమూ [కు]
ళ్లలరించిన బంగారపుఁ
గలశములనఁ గుచయుగంబు గప్పున నొప్పెన్. 325

సీ. తమ్మిమొగ్గలమీఁద నెమ్మిఁదుమ్మెదజోడు
మొలచినక్రియఁ జన్నుమొనలు దనరెఁ
బనమించువెన్నెలపైఁ గప్పుబూఁదీఁగె
పొలుపున దేహంబు [1]పలచఁబాఱె
సూర్యోదయము[2]వేళ సొంపార వికసించు
నళినంబు విధమున నాభి విరిసెఁ
బెన్నిధిఁగనుగొన్న పేదచందంబునఁ
గడనన్నమైన నెన్నడుము వొదలెఁ

తే.గీ. బొలఁతి కప్పుడు గోర్కులు పొలుపుమీఱఁ
దొడవు లతిభారముగఁ దోఁచెఁగడుపు దఱిగె
మందయానవిహారంబు డిందువడియె
గర్భసౌభాగ్యమహిమచేఁ గాంతకపుడు 326

తే.గీ. ఇందువదనకు నూర్పులు నందడించె
లలన మదిఁబ్రోదిరాయంచ చెలిమివదలె
నాతి కోర్కులు నంచలనంబునొందె
నతివ నాలుక చవులకు నాసచేసె 327

సీ. తనకుముందఱనింకఁ దలవంపులౌనని
నాతిచన్మొక్కులు నల్లనయ్యెఁ
దనయౌవనార్థమింతటఁ దీరునోయని
పల్లవాధరిమోము వెల్లనయ్యెఁ
దనయులు లేమికిఁ దరుణి రోసినమాడ్కి
నంతంతకును సోకిలింతపుట్టెఁ
దనవంశమెల్ల వర్ధన మొందుకైవడి
పొలఁతినెన్నడుమింత పొదలదొణఁగె

తే.గీ. నడపు జడనయ్యె వెడనిద్ర దొడరఁజొచ్చె
దప్పి వాతెఱఁజాలంగ నుప్పతిల్లెఁ
గాంత కప్పుడు నవమాన గౌరవమున
పుత్రుఁ డుదయించె యౌవనశత్రుఁడగుచు 328

326 – [1] ట. వలక ; [2] ట. చేత.

క. నవమాసంబులు నిండినఁ
బ్రవిమలశుభలగ్నవేళ భాసురవిభవో
త్సవలీల వెలయ సుతుఁడు
ద్భవమయ్యెను బంధుజనులు ప్రస్తుతి సేయన్ 329

సీ. [1]మొనసి మారుతము చల్లనికావులను వీచె
దొరకొని దివ్యదుందుభులు మ్రోసె
గురుబంధుజనముల కోర్కులు దెలివొందె
జడిగొని పుష్పవర్షములు గురిసె
నచ్చరలేమల యాటలు చూపట్టెఁ
గిన్నర గంధర్వగీతు లెసఁగె
[2]వేలిమి దక్షిణజ్వాలలు వెలుఁగొందె
బుధులకు హర్షంబు వొడమె మదిని

తే.గీ. వందిమాగధ జయజయధ్వనులు నిండె
నోలి ధేనులు దుగ్ధముల్ చాలఁబితికె
దిక్కులెనిమిది యొక్కటఁదేజరిల్లె
వృక్షములు పండిఫలముల విఱ్ఱవీఁగె 330

క. ఆ వార్త విని రయంబున
భూవిభుఁడు తురంగరత్నభూషణగజనా
నావస్తు వితతులొసఁగెను
వావిరి గుణియిడక [1]యుత్సవంబున వేడ్కన్ 331

క. భూమీసురుల కొసంగెను
గ్రామంబులు గోగణంబుఁ గనకంబు మణి
స్తోమములుఁ జాల భూప
గ్రామణి సంతోషగుణ[1]విరాజితుఁడగుచున్ 332

మ. తలపంకించిన నూనె పుక్కిట సదాతాంబూలముల్ నేత్రక
జ్జలముం [1]గంధరఁగట్టుకొన్న వనపూసల్ గబ్బిపా లుబ్బు గు
బ్బలు నేకాంగుళికార్పితాళికల సద్భస్మంబు జిడ్డైన దు
వ్వలువం బెల్లుగ బిడ్డగాన్పు నడపెన్ వామాక్షి బాలెంతయై 333

---

330 – [1] ట. లలిత ; [2] క. పుత, చ. కీలిపుర.
331 – [1] క. యుత్సుకంబున.
333 – [1] క. గడ్డగ, చ. గద్దర.

తే.గీ. పదిదినంబులు వెళ్లిన బంధుజనుల
విప్రతతిగూర్చి పుణ్యాహవిధియొనర్చి
కాంతి నుడురాజు మించుట కతన రాజ
శేఖరుండనునామంబు సేసిరపుడు 334

చ. అరుణజటావిడంబమున నంబికకున్ముద మొందఁజేయుచున్
బరిజనరాజి వేడుటకుఁ బన్నుగనిచ్చుటె మేలనమ్మగాఁ
బొరసిన భూరజంబిడిన భూపతి శాశ్వతమూర్తియైన యీ
శ్వరుక్రియ నొప్పె రానుతుఁడు శైశవలీల జనానురక్తిగన్ 335

మ. తనరమ్యాకృతి కాముబాణగతి కాంతామానసంవేదియై
తనధైర్యం [1]బరిభూతలేశకులకాంతారోగ్రదావాగ్నియై
తనదానంబవనీసురాపదచలేంద్రవ్రాతదంభోళియై
తనరంగా నుతికెక్కె వర్ధిలె జనోత్సాహంబు రెట్టింపఁగన్ 336

చ. తలవణకం దొణంగెఁగలధౌతశలాకలఁబోలి వెండ్రుకల్
పలితములయ్యె మైనర లపారము దోఁచె బొమల్సుధాంశురే
ఖలఁ బురణించుచున్ వదలి కన్నుల మీఁదికివ్రాలె నింద్రియం
బులదెసపోక డిల్లపడి బుద్ధి చలించె జరాప్రసంగతిన్ 337

సీ. ప్రాయంబు కాలిన భస్మంబు విధమున
నల్లనివెండ్రుకల్ తెల్లనయ్యె
విషయంబు లన్నియు వెలితిగా నమసిన
స్రుక్కినక్రియ మేనుస్రుక్కి వ్రాలెఁ
బూర్వవర్తనముల పోకకు వెఱగంది
తలయూచు విధమునఁదల వణంకె
వివిధకామసుఖానుభవమునఁ గడు పెట్లఁ
బడినట్లు చిత్తంబు జడను బడియె

అ.వె. ధరణి మీఁది వేడ్కఁదగిలి చూచెడి క్రియ
వీపు వ్రాలి బఱడు విరిసె నొడల
దృష్టి మందమయ్యెఁ దెలివేఁది విభునకు
వార్ధకంబు ముట్ట వచ్చుటయును. 338

క. మిక్కలి భోగములందితి
నెక్కుడు సంపదలఁ గంటి నెల్ల గుణములం
జక్కని తనయునిఁ బడసితి
నిక్కంభినిఁ బెద్ద కాల మేలితి నింకన్. 339

---

336 — [1] క. బరి.

రాజ్యభరం బఖిలగుణ
ప్రాజ్యుండగు [1]తనయు నంద[2]పాటించెద సా
మ్రాజ్య పదంబున కెంతయుఁ
బూజ్యం డతిచతురుఁడితఁడు [3]పుత్త్రుఁడె తలఁపన్. 340

[1]ధీరోదాత్తుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు సౌజన్య వి
స్తారుండుత్తమ [2]సాధుఁడర్క కుల విస్తారుం[3]డుదారుండు గం
భీరుండిద్ధ విచార సారుఁడగుటం [4]బెంపొంది విశ్వంభరా
భారంబెల్ల భరింప[5] నా సుతు మహాభాగున్నియోగించెదన్. 341

ఏను సమస్తదానములు నెల్ల వ్రతంబులు సర్వధర్మముల్
మానుగఁజేసి జన్మములు మానక చేసి వివస్వదన్వయాం
భోనిధిపూర్ణచంద్రుఁడగు పుత్త్రనిధానము [1]వేడ్కఁగంటిఁ బెం
పూనఁగ నింక నిన్ను మహిమోన్నతిఁ బట్టముఁగట్ట ధన్యుఁడన్. 342

పొలఁతుల వాలుఁజూపులయంద చాంచల్య
మబలల [ నడలందె జడిమ కలిమి ]
కాంతాలకములంద కౌటిల్యసంచార
మతివల నడుములయంద లేమి
ముదితల పరిరంభములయంద పీడన
మంగనాకుచములయంద పోరు
పణఁతుల [ రతులంద బంధసంబాధంబు ]
[1]నతులఁబాయుటలందె నంజ్వరంబు

తే.గీ. ప్రియులు ప్రియురాండ్ర మనములబెరసి తార్పు
లంద [2]సౌఖ్యంబు వల్లభులాత్మ నతుల
నాఁగి గ్రుమ్ముళ్లు [3]పెట్టుట [ ంద క్రమం ] బు
రాజశేఖరుఁ డేలు నా రాజ్య మందు 343

మతిమంతులు సామంతులు
హితులు పురోహితులు సుతులు హేలావతులున్
జతురులు బంధు లమాత్యులు
కుతుకంబునఁగొల్వ రాజు కొలువున నుండెన్. 344

---

340 – [1] ట. సూను ; [2] ట. ప్రాపించెద ; [3] ట. పుత్త్రునిలోనన్.
341 – [1] ట. ధీరోదారుఁడు ; [2] ట. శీలు ; [3] ట. గణ్యుండు ; [4] ట. బెంపార ;
[5] ట. నీతని.
342 – [1] ట. నిన్ను.
343 – చ. లో లేదు, [1] క. సంభావంబుతోఁబతులఁబాయు : [2] క. శౌర్యంబు ;
[3] చ. వట్టుట.

తే.గీ. హితులు మంత్రులుఁ దగు పురోహితులుఁగొలువఁ
దరుణు లిరుగడ నిలిచి చామరములిడఁగ
మణిమయంబైన రమ్యహర్మ్యంబునందు
నతిముదంబునఁ గొలువున్న యవసరమున. 345

సీ. పలచగా నలఁదిన భసితంపునునుఁబూఁత
మొలక వెన్నెలతోడ ముద్దు గుడియ
రూఢిగాఁ దాల్చిన రుద్రాక్షమాలిక
లలఁతి పెన్నురమున నత్తమిల్లఁ
దపనీయవల్లరీతతితోడ [1]నెన వచ్చు
బెడఁగైన నిడుద కెంజడలు వ్రేల
సాంధ్యరాగము తోడఁ జర్చించు కాషాయ
వస్త్రంబు కటిమీఁద వన్నెఁజూప

తే.గీ. గురుతరస్ఫూర్తి నొక కేలఁ గుంచె మెఱయ
వీణ యొక కేల మీటుచు రాణ మీఱ
వేడ్కఁ జనుదెంచెఁ దా వినువీథి నుండి
నారదుఁడు సర్వశాస్త్రవిశారదుండు. 346

క. మును నేఁజేసిన పుణ్యము
ఘనమై మీ దర్శనంబుఁగలుగఁగఁ జేసెన్
నినుఁ జూచిన యీ సుకృతము
నొనరఁగ నా కెట్టి భాగ్యమున్నదొ యింకన్. 347

క. తలఁచిన మాత్రనె కాంక్షిత
ఫలముల నొనఁగెడు తపఃప్రభావము నీకున్
గలదైనను నేఁజేయఁగ
వలసిన పనియెద్ది చెప్పవలయు మహాత్మా. 348

ఉ. అల్పులు గారు మీరు మమునాన పదం బనిలేదు సిద్ధసం
కల్పులరైన మీరు కృపఁగైకొని నన్నుఁ గృతార్థుఁజేయు సం
కల్పముఁజేసి వచ్చితిరి కావలయుం దలఁపన్ దపఃక్రియా
కల్పభవత్సమాగమనకార్యము నా కెఱుఁగంగఁ జెప్పవే. 349

వ. అనిన నారదుండిట్లనియె. 350

346 — [1] ట. బెనవచ్చు.

ఉ. చూచితిఁ బెక్కు దేశములఁ జూచితిఁబెక్కు ధరాతలేశులన్
జూచితిఁ బట్టణావళులఁ జూచితిఁగాని ధరాతలంబునన్
నీ చతురత్వవైభవ[1]ము నీ మహిమాతిశయప్రతాపమున్
గోచరకోటికిందెలిసి కోరి నుతింప నగోచరంబగున్. 351

ఉ. ఆ కమలారి యంగజునినైనఁ దృణీకరణంబు సేయు నీ
కీ రమణీయ[1] రూపమున కీడగు నంగన లేక యుండుటల్
నీకు హితోపదేశమటు నిక్కము సేయఁగఁబూని రాక నా
రాక ధరాతలేశ యని రాజున కమ్మునిముఖ్యుఁ డిట్లనున్. 352

తే.గీ. దండితారాతి పాండ్యభూమండలమునఁ
జిత్రసేనుఁడు గలఁడు విచిత్రయశుఁడు
ఆతనికిం గూర్మినందనయగుచు వెలయు
రత్నసుందరి యను గజరాజ గమన. 353

తే.గీ. అఖిల మోహినియైన యయ్యలరుబోణి
శైశవమున వీడుకొన్నది నందుగాఁగ
ననుదినంబును రాజనందనుల మీఁద
వేటలాడుచున్నాడు విషమశరుఁడు. 354

క. ఆ నతి కెన సేయంగా
నీ నకలధరాతలమున నేర్పడ లే ర
వ్వానవుని కొల్వులోపల
వాసుకి పురమందుఁదక్క వనితాజనముల్. 355

తే.గీ. రాజనిభతేజ యగ్గజరాజగమన
నవ్య సౌందర్య విధము విన్నాఁడనై న
విస్తరంబుగ నాపాదమస్తకంబు
వరుసతో మీరు వినిపింప వలయుననిన. 356

క. అనవుడుఁ గానిమ్మని యా
వనజాసనతనయుఁ డధికవాత్సల్యమునం
జననాథుతోడ లెస్సఁగ
వినుమని తా నిట్టులనియె విశదం బెనఁగన్. 357

---

351 — [1] ట. మనీష మహాతిశయ.
352 — [1] ట. గాత్రునకు నింవగు.

తే.గీ. జనసమూహంబు లయ్యింతి చక్కఁదనము
నిట్టి [1]దట్టిదియని నిర్ణయింపనేర
రైన నానేర్చు తెఱఁగున నవయవముల
రూపసంపద వర్ణింతు రూఢిగాను. 358

చ. మొలక మెఱుంగు జాజివిరి ముత్తెపుజల్లి పసిండి బొమ్మ రా
చిలుకల కొల్కి మోహనవశీకరమంత్రము మించుఁ జొక్కపుం
గలికి చకోరనేత్ర పసిగల్గిన రత్నశలాకకాంతిఁ జె
న్నలరెడు చిత్రరేఖ యన నంగన దా విలసిల్లు భూవరా! 359

ఉ. కారు మెఱుంగు తోడి చెలికత్తియ వెన్నెలలోని తేట శృం
గారరసంబునం గరువుకట్టిన బొమ్మ పదారువన్నె బం
గారపునిగ్గు మన్మథవికారవిలాసము పుట్టినిల్లు నా
నీరజనేత్ర యొప్పె [1]రమణీయగతి న్నవయౌవనంబునన్. 360

తే.గీ. విదుషి [1]యాయింతి తలఁదాల్చు వెండ్రుకలకు
నహహ! యెబ్బంగి సాటి సేయంగవచ్చుఁ
బళువుచేతఁ బురస్కృతిఁ బడయులేక
చాపలంబున వర్తించు చామరములు. 361

క. నీలాహి మేనికంటెను
నీలాలకకంటె నింద్రనీలము కంటెన్
నీలరుచిఁ బొల్చు నాసతి
నీలాలక లేమిచెప్ప నిఖిలాధీశా! 362

ఉ. వర్ణనఁ జూడఁ[1] గందు గుణవర్ణన సేయ ఖలుండు పుష్టి నా
జీర్ణకరుండు తమ్ములెడ జీవుల కోర్వనివాఁడు దిక్కులం
గర్ణవిహీనుఁడై నతని ఘాతకు లోఁబడి భ్రాంతుఁడైన యా
పూర్ణసుధాకరుండు పువుబోఁడి[2] ముఖంబు[3]కు సాటివచ్చునే. 363

ఉ. చందురునందుఁ గాంతి జలజంబులయందు వికాసమందు నా
సుందరి మోముతో నుపమ చూచుట యింతియె కాక భ్రూలస
న్మందకటాక్షవీక్షణము మంజులభాషలు మందహాసమున్
జందురు తండ్రికైన జలజాతము తాతకునైనఁ గల్గునే. 364

---

358 — 1 ట. దిట్టిద.
360 — 1 చ. ట. గమనీయ.
361 — 1 ట. యీ.
363 — 1 క. గంధు; 2 ట. నకేడు; 3 క. వచ్చెనే.

స్మరసమ్మోహనమంత్రదేవత మనోజప్రౌఢసామ్రాజ్యల
క్ష్మీరమానందనభాగ్యరేఖ మదనక్రీడావనీ పుష్పమం
జరికామాపరకీర్తి మన్మథపునస్సంజీవనీవిద్య నా
ధరణీశోత్తమ [1]కన్య యొప్పె విలసత్తారుణ్యసంపన్నయై. 365

రాహుదంష్ట్రాంకురక్రకచఘాతంబుల
నొక్కొక్క మఱి నొవ్వి నొందకున్నఁ
బరివేష[1]మిషయైన పాశబంధమ్మున
బహువారములు [2]గట్టువడకయున్నఁ
బ్రతి[3]వాసరము గుహూరాత్రివేళలయందు
నత్యంతనాశంబు నందకున్న
బలవత్కళంక కజ్జల పంకసంకర
స్ఫూర్తిమాలిన్యంబుఁ బొరయకున్నఁ

గీ. గాక సరిఁ[4]బోల్పవచ్చునే కమలవైరి
యనధిగతదోషమైన [5]యియ్యతివ మొగము
మధురబింబా[6]రుణోష్ఠంబు మాఱుగాఁగ
నమృతపూరంబు గలిగిన యంతమాత్ర. 366

వె. అమృతరసము బావి యలరు కెంపుల దీవి
మొలక చిగురు చావి మోఁక మావి
కప్పురంపు ఠీవి కమ్మని చెంగావి
తియ్య తేనె తావి తెఱవ మోవి. 367

నిబిడశైశవ యౌవనీయ సంధ్యావేళ
యాననచంద్రబింబామృతంబు
లపనామృతాంశుజాలప్రభాజాలంబు
బంధుజీవలతాంతబాంధవంబు
పరిపక్వబింబికాఫలవిడంబనముద్ర
విద్రుమద్రుమలతావినిమయంబు
మదనానారాచకోమల మైంగుళచ్ఛాయ
యన్మన్మనోనురాగాంకురంబు

---

365 — [1] క. చ. కన్నె.
366 — [1] క. చ. మయ ; [2] క. పట్టు ; [3] ట. మానమును ; [4] ట. బోలఁజాలునే ;
[5] ట. యియ్యతివ ; [6] ట. ధరో.

తే.గీ. మహితలావణ్యగుణజాయమానబహుళ
మాధురీచిత్రశోభాసమన్వితంబు
ప్రార్థనాకల్పపాదపప్రాజ్యఫలము
తియ్య పూఁదేనియల [1]దీవి దీనిమోవి. 36

చ. [1]మెలపున దాడియాడు మగమీల విలాసముఁ బోలి వ్రాలి పాం
దలకపుఁ జాయమీఱి వెలిదామరరేకుల [2]దెల్పు నవ్వుచుం
గలువల కాంతి గైకొనక కారుమెఱుంగుల గేరినేత్రముల్
చెలువకు నొప్పు ముత్తియపుఁ జిప్పలపాటి [3]కొకింత గొప్పలై. 36

ఉ. ఎంచగ నొప్పుచుండు [1]మఱి యిందు [2]కరావళి ముంచితెచ్చి పై
వంచిన పాల్కపువ్వు వలవైచిన చాడ్పునఁ గల్వదండ సా
రించిన లీలఁ దమ్మివిరి ద్రిప్పిన భంగి మెఱుంగు దీగె [3]గు
ప్పించిన మాడ్కి వాలు ఝళిపించిన కైవడి [4]దీని నేత్రముల్. 37

చ. తెలుపులు కప్పు లొప్పులును దేటలు విప్పులు దీర్ఘలోలముల్
బెళుకులు చంచలస్థితులు భీతులు విభ్రమలోల జాలముల్
కళుకులు సోగలుల్కములు కారుమెఱుంగులు మోహనాస్త్రముల్
చెలువ కటాక్షయంత్రములు చిత్తములోపలి ప్రాణమంత్రముల్. 37

చ. కలువలునున్ జకోరములఁ గారుమెఱుంగుల గండుమీల వె
న్నెలలను దమ్మిరేకులను నిర్మల మౌక్తిక[1]శుక్తిపంక్తులన్
దలఁచి పయోజగర్భుఁడు సుధారసధారలు దెంటిలో విషం
బులు చిలికించి చేసెనొకొ పొల్పెనలారఁగ దీని నేత్రముల్. 37

మ. దళదిందీవరకాంతి[1]పుంజదళసత్వక్పాటనానంతరో
జ్జ్వలరంభా[2]దళగర్భసంపుటలసచ్ఛాయాకలాపంబుతోఁ
గలయంగూర్చి చతుర్ముఖుం డొనరిచెంగాఁబోలు నాకర్ణశ
ష్కులికాపాంగములైన యీ చిగురుటాకుంబోడి నేత్రాబ్జముల్. 37

తే.గీ. శ్రవణపుటకూపవినిపాతసాధ్వసమున
నిగిడి యవ్వలి [1]కడఁబోక నిలిచెఁగాన,
యధిక[2]దీర్ఘ స్వభావంబులైన యట్టి
దీని కన్నులు దల చుట్టు తిరిగిరావె. 37

368 — [1] ట. క్రోవి.
369 — [1] చ. ట. మెలుపన ; [2] ట. దెల్వి ; [3] ట. కినింత.
370 — [1] ట. దగ ; [2] క. చ. కళావతి ; [3] చ. ట. గప్పించిన ; [4] ట. నింతి.
372 — [1] ట. రత్నశక్తులన్.
373 — [1] క. చ. పంచపదల ; [2] ట. తరు.
374 — [1] చ. కటవోక. ట. కటువోక ; [2] ట. చపల.

క. కేదారములో శిశిర
ప్రాదుర్భావము [1]జనించి పడసిన యురువు
ణ్యోదయమున నొకొ యీ శా
తోదరి [కిం] గన్ను లగుచు నున్నవి దమ్ముల్. 375

ఉ. తొంగలి ఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమింపకొనునో ముఖచంద్రుఁ డటంచుఁ బోవనీ
కంగజుఁ డాన[1]వెట్టి కలియం గుఱి వ్రాసె ననంగ జాఱె సా
రంగమదంబు లేఁజెమట గ్రమ్మి లలాటము డిగ్గి చెక్కులన్. 376

తే.గీ. యౌవనాంబుధరోద్భూత హావభావ
వారిధారాభిపూర్ణశృంగారసరసి
యబ్జభవసృష్టివిద్యారహస్యభూమి
నిఖిలలావణ్య[1]మహిమ యీ నీరజాక్షి. 377

ఉ. చంచలనేత్ర మేని నునుజాయకు సాటియొనర్పఁగాఁ దగుం
గాంచనకేతకీకుసుమగర్భదళంబులు ధూళి గ్రుంగ వే
నంచిత భీతి నీ సరసిజాక్షి తనుద్యుతి కోడిగాదె సే
వించెను [1]వారిదుర్గ మరవిందవరాటకచక్రవాకముల్. 378

తే.గీ. ఇంద్రుఁ డింతికి రక్షగా నిడఁగఁబోలు
నాభరణవజ్రమూర్తి వజ్రాయుధంబు
నతఁడు నంతటఁబోక బాణాసనంబు
నిఖిలమణి దీప్తియనుపేర [1]నిల్పఁబోలు 379

తే.గీ. సాయకంబులు మూట ముజ్జగముఁ గెలువఁ
బాలు వెట్టి [1]సృష్టించిన పాదయుగళి
మదనుఁ డేతద్దృగంభోజపదమునందు
[2]గారవంబున పట్టంబు గట్టఁబోలు 380

తే.గీ. హరుని కోపాగ్నిఁ బొగచూఱి మరునిచాప
మసితకేసరపరివేషమైననాఁడు
హృదయమోహసశశికి నీ యిందువదన
కంచితభ్రూలతారేఖకైన యుపమ 381

---

375 — [1] ట. నఁజొచ్చి.
376 — [1] క. చ. బెట్టి.
377 — [1] ట. సీమ.
378 — [1] క. వాటి.
379 — [1] ట. నిలువ.
380 — [1] చ. ట. శోభించిన ; [2] ట. గౌరవంబొప్ప.

తే.గీ. రత్నసుందరి యాకారరమ్యలీల
పోల నష్టాదశద్వీపములను గలుగ
ననుచు శ్రుతులను సంజ్ఞ నయ్యతివయందుఁ
[1]దొమ్మిదులు రెండులిఖియించెఁదమ్మిచూలి 382

తే.గీ. చదువు రాజశుకబ్రహ్మచారులకును
దామరసనేత్ర వదన మధ్యయనగృహము
[1]గాణలై వచ్చు కోకిలగాయకులకు
నాతికంఠంబు చతురసంగీతశాల 383

తే.గీ. అమృతవారాశి మధ్యంబునందునున్న
కమలలోచను దక్షిణకరమునందు
నొనరు నప్పాంచజన్యంబొకోయనంగ
జననుతంబగు మీనలోచన గళంబు 384

తే.గీ. ప్రతిఫలించిన వేణికాభారఖచిత
మల్లికలు రాజతాక్షరమాలికలుగ
శంబరారాతి విజయశాసనసువర్ణ
పట్టికయుఁబోలె నొప్పు నప్పడఁతివీపు 385

చ. కదిసిన నూత్నయౌవనపుఁగాఁక నణంగినరీతిబాల్యతల్
వదలఁగ బొట్లు బొట్లు వడి వర్తులభాగము వేఱుపాటులై
తుద మెఱుఁగెక్కి [1]వట్రువయి తోరపుఁబయ్యెద [2]కొప్పుసూపఁగా
నుదితమనోజరాగరస మున్నతిఁ బెంచెఁ గుచంబులింతికిన్ 386

చ. నగినల నవ్వి జక్కవలఁజాలవు పొమ్మని పైడికుండలం
దెగడి కరీంద్రకుంభముల ధిక్కరణంబొనరించి తమ్మి క్రొ
మ్మొగడల గేలిసేసి జనమోహనలీలలనాడు నాటికిం
[1]జిగి మిగులంగఁ జన్నుగవచెన్ను వహించెఁగురంగనేత్రికిన్ 387

చ. వదలక వల్దలై బిగిసి వ్రాలక వట్రువలై తనర్చి పై
గుదురుకొనంగలోఁ బొదలి కొంతకెలంకులబిక్కటిల్లుచున్
[1]మృదువు నమృద్ధియుం గలిగి మోదముసేసి మనోజపూరితా
స్పదకలశంబులోయనఁగ [2]భామకుఁ జన్నులు నొప్పునెంతయున్ 388

---

382 — 1 దుమ్మెదలు.
383 — 1 ట. గాతలై.
386 — 1 చ. వట్రలై ; ట. వట్రనయి ; 2 చ. లొప్పు ; ట. కొంగు.
387 — 1 క. జని.
388 — 1 ట. ముదురు ; 2 ట. జన్నులు, వొల్చు వధూటికింతయున్.

క. ఇంతలు మరుపూబంతుల
యింతలు మారేడుబండ్ల నీడుపు నీకై
యింతలు దామర మొగ్గల
[1]దంతుల కుంభములఁబోలుఁదరుణికుచంబుల్ 389

ఉ. బంతులు [1]కంటిలోని [2]దళభావముఁ జూపెఁ బసింధికుండలుం
దంతుల కుంభముల్ జరిగెఁ దామరమొగ్గలువిచ్చె జక్కవల్
చింత వహించెఁ దాళములు చేపడె బిల్వఫలంబులెండె న
య్యింతికుచద్వయంబునకు నీడుజగంబునఁ గల్గనేర్చునే 390

క. నయనాద్యవయవములు మే
లయిన పదార్థములుచేసి యజుడవిహోఁగా
[1]బయలావటించి చేసిన
క్రియ నయ్యరవిందగంధికి న్నడుమొప్పెన్ 391

తే.గీ. చనుగిరుల నుండి వెన నాభిసరసికెపుడు
కదలి చనుదెంచురతి [1]రాజుగంధకరటి
మదనిషిక్త మలీమసమార్గమనఁగ
సతివ నవరోమలత యొప్పె నవనినాథ! 392

క. తన జనకుఁడు శౌరి సుద
ర్శనచక్రమునను జయించె జగమనిమరుఁడీ
వనిత యదర్శనకటితట
ఘనచక్రమునన్ [1]జయింపఁగాఁ దలఁచెఁ జుమీ 393

తే.గీ. గరిమ మించిన యాకాశగంగ నడిమి
సుధలకెల్లను ధాతువుల్ సూపునట్టి
గురుబిలో యనఁగాఁ గృశోదరముక్రింద
గూఢగతి నాభి సొంపారుఁ గోమలికిని 394

తే.గీ. ఊరుకాండద్వయమున నీ యుత్పలాక్షి
సమదవారణరాజహస్తంబు గెలిచె
నదియుఁగాఁ దణమునఁ గదా యధికలజ్జఁ
బొంది[1] మునిగించునది యాస్యపుష్కరంబు 395

---

389 — [1] క. దంతికి ; చ. దంతి.
390 — [1] ట. వట్టి ; [2] ట. క. చ. వళ.
391 — [1] ట. బయలారిచిచే పిచిన.
392 — [1] ట. రాజ.
393 — [1] క. జనియించెగా.
395 — [1] ట. ముడిగించు.

తే.గీ. రాజసంబున నవ్వలరాయఁడేఁచి
విరహిజనములపై దండువెడలువేళ
కవగఁబూరించు బంగారుకాళలనఁగ
కమలలోచన జంఘయుగంబు మెఱయు 396

తే.గీ. పల్లవంబులఁ గోమలభాతిఁదెగడి
యరుణనీరజముల కాంతి నపహసించి
చాలఁగనుపట్టు లత్తుకఁ గేలిసేసి
పదతల[1]శ్రీలు చెలువారు పద్మముఖికి 397

సీ. నిండు చందురునకు నెత్తమ్మితావియు
నందంపుఁబొల్పును నబ్బెనేనిఁ
గరికుంభములకు బంగారు తాడ్పులయొప్పు
శకటాంగముల విప్పు జరిగెనేని
[1]అరటికంభములకు నకరవంబును డాలు
తూణీరముల మేలు దొరికెనేని

[2]సరసిజాతములకుఁ జంద్రదంపుఁబెంపును
జిగురుటాకుల సొంపుఁ జేరెనేని

తే.గీ. చపలలోచన మోముతో సమము వచ్చు
నింతిపాలిండ్లతోడుత నీడు వచ్చు
వనిత యూరుద్వయంబుతో నెనయవచ్చుఁ
జంద్రముఖి పాదయుగముతో సాటివచ్చు. 398

క. కుందనపుఁ గమ్మవలపుం
జెందిన చందమునఁదెల్ల చెఱకునఁబండై
సుందరియగు నక్కన్నియ
యందెలఁ బ్రాయంబు విడువ నాయిత మయ్యెన్. 399

క. తొడరియుఁ దొడరని సిగ్గునఁ
బొడమియుఁ బొడమని యురోజముల జాపలమున్
విడచియు విడువని నడపులఁ
బడతుకపై నూఁగు నూఁగు బ్రాయంబయ్యెన్. 400

---

397 – [1] క. లక్రటట; ట. లంబులు.
398 – [1] ట. అనటి ; [2] క. వారి.

దివసముఁబోలె శైశవము దీరఁగఁ బ్రాయపురేయి దోఁచినన్
నవకపు మోవిగెంపునఁ గనంబడియె న్నెలసంజవోలె న
క్కువలయపత్రనేత్ర నవకుంతలజాలతమోవిలాసముల్
గపయఁగ దానఁబో మరుని గర్వము దుర్వహమయ్యె నయ్యెడన్. 401

గురుకుచకుంభసంస్థితికిఁగూడె నురంబున నాలవాలముల్
బొరసి కురుల్ ముఖాబ్జమునఁబొడ్మెడు తావికిఁజేరు తేటులై
గరువపుఁజూపు లోరసిలఁగన్నుల క్రేవకు సిగ్గెదుర్వ నా
వరనృప [1]కన్యయం దభినవంబుగ జవ్వన [2]మంకురింపఁగన్. 402

కూఁకటి వేణితోఁ గురులుకూడక మున్న కుచప్రరోహముల్
పోకలతోడి సామ్యమును బొందక మున్న నితంబసీమకున్
వ్రేఁకదనంబొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁడ
జ్ఞాఁకులఁ బెట్టెఁ దా నరవనామెత బాలికకై విటావళిన్. 403

విరివియకాని పై పొడపు వెల్వడకుండెడు పూఁపచన్నులన్
నరవియ కాని దంతరుచిఁ జాలని సన్నపు ముత్తరంగలన్
తరళవిధంబకాని నిశితత్వమెఱుంగని క్రొత్త చూపులన్
సరసిజనేత్ర పొల్పెసఁగె శైశవయౌవనసంధిఁజూడఁగన్. 404

విస్తారవిలసన ప్రస్తావనలు దోఁచె
సరవిఁగటిప్రదేశములయందుఁ
గ్రమముతోఁదలలెత్తె గడకంటి చూపుల
యందుఁ గౌటిల్య పూర్వాంకురములు
సరసవైదగ్ధ్యరసాయనోదయమునఁ
బలుకులొయ్యొయ్యనఁబదను కొనియె
నురముపై చక్కి పయోధరంబులు చేసె
లాలితోత్సేదకోలాహలములు

గీ. నవయవంబులు గైసేత లభిలషించెఁ
జెవులు సంభోగవార్తల చెలువు మరిగె
జనవరాత్మకసుతకును శైశవంబు
వీడి క్రొత్తఁగఁ బ్రాయంబు గూడునపుడు 405

---

402 – [1] క. కన్ని, చ. కన్నె ; [2] ట. మంకురించినన్.

చ. గవగొని నిల్చి పేరనఁటికంబములయ్యె మృదూరుకాండముల్
కువలయతోరణావళినిగుంభసమయ్యెఁ గటాక్షవిభ్రమం
బవిరళపూర్ణ[1]కుంభయుగమయ్యె విరాజదురోజయుగ్మ మ
య్యవనిపకన్యయందు నవయౌవనలక్ష్మిసమాగమంబునన్. 406

సీ. ప్రథమహాలాహలప్రథమానకీలలై
[1]యెగసెఁ గ్రూరకటాక్షవీక్షణములు
దరహాసచంద్రికాంకురములు దలలెత్తె
నుదితేందుబింబమై యొప్పె మొగము
సమసమున్మగ్నవాసవకుంభి వరకుంభ
యుగ్మమై కుచకుంభయుగళి దోఁచెఁ
బ్రకటసుధాపూర్ణరత్నకుండికయయ్యె
[2]నరుణాభమై మధురాధరంబు

తే.గీ. విశ్వమోహనలీల నావిర్భవించె
మదనజగదేక[3]పూర్ణసామ్రాజ్య లక్ష్మి
[4]నతిపయోనిధియై యున్న శైశవంబు
మహితయౌవనమంథానమథితమైన. 407

చ. ఉరుతపవజ్రకర్కశతయుం గుధరోన్నతియుం గుచంబులన్
సరసిజ[1]సంవికాసమును జంద్రవిలాసము నెమ్మొగంబునం
గరికరలక్ష్మియుం గదళికాతరువిస్ఫురణంబు నూరులన్
బొరయుట చిత్రమయ్యె నృపపుత్త్రిక కా యెలజవ్వనంబునన్. 408

ఉ. కన్నులఁ జంచలత్వమును గ్రౌర్య మపాంగవిలోకనంబులన్
జన్నులఁ గర్కశత్వము గృశత్వము గౌనున మంద[1]యానమున్
నెన్నుడ వక్రతంగురుల నెక్కొనఁజేసియు నెట్టి చిత్రమో
కన్నియ జవ్వనంబు త్రిజగజ్జనసన్నుతమయ్యె నయ్యెడన్. 409

చ. కమలము మోమునందు నొకకన్నుల మాత్రముఁబోల దన్నచోఁ
గమలవిరోధియందు నొక గండతలంబునుబోలఁ డన్నచోఁ
గమలముఁ జందురుండు సరిగారని వేఱ గణింప నేటికిన్
రమణి [1]ధృతస్మితేక్షణతరంగితమోహనమైన వక్త్రమున్. 410

---

406 — [1] క. నాభి.
407 — [1] ట. వీఁగె; [2] క. నరుణమయిననమ్మధు, చ. నరుణమైమధు; [3] ట. పూజ్య;
[4] క. నపవ.
408 — [1] ట. సవ్వికాసమును.
409 — [1] ట. భాగ్య.
410 — [1] చ. తృపస్మితేక్షణ, ట. తతస్మితేక్షణ.

చ. తపళగతిద్యుతిచ్ఛటలఁదమ్మికొలంకులుసేయు [1]దిక్కులం
గురియు కటాక్షపాతముల గోగణముల్ మదనాస్త్రవర్షముల్
గరువపుఁజూపులంగొలుపు కారుమెఱుంగులు మింటసాటియే
తరుణి[2]విలోచనమ్ములకుఁ దమ్ములుసమ్ములుఁ గ్రొమ్మెఱుంగులున్. 411

తే.గీ. ఒత్తికొనివచ్చు కటికుచో [1]ద్వృత్తిఁజూచి
తరుణి తనుమధ్య మెచటికో [2]దాగిపోయె
నుండెనేనియు[3]గనుపట్టకున్నె యహహ
యుద్ధతుల [4]మధ్యఁ బేదల కుండదరమె. 412

సీ. అవనిపైనుండుగా కనఁటి కంబములెట్టు
లనఁటి కంబములపై నవని నిలిచె
గగనంబు గిరులపైఁ గనుపట్టుఁగా కెట్లు
గగనంబుపై గిరుల్ గానఁ[1]బడియె
జలధరంబులమీఁద శశియుండుఁగా కెట్లు
శశిమీఁదనున్నది జలధరంబు
నాళంబుపైఁగాక నళినకోశంబెట్లు
నళినకోశంబుపై నాళమున్న

తే.గీ. [2]నకట జనులకుఁగడు విస్మయంబు గొలుపు
దొడలుఁగటిమండలంబును నడుముఁజన్ను
లాననముఁ గొప్పు నాభియు నారు [3]నలరె
[4]నవ్వర విమలాంగి నవయౌవనాగమమున. 413

ఉ. త్రాసునఁ దూఁపవచ్చు ముఖతామరసంబును నిండుఁజందురున్
వాసి యెఱుంగరాదు మగ[1]వాలుగ మీలకుఁ గన్నుదోయికిన్
వీసము[2]దప్పులేదు నెఱివేనలికిం జిరుతేఁటిదాంట్లకున్
దోసముగాదె[3] యానుదతితో [4]నొకతొయ్యలి నీడుచేసినన్. 414

చ. కనుఁగొను చోటులెల్ల విరికల్వకొలంకులు మెత్తమెత్తనం
జనుతెరువెల్ల గెంజిగురుసెజ్జలు పేశలమైన సూక్తిఁ జెం
దిన యెడలెల్లఁ గ్రొంజెఱకుఁ దేనియసోనలు నిక్కమింత య
వ్వనిత భుజాలతల్ పొలయువంకలనెల్లఁ బసిండి బచ్చెనల్. 415

---

411 — [1] క. రిక్కలం ; [2] ట. విలోకనమ్ములకు.
412 — [1] క. ద్వృత్తి, చ. ద్వృత్తి ; [2] ట. తలఁగి ; [3] ట. గనఁబడ ; [4] క.చ. నడుమ.
413 — [1] ట. నయ్యె ; [2] ట. దనుచుఁజూపఱులకు ; [3] ట. నలర ; [4] చ. నలరె.
414 — [1] ట. వాలిక ; [2] క. దప్పు ; [3] ట. యయ్యతిన ; [4] చ.ట. నొరు.

సీ. వెడవిల్తు చిగురాకు గొడుగులు గొనివచ్చి
చరణద్వయంబుగా నవదరించి
సంకల్ప సంభవు జయకాహళులు దెచ్చి
జంఘ[1]యుగ్మంబుగా సంఘటించి
దుగ్ధాబ్ధిమనుమని తూణీరములు దెచ్చి
యూరుయుగంబుగా నుపచరించి
శ్రీదేవి[2] సుతుహేమ సింహాసనముఁదెచ్చి
జఘనచక్రంబుగా నంతరించి

తే.గీ. నీరరుహసూతి శేషాంగనిర్మితికిని
దగిన[3]యదిలేక కనకపత్రమున నివటఁ
గడమ గలదని వ్రాయ లేఖ[4]యును [5]నిలుప
మధ్యమును నారు నయ్యె నమ్మానవతికి. 416

సీ. ప్రసవాస్త్రు మాయావి బయలవ్రాసిన [1]సుడి
బిసరుహాననకు గంభీరనాభి
మోహనచూర్ణంబు మొనసిన బంగారు
[2]బరణు లుత్పలగంధి గురుకుచములు
యౌవనామరభూరుహమున డిగ్గిన యూడ
లరవింద వదనకుఁగరయుగంబు
సౌందర్యలహరిలో సంభవించిన పాంచ
జన్యంబు మీనలోచనగళంబు

తే.గీ. వదనమను తామ్రపర్ణిఁ జెల్వంబులైన
విశదమౌక్తికములు లేమ దశన[3]కిర్తి
శంబరారాతి సామ్రాజ్యసౌఖ్యపదవి
యలికులాలక కెంజిగురాకుఁ బెదవి 417

ఉ. మారుని మోహనాస్త్రము సమస్తవిలాసవిహారభూమి శృం
గారరసంబు తేటతొలుకారుమెఱుంగుల పుట్టినిల్లు సం
సారసుఖంబు లేమొలక చక్కదనంబుల ప్రోవు కాక బం
గారపు బొమ్మ యాతరుణి కన్నులపండువు చూచువారికిన్. 418

---

416 - [1] చ.ట. యుగంబు; [2] ట. బలు; [3] ట. యవి; [4] ట. యని; [5] చ. నిలిపి. ట. నిలుపు.

417 - [1] క. నుడి; [2] ట. బరిణ; [3] ట. పంక్తి.

. దీపితకనకనందేహంబు దేహంబు
పచ్చకర్పూరంపుఁ బలుకు పలుకు
పల్లవసంపదాస్పదములు పదములు
శోభితావర్తన నాభినాభి
కుంఠితకలకంఠకంఠంబు కంఠంబు
ముకురవిశంబాభిముఖము ముఖము
సరసిజవైభవాకరములు కరములు
విజితనీలోరగవేణి వేణి

.గీ. నడుములేమికి నెప్పుడు నట్టనడుము
లోచనంబులు కర్ణాంతలోచనములు
పణఁతి చనుదోయి జక్కవ పక్షిదోయి
యగుట నిక్కంబునా నొప్పు నబ్జవదన. 419

. పలుమఱుఁ గ్రొమ్మెఱుంగులనుబట్టి కరంచి పసిండి నీరునం
దొలఁచి దొలంచి వెన్నెలలఁ[1] దోఁగిన చేతుల తీవెయింటిలో
నలరులగద్దె మీఁదఁ గుసుమాస్త్రవసంతులు దోడుగా రతిం
దలఁచి యొనర్పఁగా వలయుఁ దామరసాననుఁడిత్తలోదరిన్. 420

. రమణి చన్నులతోడ రాసి రథాంగముల్
రాజుచిత్తమునకు రాక దొలఁగె
నంగనముఖముతో నంతరం బెఱుఁగక
పోరి రాజీవ మప్పుల ముడింగె
లోలలోచనతోడి లోచన స్పర్థను
బొలుపారి మృగములు పూరి గఱచె
కలికి పెన్నెఱిఁజూచి కప్పెల్లఁ గోల్పోయి
తుమ్మెద తండంబు[1] తొవలుబట్టె

.గీ. నాతినడపున బెడఁగార నడవలేక
దంతులెనిమిదియును దిగంతముల నొదిగె
నితర వనితల నుపమింప నెట్లువచ్చుఁ
బొలఁతి తనుదానె[2] పోలినఁబోలుగాక. 421

---

420 - [1] ట. దోఁచుచు సంపెఁగ.
421 - [1] క. దోవ; [2] క. గోరిన.

ఉ. నవ్వక నవ్వునట్టి వదనంబును నించుక బిగ్గ నవ్వినం
గ్రొవ్వెడినట్టి నెన్నడుము తీవెయుఁ దామరనూలు సందునం
దివ్వగరాని చన్నులును దీప్తములై తళుకొత్తు చూపులం
గ్రొవ్విన కన్నులుం గలుగు కోమలికి న్సరిలేరుభూవరా! 422

సీ. కురులు కప్పు దనర్చి యిరులు గ్రమ్మకయున్నె
నగవు వెన్నెల[1]మీఁద నెగడెఁగాక
చన్నుజక్కవదోయి మిన్నుఁబ్రాకకయున్నె
పయ్యెదవల[2]ల్డ్డ పడియెఁగాక
కనుగండు[3]మీల్ దలకడచిపోవకయున్నె
చెవులను కొలకులఁ జిక్కెఁగాక
యాననాంబుజముపై నలులు పైకొనకున్నె
మేను సంపెఁగ తావిఁ బూనెఁగాక

తే.గీ. యొప్పు కనుచాటు దాఁకకయున్నె రత్న
భూషణద్యుతు లొక్కటఁ బొదివెఁగాక
తలఁప నచ్చెరువైన యుత్తరళనయన
యవయవశ్రీల లీల లేమని నుతింతు. 423

ఉ. కన్నులతీరుఁ జక్కని మొగంబు మెఱుంగులఁ జౌకళించు లేఁ
జన్నులమించు నెన్నడుము నంశయరేఖయు మేనియందముం
బెన్నెఱివేణి సొంపు కటిపెంపును దిన్నని మోవికెంపులున్
వన్నెలుగాని కావు రవణంబులు వన్నియ లా లతాంగికిన్. 424

ఉ. [1]చిత్తరువున్ లిఖించి మఱి జీవముఁబోసెనొ రూపసంపదన్
చిత్తమునం దలంచియె సృజించెనొ రెండును జర్చ [సే]యఁగాఁ
జిత్తరువందు నాకరణి చెల్వముగల్గ దనన్యచిత్తుఁడై
చిత్తమునం దలంచియె సృజించెఁ బితామహుఁడా తలోదరిన్. 425

క. సురగరుడఖచరవిద్యా
ధరకిన్నరపన్నగాదితరుణీమణులున్
సరిగా రత్నన్వంగికి
వరసుందరరూపరేఖవై భవగరిమన్. 426

---

423 – [1] ట. మించునెగడి ; [2] ట. యఠ ; [3] ట. మీలువే.
425 – [1] ట. చిత్తరువుల్.

అ వాలుంగనుదోయి యూ నగుమొగం బా గుబ్బపాలిండ్ల పెం
పా వేణీరుచి యూ తనూవిలసనం బా యొప్పు నేఁజెప్పి నం
గై వారంబగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁగూడ నా
హా పుట్టింపఁడె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్. 427

.గీ. ఇట్టి కీర్తిప్రతాపంబు లిట్టి ఘనత
యిట్టి విభవంబుగల్గి నీ వినకులేశ
యవ్వధూమణి వరియింపవైతివేని
నీదు చక్కదనంబెల్ల నిష్ఫలంబు 428

వ. అని చెప్పినారద మునీంద్రుండు [1]చనిన తదనంతరంబ 429

మనుజపతి కమ్మునీంద్రుని మాటలెల్లఁ
గోర్కెమీఱంగ నమృతంపు ఘుటికలైన
నిభ[1]గమన నుస్వయంపరవిభవమునకుఁ
బోవ సమకట్టి కలకల స్ఫూర్తి[2]వెలయ. 430

మురువైన చక్కని మొగముట్టు నవరించి
నవరత్నమయఖలీనం బొనర్చి
పచ్చ సూర్యపుటంపుఁ [1]బల్లంబు ఘటియించి
బిరుదు తలాటంబు నిరవుగొల్పి
చికిలిచౌకాటంపు పికిలికుచ్చు లమర్చి
యపరంజి పక్కెర లలవరించి
నమకట్ల జల్లులు నమకూర్చి యిమువంక
[2]గౌరక సింగిణిపాది గూర్చి కట్టి

.గీ. పంచకము రొమ్ము విరివియై పరిఢవిల్ల
మోడి శిరసెత్తడము గల్గు మొయిలులోని
జలము దేసోపు పాదరసంబు వంటి
యుత్తమాశ్వము సాహిణి యొకడు నిలుప. 431

వ. అంతట రాజేశ్వరుండు మణిమయ[1]భూషణంబులు ధరించి. 432

---

429 – [1] ట. వివాహగమనంబునకుంబురి కొల్పిన.
430 – [1] క గమనను ; [2] ట. మెఱయ.
431 – [1] క. పల్లవంబు ; [2] ట. గౌర.
432 – [1] ట. భూషణాంబరంబులు.

సీ. పన్నీటిచేఁ గదంబపుఁదావి మించిన
మంచి కస్తూరి నామంబుఁ దీర్చి
పైఠాణి హురుమంజి పసుల [1]జిల్లర చట్ట
పై పైడిఁవ్రాఁత దుప్పటి ధరించి
యాడాపు నీలాల తోడ జోడగు పాల
కాయులొంటులు నీటుగా నమర్చి
కళుకు వఁజ్రముల చెక్కడపుఁజొక్కపుఁగెంపు
నెఱతాళి యరచట్ట పారను వైచి
తే.గీ. సూర్యపుటమున బంగారు సొగసు పసుల
రాయ మేలి కుమార కుళ్లాయిఁబూని
[2]మెల్ల నపరంజి పావాలు మెట్టి యపుడు
రాజకులమౌళి యంతఃపురమ్ము[3] వెడలి. 433

ఉ. పచ్చల రచ్చలుం జలువపందిరులుం దెలిసన్నునన్నపున్
గచ్చుమెఱుంగుగోడలు చొకాటపుఁగూటములుం బరంగిమేల్
మచ్చులు జాళువాపసిఁడి [1]మాడువులు న్నెలరాల [2]సెజ్జ యిల్
[3]నచ్చికతోడఁ గన్గొనుచు నా నృపశేఖరుఁ డంతట వేడుకన్. 434

వ. అంతట సాహిణి యశ్వంబుగొని [1]తెచ్చిన. 435

క. తెచ్చినఁగనుఁగొని తేజియు
నిచ్చలరఁగ ద్రొక్కి యెక్కి యిరుచక్కియలన్
నిచ్చ[1]గల మదపు టేన్గులు
మచ్చిక తుండములు సాఁచి[2]మైని నివురుచున్. 436

సీ. రాగావధాన పరాకు హెచ్చరికంచు
వేత్రహస్తులు సారె విన్నవింప
గడిమన్ని యసిధార గాంభీర్యపాథోధి
యని వంద్యగణము పద్యములు చదువ
పాండ్యకేరళమహీపాలవర్యకుమార
వర్గంబు పసవుపావడలు వీవ
సింగంపుఁగొదమలభంగి క్రేళ్లుఱుకుచు
బలసి ముందర వీరభటులు నడవ

433 — [1] క. జల్లర ; [2] ట. మేలి ; [3] ట. వెడలె.
434 — [1] క. మాడలు నున్నెల ; [2] క. సెజ్జలున్ ; [3] క. మచ్చిక.
435 — [1] ట. తేర.
436 — [1] క. లుగల మద సేనలు ; చ. గలమదసేనలు, క.చ. మై మైనివురుచున్;
[2] ట. మైనివురంగన్.

తే.గీ. నిడివి వెంబు  జోదన నిబ్బరంబు
*  *
మెఱయ రయమున స్వామిణి మేలుతేజి
గొరిజలో నెక్కి చూడ్కొడు కొనుచు నగర
రాజమార్గంబు వెడలె నా రాజమౌళి. 437

చ. కదలికఁజేసి నూఁకి తిరుగ న్మరలించి కెరల్చి వాగె చే
వదలి యదల్చి ధే యనిన వాజి జవంబున కించుమించుగాఁ
గదలిన యా నృపాలకుని కన్గొన కార్వులు నింగి ముట్టఁగా
నదె యిదె వాఁడె [ వీఁడె ] పదఁడంచును మూకలు గూడిరయ్యెడన్. 438

వ. కతిపయప్రయాణంబుల పాండ్యభూమండలంబు గడచి,
చిత్రసేనపాలితంబగు విచిత్రనామనగరంబు ప్రవేశించె నటకు మున్నె. 439

సీ. పాంచాలకేకయబర్బరసౌవీర
బంగాళచోళనేపాళగౌళ
గాంధారకోంకణకాంబోజకాశ్మీర
హైహయాభీరబాహ్లకవిదేహ
మగధమద్రవిదర్భమాళవకేరళా
శ్మంతకకుంతలమత్స్యవత్స
కరహాటమరహాటకర్ణాటశకలాట
కుకురకోసలకాశకురుకరూశ

తే.గీ. సుంహ్మ సౌరాష్ట్ర గుజరాష్ట్ర శూరసేన
యవనబహుధానబర్బర[ కా ]ంగవంగ
*  *  *
తేంకణాంధ్రకళింగాదిదేశపతులు. 440

శా. రాజప్రేరిత దూత లేఁగి పిలువన్ రంగచ్ఛతాంగావళీ
వాజిస్తోమమదేభయోధసుభటవ్రాతంబు సేవింప సే
నాజాలంబుల చిందముల్మొరయ నానాదేశవర్తు ల్మహా
రాజు ల్వచ్చిరి పాండ్యజాపరిణయారంభంబు వీక్షింపఁగన్. 441

మ. నరనాథుం డెదురేఁగి తోడుకొని రా నానాభటశ్రేణి తోఁ
బురముంజొచ్చి తదీయమందిరమునం బూజావిధుల్ గాంచి త
త్పరిచారు ల్విడియింపఁగా విడిసి రత్యంతప్రభావంబునన్
ధరణీపాలురు తత్పురీపరిసరోద్యానోపకంఠంబులన్. 442

---

440 – క. చ. లలో తేటగీతి మూడవపాదము లేదు.
441 – [1] క. పాండ్యరీ : చ. పాండ్యరి.

క. నరనాథుని శాసనమునఁ
బురిలోఁ జాటించి రాజపురుషులు మెచ్చన్
బురిఁ గ్రైసేసిరి పౌరులు
స్ఫురితాంబరహేమరత్నభూషణతతులన్. 443

సీ. దేవగేహముల భూదేవసద్మములను
సామంతసచివుల ధామములను
పార్థివశుద్ధాంతభవనసీమల సభా
మంటపంబుల నాట్యమందిరములఁ
బ్రాసాదగోపురప్రాకారముల నశ్వ
కుంజరశాలల గోష్ఠకముల
రచ్చకొట్టముల వారస్త్రీల గృహములఁ
జేటచేటీకుటీపాటనముల

తే.గీ. విపణివీథుల పుష్పలావికల సరణి
[1]దక్షకారకసదన పద్ధతుల తంతు
వాయపల్లవపాఠకవందిమగధ
గాయకాగారమార్గశృంగాటకముల. 444

సీ. కమనీయకదళికాకాండకోరుస్తంభ
నవ్యపుండ్రేక్షుదండములఁ బెనిచె
మకుటతోరణముల మకరతోరణములఁ
దోరంపు దర్పణతోరణములఁ
దప్తకాంచనమయధామతోరణముల
[1]హీరమౌక్తికహారతోరణములఁ
బరమపావనతరుప్రసవపల్లవగుచ్ఛ
తోరణంబులఁ దెల్లతోరణముల

తే.గీ. నందముగఁ [2]గట్ట లలితచిత్రాంశుకముల
కలువడంబుల నిర్మించి గగనభాగ
మెడపడకయుండ బిరుదుల పడగలెత్తి
జమిలి జిల్లెళ్ల నమకట్లు నంతరించి. 445

444 — [1] క. రక్షణ.
445 — [1] క. గార, చ. దార ; [2] చ. గట్టి, ట. బట్ట.

తే.గీ. చెలువు దళుకొత్తఁ జప్పరంబులు రచించి
యందుఁ బూదండలును రత్నహారములును
బక్వఫలదామములు గానఁబడ నమర్చి
కలయఁ బట్టాంబరముల మేల్కట్లు గట్టి. 446

సీ. గంధంబు పన్నీరు గలపి ముంగిళ్లను
బెల్లుగాఁ గలయంపి జల్లువారు
కుంకుమ జవ్వాది కూర్చి కుడ్యములను
బుడిసెలి పూఁతగాఁ బూయువారు
మృగనాభిపంకంబు మెఱుగు వేదికలను
దిన్నగా మ్రోఁకలు దీర్చువారు
ఘనసారతటమున కడు విచిత్రంబులు
వృట్ట మ్రుగ్గులు నిండఁ బెట్టువారు

తే.గీ. విమలసంఫుల్లకైరవవిదళనముల
ప్రసవపుష్పోపహారముల్ రమణఁ జేయు
వారునై యొప్పి రెంతయు వరుసఁ బౌర
తతి సమున్నతి నిల్లిల్లు దప్పకుండ. 447

క. అందఱు దివ్యాంబరములు
నందఱు మణిభూషణముల నతిమోదముతో
నందఱు బహుపరిమళముల
నందఱుఁ గుసుమములఁ దనరి రయ్యెడఁ బౌరుల్. 448

సీ. [1]వర్ధనమాలికావరరత్నదీధితు
లైంద్రచాపశ్రీల నావహింప
సౌధాగ్రవినిహితస్వర్ణకుంభద్యుతి
విద్యుల్లతాలక్ష్మి విస్తరిల్ల
సరససంగీతాదిమురజరవంబులు
ఘనగర్జితస్ఫూర్తి ననుకరింప
వరచంద్రశాలాగ్రవాసనాధూపముల్
జలదసౌభాగ్యంబు నవదరింప

తే.గీ. వలభిపర్యంతలంబితలలితహార
వల్లరులు వర్షధారల వలను మెఱయ
వెలయఁ గైసేసియున్న యవ్వీటి విభవ
మంబుదాగమరమణీయకంబుఁ బెనచె. 449

449 — 1 ట. వందన.

తే.గీ. [1]రాజవంశజుఁడై యుండి రానివాఁడు
కాముబాణంబులకు గుఱిగానివాఁడు
సప్తసాగరమధ్యభూచక్రమునను
నృపకుమారుండు లేఁడు పన్నిదమునకును. 450

తే.గీ. తిలలు పైనెత్తి చల్లిన దిగువఁబడని
యంత సందడి పెంద్రోవలందుఁ గలిగె
నఖిలదేశంబులందున్న యవనిపతులు
వైభవాలోకనమునకు వచ్చు[1]నపుడు. 451

వ. అంతట నా రాజతనయ. 452

సీ. పట్టంగఁ బనలేని పలుచని లేఁగౌను
బిగువజన్నుల వ్రేఁక [1]బెడసియాడఁ
గెలసి తెప్పల [2]క్రేవఁ గ్రేళ్లువారుచునున్న
క్రొవ్వాడి చూపులు గూర్మిఁ దెలుపఁ
దీర్చిన కస్తూరితిలకంబుపై వ్రాలి
కృష్ణాలకంబులు గేలిసల్పఁ
గనకకర్ణోత్తంసకాంతులు దలకొని
చెక్కుటద్దములకుఁ జెల్వు నేర్ప

తే.గీ. [3]మెఱుఁగుఁ జిఱునవ్వు పూరమ్ము మెఱుగువోలె
మొగలిరేకుల గ్రొమ్ముడి మురిపెమొప్ప
గున్న రాయంచ కైవడి గునిసి గునిసి
మగువ యేతెంచె నాసభామధ్యమునకు. 453

సీ. దవ్వుదవ్వులఁ గనుల్ [1]దనివోవఁగాఁ జూచి
పరమాద్భుతం బాత్మఁ బాదుకొల్ప
సకలాంగకంబులు [2]జాదుకోఁ బులకించి
చేయొకించుక యెత్తి చిత్తమిడిచి
కదియ నాసా[3]శిఖాగ్రమునఁ దర్జని మోపి
మూర్ధంబు [4]గంపితంబుగ నొనర్చి
కడతెప్ప లొలయంగఁ గనుదమ్ము లరమోడ్చి
బొమదోయి యొక్కింత పొడవుచేసి

450 — [1] క. రవివంశుఁడై, చ. రవంశుఁడై.
451 — [1] ట. చుండ.
453 — [1] ట. మెగని; [2] క. క్రీడ, ట. క్రింద; [3] క. మెఱుగువు.

లలనసౌందర్యరేఖావిలాసమునకు
నిచ్చ మెచ్చని రాజొక్కఁడేని సరిది
యమ్మహాస్థానమున నున్న యఖిలవార్ధి
వలయితాశేషమేది నీశ్వరులయందు. 454

వనిత పాదములు ప్రవాళంబులై మించుఁ
          గటి యచలాభోగకలనఁ దనరుఁ
బడతి [1]గుబ్బలుమీఱు భద్రకుంభనిరూఢి
          వదన మబ్జఖ్యాతి వదల [2]కొనరు
కలికి చెక్కులు చంద్రఖండంబులై పొల్చుఁ
          గన్నులు రాజీవ గణనఁ గాంచు
వెలఁది వేనలి నీలవిషధరంబై తోఁచు
          దనువెల్ల కాంచనంబనఁగ నెసఁగు

పవడ మిగురాకు నిలచుట్టు వనటులు కరి
కుంభములు తమ్మి నెలనెలకూన కపుర
పుబ్జములు మీలు మొగులు కాలాహి పసిఁడి
సంపెఁగలఁ [3]బెంచి నలువ నిర్మింపఁబోలు 455

కలువలనేలు కన్నుగవ కారుమెఱుంగులఁబోలునంగముల్
చిలువలనవ్వు కీలుజడ చందముఁ గేరుగళంబు క్రపుం
జలుసలు గుల్కు నుంబలుకుచక్కెరరానునుమోవి దీనికిన్
విలువలుసేయఁగాఁ దరమె విశ్వధరాతలమెల్ల నిచ్చినన్ 456

కరికుంభంబుల మీఱి జక్కవలజోకల్ మించి నీరేజభా
సుర[1]కుట్మలంబుల నవ్వి హేమకలశస్ఫూర్తు ల్నివారించి బం
ధురసూనస్తబకంబులం దెగడి తోడ్తో[2]నిక్కెఁగ్రిక్కించి ని
ర్భరవక్షోజయుగంబు చూడఁదగు నీ పంకేజపత్రాక్షికిన్ 457

నెఱిగల మన్మథాస్త్రముల నిద్దపుఁజుక్కల సోగకారు క్రొ
మ్మెఱుఁగుల గల్వడంబులను మేలిచకోరకురంగరాజి త
త్తఱపడు గండుమీల వెలి దామరరేకుల మించి తేటలై
తెఱవకుఁజూడ నొప్పెఁ గడుదీర్ఘములై తెలుపారి నేత్రముల్ 458

---

**454** — [1] ట. దనవి; [2] క. జోదుగా; [3] క. నిభా; [4] క. చ. కంపముగఁజేసి.
**455** — [1] ల. కబ్బలు; [2] క. కొనకు, ట. కొనదు; [3] క. చ. బెనచి.
**457** — [1] క. కూటంబుల; [2] క. నేకికిరివి(?), చ. నికిరిసి.

క. మరుఁ డీబాలారత్నము
సరసవయోనవ్యరూపసౌభాగ్యరమా
శరముల లోకములన్నియు
నురువిక్రమశక్తి గెలువకున్నె యింకన్ 459

తే.గీ. కనరి లోకత్రయంబు నొక్కట జయింపఁ
జేరి సమయోచితముగ గైసేసినపుడు
సూనబాణాసనుండు నీడఁ జూడకున్నె
తరుణి[1]నిద్దంపుఁ జెక్కుటద్దములయందు 460

తే.గీ. చిగురుఁబోణిభ్రూవల్లరి చిత్రరేఖ
యింతి నాస తిలోత్తమ యింతనిజము
చెలువ యూరుకాండద్వయీసృష్టి రంభ
మానినీమణి మధురోక్తి మంజుఘోష 461

సీ. గంధవారణకుంభగౌరవస్ఫురణంబు
కనకకుంభములకుఁ గలిగెనేని
లికుచకోమలకాంతిలీలావిశేషంబు
చక్రవాకములందు జరిగెనేని
మాలూరుసౌభాగ్యమహిమానుభావంబు
దాడిమీఫలములఁ దగిలెనేని
[1]నవకలోన్మీలితప్రసవగుచ్ఛచ్ఛాయ
యబ్జకోరకముల కబ్బెనేని

తే.గీ. గాక సరిఁజేయఁగారాదు [2]కానిదాని
హారనిర్ఝరసలిలధారా[3]వతార
కాంచనాచలశృంగభాగంబులగుచు
రాజితములైన దీని వక్షోజములకు 462

తే.గీ. ప్రబలవక్షోజహేమకుంభములు నూచి
లలితరోమావళీరజ్జుల[1]తికఁ జూచి
నాభికూపంబుఁ జూచి నా నయనయుగము
తృప్తివహియింపుచున్నది దీనియందు 463

---

460 — [1] క. నద్దంపు.
462 — [1] ట. నవకనోన్మీలిత ; [2] ట. వాని ; [3] ట. ధౌత.
463 — [1] క. రేఖ.

అలి[1]నీలవేణిగా దరిది మామిడిపండు
పండుగాదపరంజి పసిఁడిమొలక
మొలకగా దొయ్యారిముద్దుచక్కెరబొమ్మ
బొమ్మగా దమృతసంపూర్ణఘుటిక
ఘుటికగా దొనపరిగుజ్జువెన్నెల సోగ
సోగగా దచ్చకస్తూరితావి
తావిగా దొడికంబు దొల్చు రత్నపురంగు
రంగుగా దదియు సామ్రాజ్యలక్ష్మి

సీ. లక్ష్మిగాదు విలా[2]సలీలలకు మీటు
మీటుగాదు మిటారి క్రొమ్మించుతేట
తేటగాదు మెఱుంగు[3] ముత్తెములసరము
సరముగాదు త్రిలోకయోషాలలాము 464

కమ్మక్రొవ్విరి బంతి కాఁబోలు నీయింతి
కా దపరంజిబంగరు శలాక
కలికిచక్కెరబొమ్మ కాఁబోలు నీకొమ్మ
కాదు భారతి ముద్దుగఱపుచిలుక
కందర్పుతరవారిఁ గాబోలు నీ నారి
కాదు శోభాకల్పకల్పలతిక
ఘనరత్నమయపేటి కాఁబోలు నీ బోఁటి
కా దమృతంపు శృంగారసరసి

సీ. [1]యఖల గాఁబోలు నీ లేమ యంచలేమ
కాదు నిల్కడఁగొన్న క్రొక్కాఱుమెఱుఁగు
భావరసకోటి కాఁబోలు నీ వధూటి
కాదు మెలగంగనేర్చు చెంగలువదండ 465

వ. అని తమ మనంబులఁ దలంచు నవసరంబున. 466

చందనగంధులిద్దరు లసన్మణికాంచనదండచామర
స్పందనమాచరింప [1]నడపం బొకపంకజనేత్ర పట్టఁగా
నిందునిభాననామణు లనేకులు గొల్వఁగ జారులీలతో
నందలమెక్కి వేడ్కఁగమలాననఁ జూచుచు వచ్చె[2]రాజులున్. 467

---

464 – [1] ట. కుల ; [2] ట. సంపులతల ; [3] క. ముత్తెములసరము.
465 – [1] ట. యంచ.
467 – [1] క. నడిదఁ ; [2] చ. ట. రాజులన్.

వ. అప్పుడు ప్రౌఢాంగనలు సకలవసుంధరాధిపతుల గ్రామనామంబులతో జతఁజెప్పునప్పుడు. 468

క. వ్రీడావతి యీ భూపతి
గౌడబి తౌఁజుండు వీఁడు కమనీయరతి
క్రీడారహస్యకోవిద
చూడామణి తెప్పలెత్తి చూడుము వీనిన్ 469

సీ. కర్ణాటపతి వీఁడు కర్ణాయతేక్షణ
పాంచాలపతి వీఁడు పద్మవదన
కరహాటపతి వీఁడు గంధేభనిభయాన
ఘూర్జరపతి వీఁడు కోమలాంగి
కుంతలపతి వీఁడు కుటిలనీలాలక
సౌవీరపతి వీఁడు సరసిజాక్షి
సింధుభూపతి వీఁడు బంధుచింతామణి
కాంభోజపతి వీఁడు కంబుకంఠి

తే.గీ. కోసలేశ్వరుఁ[1]డీతండు కుసుమగంధి
వత్సపతి యాతఁ డాతఁ డవంతివిభుఁడు
సింహళుం[2]డాతఁ డీతండు చేదివిభుఁడు
చూడు నరపాలకుల బాలసుభగలీల 470

సీ. మాళవనేపాళమత్స్యభూపాలురు
వీరె వీరలఁ జూడు విద్రుమోష్ఠి
కొంకణకురుభోటకుకురావనీశులు
వారె వారలఁ జూడు వనజగంధి
తెంకణద్రవిడవిదేహబర్బరపతుల్
వారె కనుఁగొను మంభోరుహాస్య
యాభీరలాటబంగాళ[1]నాథులు వీరె
వెలువుతేఁ గనుఁగొను మెఱుఁగు బోఁడి

తే.గీ. యంగవంగాంధ్రచోళ[2]పాండ్యత్రిగర్త
కాశికాశ్మీరయవనకేకయవరాట
విభులె యీ యున్నవారలు వీరిలోన
నీకుఁ దగు రాజు వరియింపు నీలవేణి. 471

470 — 1 ట. డాతండు ; 2 ట. డీతఁడాతండు.
471 — 1 క. గాల్వ్యలు, చ. గాల్పులు ; 2 క. చ. కేరళ.

చ. ఇతఁడు దశార్ణభూ[మి]విభుఁడిందునిభానన వైరిధారుణీ
పతు లితఁడన్న శైలవనపార్శ్వములందు వసింతు రెప్పుడున్
రతిపతిభాసమానునుడు రాజయశున్ మృగరాజవిక్రమున్
గుతుక మెలర్పఁగానితని గోరి వరింపుము నీకు [1]నీడగున్. 472

వ. ఇట్లు సఖీజనంబులు [1]వివరించిన 473

ఉ. [1]గుట్టసియాడ గబ్బి చనుగుబ్బలపైఁ బులకాంకురావళుల్
తెట్టువఁ గట్టఁ గోరికలు తేటలు వెట్టఁగ వేడుకల్ మదిం
దొట్టికొనంగ [2]నచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగ నొత్తఁగాఁ
బెట్టిన దండదీయ[3]కలభీతమృగేక్షణ సూచె నాతనిన్. 474

మ. లలనారత్నము కోర్కె పుట్టుటయు నాహ్లాదంబుతోఁ దల్లిదం
డ్రుల కానందముగా వయస్యలకుఁ జూడ్కుల్ చల్లఁగా నాత్మ నా
ప్తుల కుత్సాహము దోఁచగాఁ బెరపతుల్ పొల్పొందగా డాసి నె
చ్చెలి యోలంబున నిల్పఁ దూర్యరవముల్ చెల్వంబులై మ్రోయఁగన్. 475

వ. అంతట 476

తే.గీ. ధారుణీపతి నిద్దంపుఁ బేరురమున
నమరెఁ బ్రతిబింబమును [1]బోలి యలరు దండ
బాహ్యమునఁ గొంతకొంత యభ్యంతరమున
గీలుకొనియున్న మదనుబాణాళిఁ బోలె. 477

ఉ. చక్కెర వింటివాఁ డిదియె నందని కెంజిగురాకు పల్లవున్
జక్కని పచ్చఱెక్క నునుఁ జక్కి చివుక్కున నెక్కియించు వి
ల్లెక్కిడి తేఁటినారి మొరయించుచు సొంపున డాసియేసెఁ బో
చిక్కని వెన్నెలన్ బదను సేసిన కల్వలకోరికోలలన్. 478

సీ. కార్తాంతికులఁ బిల్చి కర్పూర[1]మిశ్రిత
తాంబూల[2]మును ఫలదాన మొసఁగి
జాంబూనదాంబరస్రక్చందనంబులఁ
బూజించి భూపాలపుంగవుండు

---

472 — [1] ట. నింపగున్.
473, 474 — చ. లో లేవు.
473 — [1] ట. పరికొల్ప నొల్లకుండిన ముందటి కాబోనిచ్చి.
474 — [1] క. గుబ్బల; [2] క. నచ్చెలువ; [3] ట. కవి.
476 — చ. లో లేదు.
477 — [1] ట. దాను.

సర్వ²రక్షణకళాసంపూర్ణమై యుద
యాస్తనిర్దోషమై యతిశయిల్లు
శోభనాంశ³ము మీరు శోధించి చెప్పఁడా
యని పల్క వారును నట్టి లగ్న

తే.గీ. మరసి [4]చేపట్టి యాసన్నమయ్యె [5]దేవ
శుభముహూర్తంబు కాలసంశుద్ధి లెస్స
పిలువ[6]నంపుము వేవేగఁ బెండ్లికొడుకు
ననిన[7]నట్లుకా కనుచును నాప్తజనులు. 479

తే.గీ. కువలయాక్షులు ముత్యాల చవికలోన
జలకమార్చిరి నిజకులాచారసరణిఁ
బసిఁడి పీఠంబుపైనుంచి పద్మనయనఁ
జెలువమగు గన్నె రాకమ్మ చేతికిచ్చి. 480

తే.గీ. చెలువ నిర్వృత్త సలిలాభిషేచనయును
జంద్రికాపాండుపరిధానశాలినియును
నగుచు వర్షాశరత్తుల యంతరమున
నొప్పె సంధ్యాదిదేవత కుద్దియగుచు. 481

తే.గీ. నవచతుర్విధశృంగార మవధరించి
యమ్మహాదేవి విప్రపుణ్యాంగనలకు
నారఁగా మన్న మునలిముత్తైదువులకు
మోడ్చుఁ గేలెత్తి ఫాలంబు మోపి మ్రొక్కె. 482

ఉ. అంతర [1]మెట్టిదోయని నిజాస్యముతోఁ బ్రతివెట్టి రోహిణీ
కాంతుఁ బరీక్ష సేయుటకుఁగా నటువచ్చిన భంగి [2]నప్పు డ
య్యింతి ధరించె భూషణములెల్ల వహించి [యంత] మీఁద శు
ద్ధాంతవధూటి యొక్కతె ప్రియంబున నిచ్చిన మించుటద్దమున్. 483

చ. పరిణయమంటపంబున విభాసితమై తనరారుచున్న య
ప్పుర మమరావతీపురముఁ బోలి తదీయవిలాసలక్ష్మి న
చ్చెరువడి తెప్ప వెట్టక విశృంఖలకౌతుకమగ్నచిత్తులై
పారిపారిఁ జూచు మానవులు పోలిరి నిర్జరకోటి నత్తరిన్. 484

---

479 – [1] ట. సమ్మిశ్ర ; [2] ట. దానపూర్వంబుగాఁగ ; [3] క. కల్మిరు, చ. కమీరు ;
[4] ట. దేవట్టి ; [5] క. వేళ ; [6] చ. ట. బంపుము ; [7] ట. నట్లసెకాకంచు.

483 – [1] క. మెద్దిరో, చ. మెద్దిదౌని ; [2] ట. లీల.

చ. పరిణయవేది శాస్త్రములఁ బద్ధతిఁ గట్టి తదంతరంబునన్
వరమణితోరణంబులు నవంబుగ నిల్పి తదీయ కుడ్యకాం
తరములఁ బార్వతీప్రమథనాథవివాహమహోత్సవంబు సా
గరతనయాజనార్దనుల కౌతుకలీలలు వ్రాసిరేర్పడన్. 485

సీ. పవడంపు చేవకంబములు నిర్మలరత్న
పుష్యరాగంబుల బోదియలును
బొలుపొందు మరకతంబులు బారవట్టెలు
మేలినీలంబుల దూలములును
దనరు కట్టాణిముత్యముల వాచూరులు
వజ్రంపు మొగడల వన్నియలును
గోమేధికంబుల గొమరొప్పు కెంపులఁ
బద్మరాగముల సోపానములును

తే.గీ. మెఱయు చిత్రాంబరంబుల మేలుకట్లు
చారుసంపుల్లపుష్పోపహారములును
భాసురామోదమగు పుష్పవాసనలును
మహిమ విలసిల్లెఁ గల్యాణమంటపంబు. 486

వ. కన్యా కుమారులు ప్రవేశించి రప్పుడు 487

తే.గీ. తెఱమఱుంగున [1]నా సుదతీలలామ
సురుచిరాకారవిస్ఫూర్తి చూడనొప్పె
శారదాభ్రంబు మఱగున చారులీల
గరము శోభిల్లు నవచంద్రకళయనంగ 488

చ. వెన ధవళాక్షతల్ వరుఁడు వేడుక దోయిటఁ జాలముంచి యిం
పెసఁగ వధూముఖాంబురుహ మేర్పడఁ దప్పక సూచి మౌళిపై
యొనపరిలీలఁ జల్లె నిగురొత్తుచుఁ గోర్కులు వార్కొనంగ వె
క్కసమగు దేహవల్లిఁ బులకల్ కడుదట్టములై తనర్పఁగన్ 489

చ. నళినదళాయతాక్షి మది నాన దొలంకఁగఁ బ్రాలు దోయిటం
జెలువుగ నెంచి వల్లభునిఁజేరి ముదంబునఁ జల్లె మౌళిపై
వళు లనయంబుఁజన్నుగవయున్ [మెడయున్] గరమూలదీధితుల్
నెలకొని కన్నుదమ్ములకు నిండిన వేడుక విందుసేయఁగన్ 490

486, 487, 488, 489 – చ. లో లేవు.
488 – [1] ట. వర.

క. శృంగారంబుల కెల్లను
శృంగారం బనఁగ వెలయు చేడియకుఁ దగన్
మంగళకరమగు నూతన
మంగళసూత్రంబు గట్టె మహిపతి వేడ్కన్ 49

తరల. గురుకుచంబుల హారవల్లులు గుస్తరింపఁగ వింతలై
గురులు ఫాలమునందుఁ దూలఁగఁ గోరి వేడుకతో వధూ
వరులు మస్తములందు సేసలు వన్నెమీఱఁగఁ జల్లుమన్
దరళనేత్రలు గూడిపాడిరి ధాతులీలలు[1]మీఱఁగాన్ 49

ఉ. పాణితలంబునం బసిఁడివన్నియగిన్నెలుఁ బూని మారుపూ
బాణములో యనంగ మరుపట్టపుదంతులునాఁగ మన్మథ
ప్రాణములో యనంగఁ బ్రమదంబున సేసలు చల్లి చల్లి క
ల్యాణము పాడి రింతులు నయస్థితి వీణలు మ్రోయుసంగతిన్ 49

తే.గీ. శాస్త్రవిధిఁ దప్పకుండంగ నరభసముగ
హోమవిధిఁదీర్చి భూసురస్తోమ మర్థి
చేరి యాశీర్వదించి విశేషపుణ్య
భవ్యమంత్రాక్షతలు బెట్టి రవ్యయముగ 49

ఉత్సాహ. రాజమండలాస్య లోలి రమ్యలీల రత్నవి
భ్రాజమానమైన పళ్లెరంబునందు వేడ్కతో
రాజసంబు మెచ్చ లోకరంజనం బెలర్ప నీ
రాజనంబు లిచ్చిరంత రాజసంబు మీఱఁగాన్ 49

చ. తొలితొలిగట్టునిచ్చె నతిదోర్బలవంతుఁడు చిత్రసేనుఁ డ
త్యలఘుమదేభకుంభజనితస్ఫుటరమ్యవిచిత్రనూత్నని
ర్మలతరమౌక్తికంబులు విరాజితదివ్యమణివ్రజంబు గో
ర్కులు దళుకొత్త నల్లునకుఁ గూతునకున్ బ్రియపూర్వకంబుగన్ 49

ఉ. అంత సమస్తబాంధవులు నాప్తులు మంత్రులు భృత్యవర్గసా
మంతులు గట్టనిచ్చిరి క్రమంబున హారపటీరహీరగో
దంతివిలాసినీకనక[1]దానశతాంగతురంగమాదులన్
సంతసమంద రాజకులచంద్రునికిన్ రమణీలలామకున్. 49

వ. తదనంతరంబున. 49

492 — [1] క. పాడగాన్.
492-509 — చ. లో లేవు.
497 — [1] క. దాన, చ. దాని.

సీ. వరుసతోఁబెట్టిన [1]వరమహాసనముల
                    సుచితక్రమంబున నుండఁబనిచి
కర్పూరకుంకుమకస్తూరికావాసి
                    తములైన దివ్యగంధంబొసంగి
కరగృహీతములైన పరిమళోదకములు
                    పలుచగాఁజిలికి సేపటుసేసి
రమణీయనవపత్త్రరజతచామీకర
                    రచితంబులగు పళ్లెరములువెట్టి

తే.గీ. నవనవోపేతతాళవృంతములు విసరఁ
బంక్తిపంక్తికి నింతుల పంచిపెట్టి
సంభృతములైన సకలభోజ్యములు దెచ్చి
సూపకారులు వడ్డింపఁజొచ్చిరంత. 499

సీ. నవమైన శాల్యోదనము లొప్పు పప్పును
                    బాయసాన్నము లపూపములు చమరు
లప్పడంబులు వడియములు తాలింపుఁగూ
                    రలు[1]రసావళులు శర్కరలుకమ్మఁ
దేనెలు వరుగులు దిమ్మనంబులు పాలు
                    ఫలములు[2]సిగరలు పానకములు
పానీయములు తియ్యపచ్చళ్లు లవణంబు
                    లూరుఁగాయలు దధు లోదనములు

తే.గీ. నావమజ్జిగలాదిగా నరసియరసి
మిగులవడ్డింపఁ[3] జవులనిపొగడికొనుచు
నారగించిరి సౌకర్యమతిశయిల్లఁ
బారియాత్రికు లతులవిస్తారలీల 500

వ. అంతటఁగూతునింబిలిచి యిట్లనియె 501

సీ పాటించికొలువుము భవనదైవతంబుల
                    సవతులఁగొనియాడు సఖులఁబోలె
నారాధనముసేయు మత్తమామలకెప్డు
                    పరిజనంబులమీఁదఁ గరుణ[1]గలుగు

---

499 — [1] క. వరరుహాసనముల.
500 — [1] క.చ. రసావళ్లు ; [2] క. శిఖరలు ; [3] క. చాలని.

యుబుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ గూడియాడిచరింపు
దాసీజనముఁ బ్రోవు తల్లికరణి

తే.గీ. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తివిశ్వాససౌహార్దపరత నెఱపు[1]
భవ్యపతిదేవతాచారపరమపుణ్య
ధర్మ మేమరకుండుమీ తల్లి[2]కాన 502

వ. అంతటరాజశేఖరుండు తన పురంబుఁజేర నరుగు సమయంబున 503

చ. విమలసురాలయంబులను విప్రగృహంబుల రాజలోకస
ద్మములను గొల్వుకూటముల మంత్రితురంగమదంతినాట్యధా
మములను రచ్చకొట్టముల మాగధవారవధూవిచిత్రవే
శ్మములను వప్రగోపుర[1]సమంతసమున్నతసౌధవీథులన్ 504

క. చెలు వెలరు మకుటతోరణ
ములు దర్పణతోరణములు పొలుపుగ రత్నో
జ్జ్వలతప్తహేమతోరణ
ములు పల్లవకుసుమగుచ్ఛముల తోరణముల్. 505

ఉ. అణిమెఱుంగు ముత్యపుటొయారపుముగ్గులు రత్నదీపికా
శ్రేణులు[1]ధూపవాసనలు హృద్యనిరంతరవాద్యఘోషముల్
రాణఁ[2]బొసంగఁ బ్రోలు మిగులం గనువిందొనరించు నిత్యక
ల్యాణము పచ్చతోరణములై జనులందఱు నుల్లసిల్లఁగన్. 506

సీ. [1]రవికులాంభో[2]నిధిరాకాసుధాకరుం
డై వెలుఁగొందు ప్రఖ్యాతుఁడితఁడె
యఖిలరాజులనుస్వయంవరమున మించి
కాంతఁ గైకొన్న భూకాంతుఁడితఁడె
మానినీమణులకు మర్త్యలోకంబునఁ
గందర్పసముఁడైన మనుజుఁడితండె
కీర్తిమంతుఁడా సుకీర్తి నరేంద్రుని
తనయుఁడై తనరారు ధన్యుఁడితఁడె

502 – [1] క. నిలువ ; [2] క. యెపుడు.
504 – [1] చ. విశద్ధ.
506 – [1] క. ధూమ.; [2] క. మొసంగి.

తే.గీ. రత్నసుందరీనిజమనోరమణుఁడితఁడె
భూమి వేడ్కలఁ బాలించు పుణ్యుఁడితఁడె
యనుచు మోములు విచ్చి యంతంతఁ గన్ను
లారఁ జూచిరి భామిను లా నృపాలు. 507

వ. అంత నవ్వధూవరులు పురంబు ప్రవేశించి నిజగృహంబునకుఁ జేరు నవసరంబున. 508

అ.వె. పండుటెండ తరుణ పల్లవద్యుతిమీఁద
మెండుకొనఁగ వరుణు మేడమీఁద
నుండె వెలుఁగు పైడికుండ చందంబున
నెండఱేఁడు గ్రుంకుకొండ[1]మీద. 509

సీ. ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత
పట్టిన చెంగల్వ బంతియనఁగఁ
గాలవిష్ణుం డంధకారదైత్యుని వ్రేయఁ
[1]జరమాద్రిఁ బడిపోవు చక్రమనఁగ
దినమహీరుహమునఁ దేజోమయంబుగాఁ
బండిరాలిన పెద్దపండనంగ
దివినుండి దేవదానవయుద్ధరక్తార్ద్ర
మై నేలఁగూలు రథాంగమనఁగ

తే.గీ. బద్మినీసంగమశ్రాంతిఁ బరిహరింప
నపరజలనిధి జలకంబులాడఁబోవు
కరణి [2]నెరసంజ చందురు కావిపచ్చ
డంబు [3]దరిఁబెట్టి భానుబింబంబు గ్రుంకె. 510

సీ. [1]గగనసిద్ధకరాగ్రకాదంబరీపూర్ణ
పద్మరాగనవీనపాత్రమనఁగ
నస్తపర్వతశిఖరాంచితమందార
కాచ్ఛాచ్ఛనవపుష్పగుచ్ఛమనఁగ
యాదోగణాధీశ్వరాశావధూటీన
ముజ్జ్వలమాణిక్యముకురమనఁగ
ఘనభయంకరకాలఖడ్గసంఛిన్నవా
సరమహిపస్కంధచక్రమనఁగ

---

507 – [1] క. రణ ; [2] చ. దిని.
509 – [1] క. నొప్పె.

తే.గీ. నమరి యపరాంబునిధి నిర్మలాంబుపూర
తరళకల్లోలమాలికాత్వరితచలిత
మంజు[2]విద్రుమమల్లికాగుంజభాతి
యబ్జబంధుండు మెల్లనె యస్తమించె. 511

క. ఘనతను తాపము లోఁబడ
నెనసిన రాగంబుతోడ నినుఁ డపర దిశాం
గనఁజేర నరిగెఁ దన్ప్రియ
వనితం జేరంగ నరుగు వల్లభుకరణిన్. 512

క. అయ్యెడ నర్కుని మండల
మయ్యచలము డిగ్గి పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్
వ్రయ్యంది [1]గాఁచి కమ్మరి
చయ్యనఁ బదనిచ్చు నుక్కుచక్రము భంగిన్. 513

సీ. నర్వంకషోన్మేషచటులప్రతాపంబు
మారుని కరఖడ్గధారఁ జేర
నఖశిఖాగ్రంబున నర్తించు కరములు
కుఱుచలై యొకచోట గుంపుకొనఁగ
భూభృత్తటాభోగపూర్ణవాసరలక్ష్మి
యుడురాజుధాటికి నోడి యొదుగఁ
దేజోవిశేషంబు దీనతఁజెందిన
దిక్కులఁ జీకటుల్ పిక్కటిల్ల

ఆ.వె. భావి విరహదశకుఁ బద్మిని నిదురింపఁ
జక్రవాక సమితి [1]నంచలింప
నంధకారజలధి నఖిలజగంబులు
మునుఁగ నపరవార్ధి మునిఁగె నినుఁడు. 514

క. అప్పుడు పశ్చిమవారిధి
నప్పద్మహితుండు గ్రుంకె నరుణచ్ఛవితో
నొప్పి ఖచరాంగనలచేఁ
దప్పి పడిన పద్మరాగదర్పణ మనఁగన్. 515

వ. ఇట్లు సూర్యాస్తమానంబగుటయు. 516

---

511 - [1] ట. గగనికర్ధ; [2] ట. విభ్రమ.
513 - [1] క. గాని.
514 - [1] క. నంచలించె.

తే.గీ. ఇనతురంగరేఖాకృతి నెసఁగు నస్త
శైలధాతుశిలోద్ధూతధూళిపటల
మనఁగ నపరదిశాభాగమునకు వింత
చెలువు సేయుచు నెరసంజ పొలుపుమిగిలె. 517

ఉ. సురుచిరతారకాకుసుమశోభితభోంగణభూమి గాలమన్
[1]గరువపు సూత్రధారి జతనంబున దిక్పతికోటిముందటన్
నరసముగా నటింపఁగ నిశా[2]సతికెత్తిన క్రొత్తతోపు పెం
దెరయన నొప్పె సాంధ్యనవదీధితి పశ్చిమ దిక్తటంబునన్. 518

తే.గీ. రాజురాకకు మిక్కిలి నోజపడిన
నంబరంబను కొలువు సౌధంబునందు
గట్టికెంబట్టు పట్టము గట్టినట్టి
మనపతాకన నెఱసంజగానుపించె. 519

ఉ. ఒలసినకెంపుఁ జుక్కలును నొక్కట [1]దోఁచిన సంజప్రొద్దుపై
[2]యలవడఁ జూడనొప్పెఁ బడియాఱుగువన్నె పసిండినీర మి
క్కిలిగఁ దొలంచి ముత్యములు గీల్కొనఁ గూర్చిన పచ్చడంబునం
దెలమి వహింప మింటి సిరియింటికిఁ గట్టిన మేలుకట్టనన్. 520

ఉ. గిరివరగహ్వరాంతరవికీర్ణతమఃపటలంబుఁ ద్రుంప ము
న్నరిగిన [1]తెవు లర్కుఁ డపరాంబుధిఁ గ్రుంకినఁ దోడుదప్పియే
వరుసనుగూడ లేక తగుపట్లను [దాఁ] బయనంబుఁ జేసెనాఁ
గరము వెలింగె దీపకళికావితతుల్ భవనాంతరంబులన్. 521

ఉ. ఇనునసమానతేజు దివసేంద్రుఁ గనుంగొను మాడ్కిఁ జూడఁగాఁ
జనదొరు నల్పతేజు నను చాడ్పునఁ జంచలభృంగతారకా
మనవనజాతలోచనము గ్రక్కున మీలన మొందఁజేసెఁ బ
ద్మిని [1]పతిభక్తి [2]తత్త్వమనఁ [3]మేలిమికిన్ గురి[4]తానపొమ్మనన్. 522

క. తమ రాజు పనుప గూఢ
క్రమమునఁ జని వేగు సూచు కాలరుల క్రియన్
గమలములరాజు గ్రుంకినఁ
గ్రమమున నొక్కొక్క చుక్క గానంబడియెన్. 523

518 - [1] క. తరువన; [2] క. తటియెత్తిన.
520 - [1] ట. దాఁచిన; [2] క. దలపర.
521 - [1] క. దీవ.
522 - [1] ట. నతి; [2] ట. నత్య; [3] క. బోలిమదిన్; [4] క. దానె.

మ. అలఘుప్రౌఢిమహార్భటీకలితసంధ్యాతాండవాడంబరో
చ్చలితత్ర్యంబకజూటికావివరచంచన్నిర్గతానేకగాం
గలసద్వారికణంబులో యనఁగ నాకాశస్థలంబెల్ల నిం
డ లలిం గాంతి వహించి కానబడియె న్నక్షత్రముల్ సూటిగన్.

ఉ. చుక్కలు తోడు తోడఁ దలచూపఁదొడంగె మనోభవుండు వి
ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు నేయఁగఁ జొచ్చె నేల కెం
పెక్కుచు వచ్చె దివ్వెలొక యేడ్తెరతో వెలుగొందె సందడుల్
దక్కెఁ బురంబు వీథుల మదం బొలసెన్ విటచిత్తవృత్తముల్.

సీ. రత్నాకరముఁ దర్వ రాజు పుట్టెడు వేళఁ
జెదరిన [1]యమృతంపుఁజినుకులనఁగఁ
గమలవైరిని రాహుగబళింప నంతంత
తొలఁకు వెన్నియల లేఁదునుకలనఁగ
నాకాశలక్ష్మి దా హరు బెండ్లికని యిరు
కేలఁబట్టిన సేసఁబ్రాలనంగ
నిఖిలేశునకు బ్రహ్మ నీలాంబరంబున
నమరఁ గట్టిన మౌక్తికములనంగ

ఆ.వె. వీథు లేర్పడంగ వెలుఁగుచు మెఱుఁగుల
చిద్రుపల మరుభంగి చెలులు మిగుల
గగన వీథి నంతఘనతరనిబిడాంధ
కార [2]మెరియనంధకార మొప్పె. 5

సీ. మృగనాభి [1]పంకంబు మెయినిండ నలఁదిన
మాయాకిరాతు మై చాయఁదెగడి
నవపింఛమయభూష లవధరించి నటించు
పంకజాక్షుని[2]గొల్వు నుంకమడిగి
తాపింఛవిటపికాంతారసంవృతయైన
యంజనాచలరేఖ నవమళించి
కాదంబనికురుంబకలితయై ప్రవహించు
కాళింది గర్వంబుఁగాకుసేసి

---

526 – [1] క. అమృత బిందువు లనంగ ; [2] ట. మొరయ.
527 – [1] క.చ. రక్తంబు. (ఇది, చ. లో. తొలి పాదమే కలదు) ; [2] చ. చెల్వు.

తే.గీ. కవిసె మఱియును గాకోలకాలకంఠ
కంఠకలకంఠకరిఘటాఖంజరీట
ఘనఘనాఘనసంఘాతగాఢకాంతిఁ
గటికచీఁకటి రోదసీగహ్వరమున. 527

సీ. చుక్కలో యివి గావు సురలోకవాహినీ
విమలాంబుకణతదంబములుగాని
తారలో యివి గావు తారా[1]పథాంబోధి
కమనీయ[2] పులినసంఘములుగాని
ఉడువులో యివి గావు మృడునంబరంబునఁ
దాపించినట్టి ముత్యాలుగాని
రిక్కలో యివి గావు రేచాపతుఱుముపైఁ
జెఱివిన మల్లె క్రొవ్విరులుగాని

తే.గీ. యనుచు లోకంబు సందేహమందుచుండఁ
బొడిచె బ్రహ్మాండపేటికాపుటకుటీర
చారుకర్పూర[3]పాళికాసంచయములు
మెండుకొని యోలి నక్షత్రమండలములు. 527-a

తే.గీ. ఇక్షుకోదండుఁ డించువిల్లెక్కు వెట్టి
యనిమిషులమీఁద నిర్జరాంగనలమీఁద
నిండవేసిన కపురంపు టుండలనఁగ
నుడుగణంబులు నుడువీథినుప్పతిల్లె. 528

ఉ. తమ్ములు చిన్నవోవఁగఁ బ్రతాపముతో నెడఁబాసి గాసియై
క్రమ్మఁగ డాఁగె సూర్యుఁడిక రాఁగల చంద్రునినైన మ్రింగెదన్
బొమ్మనునట్టి చందమున ఘోరన చీకటి వచ్చె [1]జారచి
త్తమ్ముల సమ్మదమ్మునకుఁ దావలమై యిలమీఁద నెల్లెడన్. 529

ఉ. రాజితతేజుఁడైన దినరాజు తిరోహితుఁడైన పిమ్మటన్
రాజుదయాద్రి పీఠము తిరంబుగ నెక్కెడి [1]నందు కట్టునన్
భ్రాజిత సత్పథంబునకు బాధ యొనర్చుచు జారచోరసం
పూజితమై తమంబుగదుఁ బొంగె నధర్మముతోడి [2]జోడనన్. 530

527-a — [1] క.చ. పథంబున ; [2] క.చ. విపుల ; [3] క.చ. వాటికా.
529 — [1] ట. జోర.
520 — [1] ట. నంది ; [2] ట. జోటయె.

ఉ. జారులు చోరులు న్మిగుల సంతస మందఁగఁ జక్రవాకముల్
దారలు దాను నశ్రుజలధారలు గ్రమ్మఁగ నుమ్మలింప నిం
డారె నజాండభాండమున నంతకశాసనకందరాంతర
స్ఫారవిశాలకాలరుచిబంధురబంధమహాంధకారముల్. 531

ఉ. నాలుగు దిక్కులందును ఘనంబుగఁబర్విన చీకటుల్ జగ
ద్గోళము [1]నిండ దృష్టికి నగోచరమై వెసఁ బర్వి యుండఁగా
నీలపటంబు మీఁద విపణిం బచరించిన ముత్తియంబులన్
బోలి వెలింగె నంతటనభోవలయంబునఁ దారకా [2]తతుల్. 532

తే.గీ. హిమకరునిరాక మునుమున్నె యెఱుఁగఁ జెప్ప
వచ్చి యున్నట్టి దూతిక వడువు దోఁపఁ
గుముదినీవ్రాతమున నతికుతుక మడరఁ
జెలువు దీపింప షట్పదశ్రేణి నిలిచె. 533

సీ. తలఁచిరానేరక తత్తఱపడి యేమి
మాటకు ముందఱ [1]వేటనంగఁ
గినుకుచుఁ బెద్ద వాకిలి దాఁక [2]గద్దించి
వచ్చుచుఁ దమయింటి వారు మాట
లాడిన నెఱిఁగిరో యని గ్రుమ్మఱుచుఁ బ్రొద్దు
పోయె వాడింతకుఁబోవు నొక్కొ
యని యుమ్మలించుచు నైనట్టి దోఁగాక
యని [3]సాహసము సేసి యతిరయమున

తే.గీ. నేఁగుచును గ్రొత్తఱంకు ప్రొద్దెఱుఁగ దనిన
కారణము నేఁడు తనుఁదానఁగలిగెననుచు
నెట్టకేలకువచ్చెఁ బ్రాణేశు కడకుఁ
జంచలస్వాంత యొక నవజారకాంత 534

ఉ. వన్నెలు చూపి చూపి తలవాకిటికై నడయాడి యాడిచే
సన్నలు చేసిచేసి నడినన్న[1] పథంబున నేఁగి యేఁగి పై
కొన్నను డాఁగి డాఁగి గనుగొన్న ముదంబునఁదేలి తేలియా
మన్నన మెచ్చి మెచ్చి కడు మక్కువఁగూడిరి జారులత్తఱిన్. 535

532 — [1] ట. నిండి ; [2] ట. వతుల్.
534 — చ. లో లేదు ; [1] ట. బేట ; [2] క. గట్టించి ; [3] ట. సహసము.
535 — [1] ట. విధంబున.

## చంద్రోదయ వర్ణనము

ఆ.వె. వలపులాఁడు మిగుల వలపుల వలరాజు
వలవనేర్చు పదురు వలచినట్లు
పెట్టజాలఁ డొకఁడు పెట్టిన మాత్రమ
పెట్ట లేక లంజ పెట్టఁగలదె. 536

చ. తమమను నీలవర్ణపరిధానము వీడఁగఁ బూర్వశైలశృం
గములను నున్నతస్తనయుగంబు దనర్పఁజకోరబంధువ
ర్గము ముదమందఁగా నిజముఖద్యుతి [1]తెల్పుగ నిండు గర్భచి
హ్నము లభిరామమయ్యె నమరాధిపు దిక్సతికిం గ్రమంబునన్. 537

ఉ. తూర్పున నీగతిం దెలుపు దోఁచె సమంచితవార్ధిఖేలనా
దర్పిత [1]శక్రదిగ్గజనితాంతవిఘూర్ణితదుగ్ధవార్ధి తుం
[2]తుర్పులఁబోలి పాంథజనదుస్సహవీరవిహార[3]లోలకం
దర్పజగత్త్రయీవిజయధామసితధ్వజపట్టికాకృతిన్. 538

క. జడనిధి వెలువడి యెఱ్ఱఁగఁ
బొడమెడు నా యగ్నిశిఖలఁ బోలిక నిగుడం
గడగి యుడురాజు విరహుల
బడబానల మనఁగ నుదయపర్వత మెక్కెన్. 539

తే.గీ. వర్ణనకు నెక్కు దిగ్వరవర్ణినులను
గలయఁ గైసేయు సైరంధ్రి కరతలమున
మురువు దీపించు లత్తుక ముద్ద యనఁగ
నుదయరాగంబుతోఁ జంద్రుఁ డుదయమయ్యె. 540

సీ. మరలిన విరహుల మానంబు లదలించి
యిరుమేన చీఁకట్ల నిండ్ల కనిచి
మఱి జారకుల నెల్ల [1]మఱుఁగులు [2]చొరఁ దోలి
నీలోత్పలంబుల మేలు[3]కొలిపి
[4]వెలయు చకోరకావళికి విందులు సేసి
నీరజాంతంబుల నిద్రపుచ్చి
వనధుల నుబ్బించి వలరాజు నెగయించి
మందమారుతికి నానంద మొసఁగి

537 — [1] చ. రెల్పున; ట. పెల్పుగ.
538 — [1] ట. గంధ; [2] ట. తుర్పము; [3] క. లోక.
541 — [1] చ. ట. మడుఁగులు; [2] ట. చెర; [3] ట. కనిపి; [4] క. వలయు, చ. దెలయు, ట. సెలయు;

ఆ.వె. తన [5]తలంపుచేతఁ దలకొని నిఖిలంబుఁ
దెలుపు [గాఁ] గఁ దూర్పుదిక్కునందుఁ
జల్లదనముఁజూపె జనములొం[6]డొరులును
మామ యనఁగఁ జందమామ పొడమె. 541

సీ. విటసేనపై దండు[1]వెడలెడి [కందర్పు]
గొల్లెనపై హేమకుంభమనఁగఁ
గాముకద్యుతివల్లికల ద్రెంప నెత్తిన
శంబరాంతకుచేతి చక్రమనఁగ
మారుండు పాంథుల మానాటవులు గాల్పఁ
గూర్చిన నిప్పులకుప్పయనఁగ
విరహిమృగంబుల వేఁటాడు మదనుఁడు
దెచ్చిన[2]మోహంపు[3]దీపమనఁగ

ఆ.వె. వింత[4]నునుపుగలిగి వృత్తమై యరుణమై
కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
[5]బొడుపుఁగొండమీఁదఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండలమున 542

సీ. తిమిరభూతము సోఁకుఁదెలియ జగత్త్రయీ
లలన దాల్చిన రక్తతిలకమనఁగ
సఖ్యంబునకు నిశా[1]శబరి యిచ్చినఁ బ్రాచి
[2]పాటించు గురువిందబంతియనఁగఁ
దోయధి వెడఁగ్రుంకి దోఁచు పురందరు
కుంభిసిందూరితకుంభమనఁగఁ
గులిశాయుధుని పెద్దకొలువున నెత్తిన
దీపించు మాణిక్యదీపమనఁగఁ

తే.గీ. గుముదినీరాగరసబద్ధ[3]ఘుటికయనఁగఁ
గామినీరంజనౌషధ[4]కలశమనఁగఁ
బొడవుపెంపున బింబంబుపొలుపుమిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతిని సాంద్రుఁడగుచు. 543

---

541 — [5] ట. చ. తలంబు ; [6] ట. డొరులను.
542 — [1] ట. వెడలిన ; [2] క. మోహన, చ. మోహ ; [3] క. చ. దీప ; [4] ట. మనువు ;
[5] క. పొడవు.
548 — [1] ట. నతియొనంగిన ; [2] ట. ప్రాపించు ; [3] ట. గుళిక ; [4] ట. కబళ.

శ్రీకాంత నయిదోడు రాకాంగనను సొంపు
కళలపెన్నిధి సుధాగరిమ[1] ప్రోవు
చుక్కల గమికాఁడు జక్కవలకు బూచి
మృదు తళపువ్వు పాల్కడలిపట్టి
వలరాయనికి మామ బలజంబు వాకట్టు
తిమిరంపు[2] వెలిమందు[3] దిశలవిందు
యోగుల[4] ప్రాపు వియోగుల[5] మడికీడు
కలువలఱేఁడు సౌఖ్యములపొందు

గీ. వెన్నెల పులుగులకుఁ బంట విరహిజనుల
గొంగ మలయానిలునకును గూర్మిసఖుఁడు
నిండి పొడిచెను వెనఁ దూర్పుకొండమీఁద
సుందరాంగుఁడు సంపూర్ణచందురుండు. 544

మగనిలో సగమైన మగువ లీలార్థమై
దాల్చు కర్పూరతాటంకమనఁగ
దేవేంద్రు గారాబుదేవి ధమ్మిల్లంబు
పైఁబేర్చు చేమంతిబంతి యనఁగ
రతిరాజు మన్నించు రాణివాసపుఁగొమ్మ
నవరించు ముత్యాలజల్లి యనఁగఁ
బ్రాచీది[1]శాకాంత పాపట సెలవున
సొబగొంది వెలయు చేర్చుక్క యనఁగఁ

గీ. [2]గాసె పాలేటివిందు జక్కవలపొందు
[3]యబ్జములసిగ్గు నమృతరసంబునిగ్గు
కాముకుల [4]ఘాక పచ్చవిల్కానిజోక
చంద్రికాజాలములసీమ చందమామ. 545

పూర్వదిగ్భామిని పురుహూతునడుగులు
గడుగనెత్తిన రత్నకలశమనఁగఁ
గులమెల్లఁ బొత్తునఁ గుడువఁ జకోర[1]పా
ళికినిడ్డ పసిఁడిపళ్లెరమనంగ

---

**544** — [1] ట. ప్రోవు ; [2] ట. వగజంబు ; [3] ట. దెనల ; [4] క. ప్రోవు ; [5] క. తుతి.
**545** — [1] క. కాంతపు, ట. కాంగన ; [2] క. చ. దోచె ; [3] ట. నంబుజము ; [4] క. ధౌత, ట. మాత.

నమరులు నిత్యంబుననలారఁ ద్రావంగఁ
బులియని యమృతంపుఁ జెలమయనఁగ
విరహులపై దాడివెడలెడు వలతేని
కెత్తిన ముత్యంపుటెల్లియనఁగఁ

తే.గీ. పద్మముల పొడు వేల్పుల బంతికూడు
కమలమిత్రునిజోడు చీఁకటులనూడు
మించి యుదయించె నుదయాద్రిమీఁద నంత
నకలసౌందర్యవరసీమ చందమామ. 546

సీ. గగనతాపసముఖ్యకమనీయకరతల
సంగతస్ఫాటికలింగమనఁగ
భానురాంబరమనప్రాసాదసంస్థిత
విశదమౌక్తకలశవిహగమనఁగ
మహితధారాధరమార్గపారావార
సంజాతనిర్మలనంఘమనఁగ
నాకాశవిపులపద్మాకరశ్రీకర
మంజులతరఫేనపుంజమనఁగఁ

తే.గీ. గ్రమముతోడుత నుదయరంగంబుఁబాసి
యచ్చవెన్నెల యొక్కింత పెచ్చుపెరుగ
జారచోరులు బెగడఁ జకోరసమితి
మిగుల మోదింపఁ జంద్రుండు మిన్నుఁబ్రాకె. 547

సీ. నళినగర్భుని వాహనంబైన రాయంచ
గూరిమితోఁ గన్నగుడ్డనంగ
వజ్రాయుధుఁడు లీల వలచేతఁబట్టిన
మంజులమగు నూత్నకంజమనఁగఁ
బ్రాగ్దిశాకాంత దాఁ బరిణామ మెసగంగ
మలయజంబుననిడ్డ తిలకమనఁగ
దర్పించు విరహుల ధైర్యవల్లులఁ ద్రెంప
దర్పకుం డెత్తిన దాత్రమనఁగ

తే.గీ. లాంచనచ్ఛవిపరభాగలక్ష్మియనఁగ
నుదయరాగంబు సుభగసముజ్జ్వలముగఁ
బూర్వదిఙ్ముఖమునకుఁ గర్పూరకాంతి
భంగియొసఁగుచు నిందుబింబంబుదోఁచె. 548

546 — [1] క. చ. నంఘ౦ఠిడ్డ.

సీ. ఇచ్చకుఁగేలిమై నెగయంగవైచిన
కంతుము త్రెపుఁ జేరుబంతియనఁగ
విరహానలము మండ వినరంగ నెత్తిన
మరుచేతి పటికంపు సురటియనఁగ
జగములు వెలుగొంద సన్నద్ధుఁడగు మీన
కేతను వజ్రంపు గేలమనఁగఁ
బాయకుండింక దంపతులంచుఁ జాటించు
కాయజు వెండిజేగంటయనఁగ

తే.గీ. మండలాకారమునఁ జుట్టి గండలించు
కిరణసూత్రంబు నంధించు క్రీడ నల్పు
భావసంభవు వెలిపట్టుఁబడగ యనఁగ
నంబరంబునఁ జంద్రబింబంబు దోఁచె. 549

సీ. ప్రాచీదిశాంగనాఫాలతలంబున
దీపించు సిందూరతిలక మనఁగ
నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు
ఖండింప వెఱయించు కత్తి యనఁగ
గగనతమాలవృక్షము తూర్పుఁగొమ్మను
లలితమై వెలయు పల్లవ మనంగ
సురపతిక్రీడ నుప్పర మెగవైచిన
సమధుపలీలాంబుజం బనంగఁ

ఆ.వె. దొగలగముల వేడ్కతోడ రాజిల్లంగఁ
గడలి మిన్నుముట్టి కడలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు భూరిచకోరక
ప్రీతికరుఁడు జారభీతికరుఁడు. 550

సీ. పన్నగాధిపుశయ్యపై దూర్పువెనుకగా
నిలిచున్న హరినాభిజలజ మనఁగఁ
దన పుట్టినిల్లు గావున వేడ్క వనధిలో
మునిఁగి లేచిన సిరిమోమనంగ
విభు లల్క లుడిగింప విరహిణీతతి కిచ్చు
దర్పకు నభయహస్తం బనంగ
బలవైరిసౌధాగ్రతలమున విలసిల్లు
కనకోజ్జ్వలామృతకలశ మనఁగ

తే.గీ. బయలి కొలువున సురపతి పాలఁబట్టి
పాలయు మరుచేతి చిగురాకుఁబలక యనఁగ
సుభగవిలసితుఁడై జారచోరజనుల
హృదయభయకరుఁ డమృతాంశుఁ డుదయమయ్యె. 551

సీ. నెలకొని యమృతంబు నిండారఁబోసిన
[1]కామరారు [2]రాజతకుంభ మనఁగఁ
జిరకాలసంభృత[3]విరహపాండురమైన
వరయామినీవధూవదన మనఁగఁ
బాలసముద్రంబు బాసి[4]వచ్చిన సుధా
గురుతరసారంపుఁ గుప్ప యనఁగ
వలరాజు శృంగార మలవడ వీక్షింప
నలరింపఁ దగు నిల్వుటద్ద మనఁగ

తే.గీ. వెలయుఁ గంతుని యభిషేకవిధిఁ ద్రిదశ
కాంతుఁ డెత్తిన మౌక్తికకలశ మనఁగ
జీవలోకమ్ము మిక్కిలి చెలఁగుచుండ
మిగుల నభమునఁ జంద్రుండు పొగడ నెగడె. 552

శా. చోరవ్రాతగజాంకుశంబు నళినీశుంభన్మదేభంబు ది
క్నారీమౌక్తికదర్పణంబు రజనీకాంతామనోహారి వి
స్ఫారాంభోధితరంగ[1]శాలి గిరిజాప్రాణేశభాస్వజ్జటా
శ్రీరమ్యాభరణంబు చంద్రుఁ డుదయించెన్ సుప్రభాభాసియై. 553

ఉ. [1]చుక్కల [2]రాణివానముల చుట్టలు గల్వ[3]కొలంకులెల్లఁ జె
న్నెక్కిన జోదు పూవిలు [ తుఁ ] డిష్టుఁడు వెన్నెలపుల్గు లాశ్రితుల్
జక్కనదోయి తామరలు శత్రులుగా విహరించు రాజు మి
న్నెక్కె మనోజతాపభయ మెక్కె వియోగులుఁ దల్లడింపఁగన్. 554

చ. కువలయపర్వ మబ్జముల గొంగ చకోరమనోరథంబు జ
క్కవలకుఁ బాయు త్రోవ కళంకధరుని యౌదలపువ్వు చిత్తసం
భవు దళవాయి దేవతల [1]పారణ యంబుధి యుబ్బు లోచనో
త్సవము తమో వ్యపాయము నిశామణి తూర్పునఁ దోఁచె నిక్రియన్. 555

---

552 — [1] క. కుసురాకు, చ. కొమరార ; [2] క.చ. రాజిత ; [3] క.చ. వీర ; [4] ట. ద్రచ్చిన.
553 — [1] చ.ట. కారి.
554 — [1] క.చ. చుక్కలు ; [2] క.చ. రాణివానములు ; [3] క. గొరింక.
555 — [1] క. ధారణ.

జననము దుగ్ధవార్ధి సహజన్ములు కల్పకకామధేనువుల్
తనువమృతంపుఁబెంజెలపు తావక మీశ్వరమౌళివర్తనం
బనుపమ మిట్టి రాజు నుదయంబున నో ఫలదింపలేమి య
వ్వనజము పాపమేమి యను వారము సర్వగుణాఢ్యుఁ డాతనిన్. 556

[1]దెసలను గొమ్మ లొయ్య నతిదీర్ఘములైన [2]కరంబులన్ బ్రియం
బెసఁగఁగ నూది నిక్కి రజనీశ్వరుఁ డున్నతలీలఁ బేర్చు నా
కసమను పేరి భూరుహము కాంత నిరంతరతారకా[3]లిన
త్కుసుమచయంబు గోయుటకొ కోయనఁ బ్రాఁకె సముత్సుకాకృతిన్. 557

విరహుల తాపముం జెఱకువిల్తు ప్రతాపము వర్ధమానసా
గరముల పెంపు రాత్రిసతి గర్వముసొంపు చకోరికానము
త్కరము విలాసముం గుసుమగంధవిలాసము నగ్గలించె [1]సుం
దరశశిదీప్తిజాలము సుధారసపూలము లీల బ్రాలినన్. 558

[1]ప్రిదిలి కైరవదళశ్రేణి నొక్కులు దీఱె
శశికాంత[2]వేదుల జలము లూరెఁ
గోరి కాంతులతోఁ జకోరికల్ రతి గేరె
వారాశి [3]గరువంబు మేర మీఱె
ద్రోపడి యిరులు పటాపంచలై పాఱె
దిఙ్ముఖంబుల వింతతెలివి సేరెఁ
జక్రవా[4]కమ్ము [5]లబ్జకుడుంగములు దూఱె
కామినీకాంతుల కలక దేఱె

గీ. మదనుఁ[6] దమ్ములు నూఱె హిమంబు[7] పేరె
జడిసి విరహిణి వగఁగూరె జారచోర
దర్పములు జారె రవికరతాప మాఱెఁ
జూడఁజూడంగఁ దారకస్ఫురణ దాఱె. 559

కుముదిని నవ్వె నత్తఱిఁ జకోరము గ్రొవ్వెఁ గరావరుద్ధమై
కమలిని స్రుక్కె వారినిధి గ్రక్కున నిక్కె సమస్తచంద్రకాం
తములు గరంగె మన్మథుఁ డుదగ్రతఁ బొంగె వియోగబృందమా
నములు దలంగె సంచలమనంబు గలంగెఁ గ్రమక్రమంబునన్. 560

557 – చ. లో లేదు.
557 – [1] క. దిశలను ; [2] క. కరంబులై ; [3] ట. వమి.
558 – [1] క. సుద్ధర, ట. సాదర.
559 – [1] క. పృథివి, ట. శిథిల, చ. లో తొలిపాదమే కలదు ; [2] ట. పంక్తుల ; [3] ట. గర్వంబు ; [4] ట. కము ; [5] ట. లంబుజ ; [6] ట. దంబులు ; [7] క. జేరె.

చ. కుముదవనాళికిం[1] బలుపు కోకములాటకు[2] నిల్పు దిగ్వధూ
సమితికిఁ బూత మేఁత నవశాబచకోరకరాజి కిందుకాం
తములకు ద్రావకం బగుచు దర్పకశాస్త్రనిరూపితౌషధ
క్రమమునఁ బండువెన్నెలలు గాసె[3] మహీవలయాంతరంబునన్. 5

మ. కుముదంబుల్ వికసిల్ల నబ్ధిజలముల్ ఘూర్ణిల్ల ఘోరాంధకా
రము భేదిల్ల దిశాపురంధ్రిముఖముల్ రంజిల్లఁ బాంథప్రతా
నము భీతిల్ల నలంత జక్కవలకు న్వర్తిల్ల నేణాంకర
త్నములన్ నీరము లుప్పతిల్లఁ బొడిచెం జాబిల్లి పూర్వాద్రిపై 5

చ. అమరుల బోనపుట్టిక సహస్రమయూఖుని జోడుకోడె నం
తమసము వేఱువిత్తు కుముదంబుల చక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మి తొలంగుబావ కో
కములకు గుండెతల్లడము కైరవమిత్రుఁడు దోఁచెఁ దూర్పునన్. 5

సీ. ఆకాశనది యని యనిమిషాంగన లెల్ల
వేడుకతో జలక్రీడ[1] సల్పఁ
బాలమున్నీరని పంకజనాభుండు
ఫణిశయ్య గావించి పవ్వళింపఁ
బాదరసం బని మోదించి సిద్ధులు
మించి ఘటంబులు నించుకొనఁగ
నమృతంపు సోనని యఖిలామరశ్రేణి
చెలఁగి పానంబులు సేయుచుండ

తే.గీ. వెల్లివిరియుచు నుబ్బుచు [2]విశదకాంతిఁ
బొదలుచును దివ్యమగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల [3]విమలమై పెచ్చుపెరిగె. 5(

తే.గీ. ఆతపంబునఁ బగలెల్ల నలఁతఁ గూరి
కోర్కె మీఱంగనున్న చకోరసమితి
తగనొనర్చియుఁ బేర్చు నాతప మనంగ
నంబరంబునఁ బర్వెఁ జంద్రాతపంబు. 5(

---

561 – [1] క. బలుచ; [2] క. తెల్పు; [3] ట. ధరాస్థలిమోహనంబుగన్.
564 – [1] ట. నలుప; [2] క. వీశ; [3] క. మిగులమై.

ఉ. నేలయు నింగియుం దిశలు నిండె నఖండిత[1]భాతిఁ జంద్రికా
జాలము దద్రసంబులుఁ బ్రసారితచంచుల[2] నంచితస్థితిం
గ్రోలెఁ జకోరబృందములు గ్రోలి ముదంబున సోలి సోలి లీ
లాలలితానురక్తిఁ జదలం బొదలెన్ మదలాలసాకృతిన్. 566

చ. సరసత నిండువెన్నెలలు చంచుపుటంబులఁ జించి చించి లోఁ
[1]గురియు వినూత్నచంద్రికలు [2]కుత్తుకబంటిగఁ గ్రోలి క్రోలి పై
దొరగెడు కౌముదీరసము తుంపురులన్ వెసఁదోఁగి తోఁగి పైఁ
[3]బొరలుచు నీఁదుచుం మునిఁగిపోవుచు నాడెఁ జకోరదంపతుల్. 567

చ. ఎఱకలు [1]దీఁటి కంధరము లెత్తి [2]యెుగిం జరలాట మున్నుగాఁ
బఱచుచు లేఁతవెన్నెలలు పారణసేయుచు మించి చంచులన్
సఱకినఁ దోనఁబుట్టు కిరణంపుఁగొనల్ గొని మోము మోముతో
[3]నిఱియఁగఁజేర్చి ప్రేయసుల కిచ్చుచు నాడె దివిం జకోరముల్. 568

చ. అఱకల కెల్ల వ్రేఁగుఁగ బయుల్పడు వెన్నెల [1]వోసి దీర్చుచున్
దఱుచగు వెన్నెలం దిగిచి త్రావుచుఁ దెట్టువగట్టు వెన్నెలం
గఱచుచుఁ జిక్కఁగాఁ గరడు[2]గట్టిన వెన్నెలగుజ్జు గీరుచున్
తుఱగలి గొన్న వేడుకలతో విహరించెఁ జకోరదంపతుల్. 569

మ. కలయుం జంద్రిక సోఁకఁ గర్ణికలు పొంకంబెక్క నంతంతకున్
గలికాగ్రంబుల పట్టు వాసి నెరయంగావించెఁ దోరంపుటు
గ్గుల వీడ స్వేదవీఁక వీఁగి వెలిరేకుల్ నాళము ల్డాయ లో
దళము ల్పింకముఁ జూపఁగాఁ గలువతండం బొందెఁ గ్రొత్తావులన్. 570

చ. వడిగొని చాల నుప్పతిల వాలిన కేసరముల్ దలిర్పఁ బు
ప్పొడిడళ మెక్కఁ దేనియలు పొంగి తరంగలుగాఁ జెలంగి పై
బడు నెలదేఁటి దాటులకుఁ బండువలై నవసౌరభంబులుం
గడువుగ నుల్లసిల్లె ఘనకైరవషండము నిండువెన్నెలన్. 571

ఉ. వెన్నెలవెల్లి పాల్కడలి వ్రేఁకఁదనంబుఁ దనర్చె దిక్కులన్
మిన్నును నేల ముంచి రజనీకరబింబము కుండలీభవ
త్పన్నగతల్పకల్పనము భంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కయొనర్చెఁ గలంక మత్తఱిన్. 572

---

566 - [1] క. భావి ; [2] క. నందిన.
567 - [1] క. గుడియు ; [2] క. కుత్తిగ ; [3] క. బొదలుచు.
568 - [1] క.చ. దిండి ; [2] ట. మొగిం ; [3] ట. నిఱియుచు.
569 - [1] క. వోలివిచ్చుచున్, చ. దోవిదీర్చుచున్ ; [2] ట. గట్టఁగ.

చ. అవిరళతారకానిబిడహారము లోలి ధరించి చంద్రికా
ధవళవినూతనాంబరము దట్టముగాఁగ మునుంగువెట్టి కై
రవమధురస్మితం బమర రాత్రివిలాసిని యొప్పె శీతరు
క్ప్రవిమలరత్నదీపమనఁ బర్వె నజాండనికేతనంబునన్. 573

చ. కమలభవాండ మొప్పెఁ బటికంపుఁగలంతిక భంగి నందులో
నమృతమునించినట్లమరె నారయఁ జంద్రిక తారకానమా
జము విలసిల్లె వాసనకుఁ జల్లిన పువ్వులరీతి నిందుబిం
బము కమనీయమయ్యె రుచిఁ బంచిన ముత్తెపుమూకుఁడోయనన్. 574

సీ. తిలకంబు కస్తూరి దీర్చితి మప్పుడ
యలవడఁ గర్పూరమైన దిపుడు
గట్టిగాఁ గెంబట్టు బుట్టముల్ గట్టితి
మప్పుడు వెలిబట్టయైన దిపుడు
పెనుపొంద నీలంపుఁబేరులు[1] వైచితి
మప్పుడు హారంబులైన విపుడు
కొలఁదిగా నూతనకుంకుమం బలఁదితి
మప్పుడు చందనమైన దిపుడు

తే.గీ. వేగఁ జనుదెంచి [2]చూడుఁడీ విస్మయంబు
లనుచు బోంట్లను జీరుదు రంతనంత
నొప్పు వేడుక వెన్నెల గుప్పలాడు
చుండి పురికన్నియలు వేడ్క మెండుకొనఁగ 575

క. ఆ సమయంబునఁవెన్నెల
బాసటమునఁ దోఁచి తోఁచి పాంథుల మీఁదన్
ఏసె మనోభవుఁ డెంతయు
గాసిలి యెలదేఁటి ఱెక్కగఱుల శరంబుల్ 576

చ. అలరులపాన్పులం దలిరుటాకులసెజ్జల హర్మ్యవేదికా
తలములఁ దీవయిండ్ల సికతాశయనంబుల ము న్విరక్తమై
నల గురువిందకందువల నప్పటి కప్పటి కింపుఁ బెంపు కో
ర్కులఁ దనియార[1] రెట్టి వడఁ[2]గూడిరి వేడుకఁ బౌరదంపతుల్ 577

---

575 — [1] క. వేసిరి ; [2] చ. చూడుమా.
577 — [1] రెట్టపడ, చ. రెట్టివడ ; [2] ట. వేడుకనాడిరి

ఉ. వారణరాజయాన[1] కనువారము కుంతలమధ్యవీథి సిం
దూరము దూరమయ్యె మగతుమ్మెదప్రోదలు[2] గోడగింప ఝుం
కారము కారమయ్యెఁ జెలికత్తియల న్బలికించు వాక్యసం
భారము భారమయ్యెఁ బుడిఁ బర్విన నూతనకామవిక్రియన్ 578

చ. విరులు శరంబులయ్యెఁ [1]జలివెన్నెల [2]యంటిన మంటయయ్యెనుం
గరువలి వజ్రమయ్యెఁ జెలికత్తియ యొప్పనిదయ్యె హస్తపం
జరమునఁ బూని పెంచు శుకశాబకముం బగచాటుదయ్యె న
త్తరుణికిఁ బంచబాణుఁ డను దైవము దాఁ బ్రతికూలమౌటచేన్ 579

చ. పులకకదంబముల్ ననిచె పుల్లముఖాబ్జ [1]వికాసనంపదల్
దొలఁగె మరాళికాగతులు దూరములయ్యె శ్రమాంబుపూరముల్
వెలి విరియంగఁజొగెఁ బురివిచ్చి నటింపఁగఁ[2]జొచ్చె నెమ్ములున్
బొలఁతుకయందు మన్మథుఁ[3] డపూర్వముగా శరవృష్టిఁ జూపఁగన్ 580

సీ. అలరుతేకుల యలుఁగులు [మీఁదఁ] గురియుచోఁ
జేలకొంగు మునుంగు చేసి చేసి
చిల్కపల్కులు గాడి జీవంబు [1]వెడలుచో
నంగుళంబుల వీను లాని యాని
యడుగులఁబువ్వాడు లంటి [2]చుఱ్ఱంటుచో
[3]నూహను గడువెచ్చ నూర్చి యూర్చి
కమ్మతెమ్మెరలు పైఁగలయంగ సోఁకుచొ
వల్లరియును బోలె వణఁకి వణఁకి

తే.గీ. సాహసము దోడుగాఁగ నచ్చపలనయన
మందిరారామవాటికామధ్య[4]సీమ
[5]దరిసి చని యొక్క పుష్పలతాగృహమున
ధవళకదళకాంతశయ్యపైఁ దనువు వైచి 581

ఉ. లేని ప్రియుండు కన్గొనఁగలేని విలాసము విన్నవింపఁగా
లేని ప్రియంబుఁ[1] గైకొనఁగలేని కడంకలుఁ గౌఁగిలింపఁగా
లేని ముదంబుఁ జేకొనఁగలేని రతు ల్మదిఁ[2] బట్టుగొల్పఁగా
లేని సుఖంబుఁ వాల్మిఁ గబళింపఁగ సింధురయాన దీనయై 582

---

578 — [1] క.చ.ట. కను ; [2] ట. గ్రోడగించు.
579 — [1] క.చ. దని ; [2] ట. యొట్టిన.
580 — [1] ట. విలాన ; [2] ట. నెమ్మికోరికన్ ; [3] చ.ట. డుపూర్ణముగా.
581 — [1] ట. వెడలుచో ; [2] చ.ట. చుఱ్ఱదుచుచో ; [3] ట. మన్నరుమని ; [4] ట. వీథి ;
[5] క.చ. అరసి.

ఉ. తూలిన మోము[1]చెల్వుఁ బయిదూఁగొను ఘర్మజలంబువెల్లువం
దేలిన మేను నెమ్మనము [2]త్రిక్కులఁ జిక్కులఁ జేసి [3]వెల్వడం
దోలిన తాల్మి వల్లభుఁడు దోఁచిన రిత్తకు రిత్తకౌఁగిటన్
సోలిన చందమునం [4]గలుగఁ జూచి వయస్యలు భీతచిత్తలై 583

చ. కటకట మమ్ము నొక్క త్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ చెలి యిచ్చట వ్రేఁకపుఁ దెవెవాక లీ
వెటువలె నీదితమ్మ తెరువెల్లను బుప్పొడి నీ పదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ తరుణీ తగునమ్మ కడిందిచైదముల్ 584

ఉ. ఇచ్చ హితాహితంబు గణియింపని గోలవుగానఁ గానకున్
వచ్చితి గాక [1]యీ పథికవర్గము నొంటిఁ జరింపనిచ్చునే
యిచ్చటి యన్యపుష్టచయ మిచ్చటి మత్తమధువ్రతవ్రజం
బిచ్చటి పల్లవోత్కరము లిచ్చటి పాంసులపంకజాతముల్ 585

క. తత్తఱిలువారి నందఱ
నత్తఱి మఱపడఁగఁ [1]బిలిచి యబ్బాలిక దా
నత్తన్విఁ దెల్పి కౌఁగిట
నొత్తి కురుల్ నిమిరి యుల్ల మూఱడిలంగన్ 586

ఉ. మచ్చికఁ గల్గు నెచ్చెలుల [1]మమ్ము మొఱంగి లతాంగి యొంటి నీ
విచ్చటి కెట్లు వచ్చితివి యీ వనవాటిక దాదిప్రక్కయే
పచ్చనివింటిజోదు తగు బంధువుఁడే మఱి చిల్కలేమి నీ
నచ్చిన తోడఁబుట్టువులె నాయము దప్పఁగదమ్మ యియ్యెడన్. 587

చ. హిమకరుఁ డంకకాఁడు మధు వెప్పుడు జాతివిరోధి రాజకీ
రము ప్రతిపక్షి తెమ్మెరలు ప్రాణముదాయలు కాచియుండుఁ జూ
తము గడుఁజూడఁజాలఁ డలదప్పకుఁ డింతయెఱింగియుం జెలీ
మము సఖులం దొఱంగి రిపుమధ్యము మీ వన మొంటిఁజొత్తురే. 588

ఉ. ఏయఁదొడంగెఁ గంతుఁ డెడయాక శరంబుల వేఁడి[1]వెన్నెలల్
గాయఁదొడంగెఁ జందురుఁడు కర్ణపుటంబులు వ్రీలఁ గోయిలల్
గూయఁదొడంగె వల్లభులఁ గోరెడు కన్యల కెల్ల నిట్టిదే
న్యాయము లేక దైవమిది నాకు ఘటించెనొ నేఁడు నెచ్చెలీ. 589

---

583 – [1] క. దెల్పు ; [2] క. దిక్కుల ; [3] క. వేల్పులం ; చ. వెల్వల ; [4] ట. గలియఁజూచి
585 – [1] ట. యో. ; ట. నిలిపి.
586 – [1] ట. నిలిపి.
587 – [1] ట. మర్మమెఱింగి.
589 – [1] క. [illegible]

క. సోలుచు చెలి కెదురాడక
తూలుచుఁ దన దండనున్న తొయ్యలి మేనన్
[1]వ్రాలుచుఁ జింతాజలధిం
దేలుచుఁ గనుఁగవయు మూసి తెలియకయున్నన్. 590

క. గుసగుసలఁబోయి వలపుల
కిసమసలని తెలిసి రసిక కిసలయపాణుల్
బిసకిసల కుసుమ రసములు
వెసమసలకతెచ్చి శిశిరవిధిలాలసలై 591

శా. పన్నీటం జలకంబు లార్చి చలువల్ పైఁగట్టఁగా నిచ్చి మే
న న్నిండారఁగఁ జందనంబలఁది విన్నాణంబుగాఁ గప్పురా
న న్నామంబిడి క్రొమ్ముడి న్విరులదండల్ [1]నిల్పి హారావళుల్
చన్నుంగ్రేవలఁ దాల్చి రప్పుడు చెలుల్ చంద్రాస్యకు న్నేర్పునన్. 592

సీ. నారంగములు వాసనారంగములుఁ గొన్ని
యలినాదమంత్రముల్ దెలుపు చోటఁ
దిలకంబు లవనిజతిలకంబు లవిగొన్ని
ప్రసవాసవార్ఘ్యంబు లొసఁగు చోటఁ
గాంచనంబులు వనైకాంచనంబులుఁ గొన్ని
కళికాప్రదీపముల్ నిలుపు చోట
సహకారములు చైత్రసహకారములుఁ గొన్ని
తలిరాకుటారతుల్ దాల్చు చోట

తే.గీ. ముప్పిరిఁ బెనంగి ద్రాక్షలు గప్పికొనిన
గొప్ప కప్రపనంటుల చప్పరాల
నొప్పు రాలిన కప్పురా లుప్పరాలుఁ
బెనచు వలిగాడ్పు [1]ధూప మర్పించు చోట. 593

ఉ. గొజ్జఁగి మంచునం గలిపి కూర్చిన పుప్పొడి తిన్నెమీఁద లా
మజ్జనశాయమానలసమానవిమానము క్రింద నొక్క పూ
సెజ్జ ఘటించి పై నొక కుశేశయకర్ణిక నిల్పి యందు నం
పజ్జలజేక్షణానుతునిభావము వ్రాసెఁ గురంగనాభికిన్. 594

ఉ. ఈరపుమోకమావిఁగమి యిక్కువ [1]గొజ్జెఁగలందు జాలు ప
న్నీరులయేట నయ్యొనఁటినిట్టలపైఁ బొరలాడి రాలు క
ర్పూరపుదీవిచెంగలువపువ్వులు గప్పిన చప్పరంబులో
సారపుఁదమ్మిపుప్పొడుల శయ్యకుఁ గన్నియఁ దెచ్చి నెచ్చెలుల్. 595

---

590 — [1] క. గ్రాలుచు.
592 — [1] క. నిచ్చి, చ. నిల్చి.
593 — [1] క. మాక.
595 — [1] క. గొంజగ, చ. గొజంగ.

ఉ. సంపెఁగతేనె చిల్కు మునుజారిన పుప్పొడిదుమ్ము డంచి బల్
సొంపులపూలచప్పరము[1]లోపలి క్రొవ్వుదిన్నెయందుఁ జొ
క్కంపుమెఱుంగుఁజేఁదలిరుగద్దియఁ గేదఁగిరేకుమీఁద రా
జింపఁగ మన్మథున్ రతిని నీరజనేత్రలు వ్రాసి చెంగటన్. 596

తే.గీ. [1]ఆతనువామాంకమున రతి నావహించి
మ్రోల ఋతురాజు నుడురాజుఁ గేలుకొలిపి
క్రేవల నగంధవిటపికోకిలమరాళ
కీరసారంగముల నిల్పి కినిసి చెలులు. 597

సీ. ధ్యానంబు హృదయవాస్తవ్యకుటుంబికి
నావాహనము జగద్వ్యాపకునకు
నర్ఘ్యపాద్యములు నారాయణప్రియసూతి
కభిషేక మబ్ధికన్యాంకశాయి
కలరుదోయిళ్లు పువ్వులవింటిదొరకు గం
ధము గంధగిరిమరుద్బాంధవునకు
ధూప మప్రీతిప్రశాపోష్ణసురభికి
[1]దీపంబు తిమిరభయాపహునకు

తే.గీ. మధువనఫలోపహారంబు మధుపకీర
పరిజనపరాయణునకు కంచు భక్తి నొసఁగి
మానమథనాయ మదనాయ మధుసఖాయ
మనసిజాయ నమోనమో యనుచు మ్రొక్కి. 598

తే.గీ. వనజముఖు లంత మరున కావాహనాది
పూజ లొనరించి పలికి రింపులు [1]జనింప
సరసమాకందనవరుచిరీ[2]చాతురీవి
శాలవాచాలమాధురీసాధురీతి. 599

చ. సరసిజ బాణ నిన్గపవఁ జక్కని దైవము గాన మన్యథా
[1]శరణ మెఱుంగ మిందులకు సాక్షివ నీవ మదీయభావమం
దిరుఁడవు నీ మనం బెఱుఁగదే జగదేకపరాక్రమక్రియా
పరతఁ దొఱంగి నీ దయకుఁ బాత్రము జేయుము మా వధూమణిన్. 600

596 — [1] క. లోలికవువ్వు.
597 — [1] క. ఆతని, చ. అతని.
598 — [1] క.చ. దీపింప.
599 — [1] ట. ఘటింప; [2] ట. చారురీతి.

క. కామకమలాస్త్రకములా
కాముకసుతకామనీయకనిధి యటంచున్
గామినులు విన్నవించిరి
కోమలకోకూయమానకోకిలఫణితిన్. 601

శా. వాతాందోళితచందనాగరులతావ్యాలీఢకేళీవనీ
జాతంబు ల్భవదీయనర్మగృహముల్ చైత్రుండు నీ బంటు నీ
కేతత్కాననజాతవస్తునిచయం బేమిచ్చి పూజించుటల్
శీతాంశో రమృతార్పణం బని గృపన్ జేకొమ్ము చేతోభవా. 602

మ. బలవన్మేరుశరాసనంబును జిరబ్రహ్మాస్త్రముం[1] గల్గు బల్
విలుకానిం దృణమైన చాపమున గాలింబోవులే [2]యల్లులం
జల మానించి నగంబు చేసి[3] తవునౌ సంకల్పసిద్ధు ల్గానన్
బలు మేరు న్నిరసింప[4] లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే 603

ఉ. కొండఁట విల్లు వేఁదలలకుండలి రాజఁట నారి యమ్మనం
తుండఁట బైటిపల్లియలు దున్నిన వాఁడఁట యొండు రెండు భ
ర్గుం డిది నిండు పౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్కతుంటవిలు దాలిచి [1]యంచున గండుతూపులన్ 604

ఉ. సూనశరాన నీ శరముఁ జొచ్చిన ధాతకు నీ మనోభరం
బానక [1]రౌప్యభూధరగుహాగృహ మీఁగిన శూలికిన్ ద్వదీ
యానమశౌర్యశక్తిహృదయంబునఁ బూను రమావిలాసికిన్
మానదువే రజంబును దమంబును సాత్త్వికమున్ గ్రమంబునన్. 605

క. మొనయంగనకా కటకట
మొనయం గనకాద్రిధరుఁడె ముదిత ను[1]పవనా
తను[2]పవనాతతి కొనఁగక
తనుపకా(?) మదనుని యుదంచితకరుణన్. 606

సీ. లోకత్రయీజయోత్సేకంబుఁ దెలుపు నీ
పడగ నారాయణప్రథమమూర్తి
రెం డంటనేయు నీ కాండచాతురికి [1]నా
ద్యనిదర్శనమ్ము వామార్ధజాని

---

600 – [1] క. కరణమె.
603 – [1] చ. గల్గ; [2] క. యల్లులం; [3] క. తివినౌ, చ. తానౌ; [4] క.చ. దే.
604 – [1] చ. యట్టున.
605 – [1] చ. కావ్య.
606 – [1] క. పవన్నా; [2] క. పవకా.

గాథనాళీకసంగ్రస్తుఁడై నేఁడును
నీ డాగుఁబూను వాణీవిలాసుఁ
డెక్కి త్రొక్కని చోట్లుఁ ద్రొక్కించు నీ యాజ్ఞఁ
గడవడుఁ బద్మినీకాముకుండు

తే.గీ. కాంత లన నెంత నీ యంత మునుని కింక
నళిచికురఁ బ్రోవవయ్య పద్మాక్షిఁ గావ
వయ్య శుకవాణిఁ గరుణింపవయ్య పూర్ణ
చంద్రముఖి నేలవయ్య[2] యో చక్కనయ్య. 607

ఉ. [1]గిల్లియు గోరఁ దీర్చు పనికిన్ మఱి గొడ్డలి యొల్లకే కదా
బల్లిదమైన సాధనముఁ బట్టక మన్మథ నీవు లోకముల్
తెల్లమిగా జయించితివి తియ్యని[2]విల్లునఁ గమ్మదూపులన్
జల్లని మంత్రి[3]చే శ్రుతిరసాయన మయ్యెడు [4]బంట్లయార్వులన్. 608

సీ. నీ విక్రమక్రీడ నిజహృదయంగమం
బై మెచ్చు శ్రీధరుం [1]డనుఁగుఁదండ్రి
నీ యాజ్ఞ[2] యొండననేరక ముద్రిత
వదనుఁడై వర్తించు వాగ్వరుండు
నీ తూపు కోర్వక నిటలాక్షుఁ డు[3]మతనూ
ఫలకంబు చాటునఁ బాయఁ డెపుడు
నీ బిరుదోక్తిచిహ్నితజయజంగమ
స్తంభమై యున్నాఁడు జంభవైరి

తే.గీ. యింకఁ దక్కిన బడుగుల నెన్న నేల
యిట్టి నీవెట్లు పసిబాల నేచుటెట్లు
పర్వతంబెత్తు కేలను బంతియెత్తి
కడిమి నెఱపంగఁ జూచితె కాయజన్మ. 609

క. విరివింటివాఁడవు గదా
శరణాగతులైన పాంథజనులను రక్షిం
తురు గాకిటుల నుపేక్షిం
తురె పైకముఁ గూడఁబెట్టఁ దొడగుచు మదనా. 610

---

607 - [1] క.చ. ఆద్యన్నిదర్శనము ; [2] క. గో.
608 - [1] ట. గిల్లియ ; [2] ట. వింటను ; [3] క. వై, చ. వే ; [4] ట. తేంట్లయార్వులన్.
609 - [1] క.చ. అనుఁగుఁబట్టి ; [2] ట. కొండన ; [3] క. నతన, చ. సుతమా, ట. మతను.

క. వలదు కొలదాఁకుఁ జుమ్మని
చెలువలు మఱుఁ గొనర విసరె జిలిబిలిగాడ్పుల్
జలజలన విరులుఁ దొరఁగెన్
గలకల మను శుకపికాళికలకల మెసఁగన్ 611

చ. అఱిమి రమాకుమారుఁడ వుదగ్రతలంబున వచ్చి నిల్చి న
[1]ట్లలిముఱిఁ దోఁచినం గువలయాక్షి వణంకి కణంకఁ దూలి మై
మఱచిన గంధగంధగిరిమా(రుత)పాతితవల్లికాభయై
యొఱఁగిన సంభ్రమించి చెలు లుద్గతబాష్పతరంగితాక్షులై 612

సీ. మోహాపదేశతమోముద్రితములైన
కనుదమ్ముల హిమంబు లునుపరాదు
శ్రమబిందుతారకాగమఖిన్నకుచకోక
ములఁ జంద్రనామంబుఁ దలఁపరాదు
శీర్యదాశావృత్తిశిథిలతాసులతాంత
మసియాడు వీవనల్ విసరరాదు
పరితాపపుటపాకపరిహీనతనుహేయ
[1]మిఁకఁ బల్లవపుటర్చి నిడఁగరాదు

తే.గీ. లలన కానంగకేలికీలాకలాప
సంతతాలీఢహృదయపాత్రాంతరాళ
పూరితస్నేహపూరంటు పొంగి పొంగి
చల్లని పటీరసలిలంబుఁ జల్లరాదు. 613

క. ఏమంద మేమిసేయుద
మేమందున మందలింత మేమందమ యిం
దే మందయాన [1]నడుగుద
మేమందఱ మనుచుఁ దరళహృదయాంబుజలై. 614

సీ. జవరాలి యడుగులఁ జివురాకు లంటించి
పాలఁతి యూరుల నంటి పొరలుఁ బొదివి
కొమ్మ చేదోయికెందమ్ములు హత్తించి
లేమ బాహుల మృణాళికలఁ బెనచి

612 - 1 క. అలిముఖి, చ. అరమిర.
613 - 1 క. మింకపల్లవటార్చి, చ. మింకపల్లవపిర్చి.
614 — 1 క. మ.

యతివ గుత్తపుగుబ్బ లలరుగుత్తులఁ గూర్చి
కాంత చెక్కులఁ జంద్రఖండము లిడి
కలికి క్రేఁగన్నులఁ గలువరేకులు గప్పి
లలన పెన్నెరుల వా లంటముడిచి

తే.గీ. నవనవగుణానుబంధబాంధవములైన
చలువ లెన్నేనిఁ గావింపఁ జెలువ చెలులు
నెలత విరహంబు మట్టున నిలువ దీఁకను
నించువిలుకానిఁ బ్రార్థింత మంచు నచట. 615

సీ. స్వర్ణకుంభములకు వర్ణలేపనముగఁ
జన్నులఁ గుంకుమం బలఁది యలఁది
వెడవిల్తు నలుగులు దొడయుటగాఁ గన్ను
లెడపక పన్నీటఁ దుడిచి తుడిచి
లేఁతతుమ్మెదలకు మేఁతగా విరిదమ్మి
పుప్పొడిఁ గురులపైఁ బోసి పోసి
నసుఁగుఁజుట్టములతో నాలింగనములుగాఁ
బసకరంబుల చిగు ళ్లదిమి యదిమి

తే.గీ. కప్పురపుధూళి మేనిపైఁ [1]గప్పి కప్పి
[2]విపులకదళీదళంబుల [3]విసిరి విసిరి
విరహపరితాపపతియైన వెలఁది కపుడు
చెలులు శిశిరోపచారముల్ చేయఁ జేయ. 616

సీ. బోటి మధువ్రతంబులకు దండమువెట్టి
మకరందమధురబింబమునఁ జిలికి
చెలి గంధవహుని కంజలిచేసి నెత్తావి
పూవుగుత్తు లురోజమున నమర్చి
నాళీబిసాహారపాళికిఁ బ్రణమిల్లి
నవమృణాళముల బాహువులఁ గూర్చి
నకి కెందలిరుడిందులకు వందన మొనర్చి
చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చి

---

616 — [1] ట. గుప్పిగుప్పి ; [2] క. విప్రవ ; [3] ట. వీచివీచి.

తే.గీ. సరగ నిటు లందఱు[1]ను మీ ప్రసాదమనుచుఁ
బంచసాయకదేవతాబలమునెల్ల
వేడుకొని తగినట్లు గావించి రపుడు
చంచలాక్షికి శిశిరోపచారవిధులు. 617

ఉ. పత్రము పుష్పమున్ ఫల [1]ముపాయనమిచ్చి భజించువార మీ
మాత్రమునం బ్రసన్నులయి మానినిఁ గన్గొనరయ్య మీ కృపా
పాత్రము గాఁగ నంచుఁ దగు భంగి పికంబులఁ దేంట్లఁ జిల్కలం
బత్రము పుష్పమున్ ఫల ముపాయనమిచ్చి భజించి నెచ్చెలుల్. 618

సీ. అఱుతఁ గీలించిన యాణిముత్తెపుఁబేర్లు
హరినీలహారంబులై తనర్చెఁ
దనువల్లి నలఁదిన ధవళచందనచర్చ
లీలఁ గాలాగరులేపమయ్యెఁ
గరముల మెత్తిన కర్పూరరేణువు
కస్తూరికారజఃకణములయ్యె
సెజ్జపైఁ బఱచిన చేమంతిరేకులు
కలయ నిందీవరదళములయ్యెఁ

తే.గీ. చిత్తజాతుఁడు తనమాయఁ జేసినాఁడొ
మనమనంబుల విభ్రాంతి మట్టుపడెనొ
కమలలోచనపరితాపగౌరవంబొ
యనుచు వెఱగంది మదిఁ గుంది రబ్జముఖులు. 619

మ. పటికి న్నార్చినలీలఁ జందనము పైపైఁ బూయ నంగారక
చ్ఛటలం గాయుతెఱంగునం జిగురుసెజ్జం బొర్లఁగా నప్పుట
ప్పుటికిం [1]జేపడ నిచ్చి [2]నట్లొడలిపై పన్నీరు చల్లంగ ను
త్కటమయ్యెన్ వెనుగాఁక బంగరునలాకన్ బోలు నబ్బాలకున్. 620

సీ. ముద్దియ యెడగల్గు మోహంబు మఱచితే
కారించెదేల రాకాశశాంక
మగువ నీకిచ్చిన మాటపట్టెఱుఁగవే
యించుక కృపసేయవేల చిలుక

---

617 — 1 ట. మహా.
618 — 1 ట. భక్తినొనంగెడువారమింతయా.
620 — 1 ట. జేరఁగ; 2 క. నందొరరిపై.

కోమలాంగికి నరగుత్తుకయై [1]యుండి
కలకంఠమా! కనికరము లేదె
చెలి మోముఁదమ్మితావులు గ్రోలుచుండియు
గుడిచినింటికిఁ గీడుఁ గొలుపఁదగునె

ఆ.వె. [2]కాలమెల్లఁ బగలుగా వచ్చె నదె మీకు
కొమ్మ నేఁచఁదగునె కోకయుగమ
రమణి[3]కీవునంతరంగమైయుండియు
మలయవయ్యె యిట్లు మలయపవన. 621

ఉ. పైకొని వచ్చెదేల నినుఁ బాము దినం జలిగాలి! ప్రార్థనల్
గైకొనవేల చంద్ర! నినుగా మధుపం[1] జెలవేది ప్రేలెదో
కోకిల! యేటికిట్లు నినుఁ[2] గొ్త్తఁబడం దపళాక్షి సేయు నీ
పాకముఁ దప్పవేల నినుభస్మముగా వలరాజ! యిత్తఱిన్. 622

తే.గీ. తలఁప దోషాకరుండ[1]వె తగినప్రాపు
సహచరుఁడు జాతిమాలిని చైత్రుఁ డట్టి
యెప్పుడును నీవు నీ యెడ లెఱుఁగ వింక
మదస మఱి యేమిచెప్ప నీ మధుపగుణము. 623

క. చిచ్చునకు గాడ్పు తోడై
వచ్చిన గతి మరున కబ్జవైరియుఁ దోడై
వచ్చె నడియాన వలదిఁక
మచ్చికఁ దలపోసి నన్ను మది మరువుడిఁకన్. 624

ఉ. నిప్పులకుప్ప మింటనదె నెచ్చెలి. కాదది చంద్రబింబమో
యప్ప యదేల మీఁదఁ బొగ[1]యంగన కాదది పైకళంకపుం
గప్పు తపింపఁజేయునటె కల్వలతేఁ దతఁడేల సేయు నీ
ముప్పిరిఁగొన్న[2] తాపమున మోహము నొందకువే తలోదరీ. 625

తే.గీ. పథికసంహారనిజపాపఫలమువలన
దినదినక్షయ[1]మునఁ జూడఁ దేటి పోయి
విరహిజనపాపఫలమున వీఁడు మఱల
ననుదినంబున కభ్యుదయంబు[2] నొందు 626

---

621 – [1] ట. యుంచి ; [2] ట. వాల ; [3] క. చ. ట. కివె.
622 – [1] ట. మెలపేది ; [2] క. క్రొత్త.
623 – [1] క. టే.
625 – [1] క. కారడియుంబొగ, చ. కావడిపొగ ; [2] ట. తాపమున.
626 – [1] ట. వలనఁగద ; [2] ట. బొందు.

తే.గీ. హాలహలమునకంటె నీ యమృతకరుఁడు
దుస్సహుం డను[1]బుద్ధినిఁ దోఁచె నాకు
మృడుఁడు హాలాహలము దక్క మ్రింగెఁగాని
వీని మ్రింగియు రాహువు వెడలఁ[2]గాసె 627

క. నిజ మెఱుఁగలేదొ లోకము
నిజగురుతల్పగుని యామినీపతి వీనిన్
ద్విజరాజనుచును బేర్కొను
గజగామిని నేతిబీర[1]కాయయుఁ బోలెన్ 628

సీ. పుట్టంద్రు గొందఱు పుట్టయే మఱివృద్ధిఁ
బొందకుండఁగ హాని పుట్టవలదె
వటమంద్రు గొందఱు వటమేని నూడలుఁ
జారి మండలమెల్లఁ బ్రబలవలదె
మృగమంద్రు గొందఱు మృగమేనిఁ దిగనీక
మృదుకరాంకురములు [1]మేయవలదె
శశమంద్రు గొందఱు శశమేని దేవతా
పథికుల [2]యిరవు [3]మాపంగవలదె

తే.గీ. [వీని]లో నొక్క టెద్దియొ వింత[4]గల్గి
యుండియును జెడకున్న వాఁ డువిద వీఁడు
ధర్మ[5]పరుహేతువునఁ గీడు దాఁకుగాని
పాపపరుఁ దాఁక దనియెడు పలుకు నిజము 629

శా. క్రీడామందిరజాలమార్గముల చక్కి న్నిక్కి జాబిల్లిరా
గోడల్ నీరుగ జాఱఁద్రోఁచి[1]తివెతళ్కుల్ సొచ్చి [2]విన్నాణమై
నాడెన్ గోమలి యోర్వలేక వలవంతన్ బద్మినీజాతికిన్
గీడౌ నుగ్రశిఖామణిం బలికె నక్షీణానులాపంబులన్ 630

శా. రాజీవాక్షుల నేఁచు పాతకివి చంద్రా రాజవా నీవు నీ
రాజత్వంబునఁ జక్రముల్ మనియెనో పంజిల్లితత్సంతతుల్
తేజం బొందెనొ డిందెనో యహిభయోద్రేకంబుఁ దాఁ జెల్లఁబో
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే 631

627 — [1] ట. దృఢబుద్ధి ; [2] ట. గ్రాయు.
628 — [1] ట. కాయంబోలెన్.
629 — [1] క. మేవ ; [2] ట. కిరవు ; [3] చ.ట. మార్పంగ ; [4] క. గిల్గి ; [5] క.చ. పథ.
630 — [1] క. తెతకుళుక్కల్. చ. తేతళుక్కల్ ; [2] క. వెన్నాణమై, చ. వెన్నాడమై.

ఉ. ఇంతుల నేఁచు పాతకము లింతటఁ బోవదు సుమ్ము పాంథలో
కాంతక నిన్ను ఘోరతమమై ఘనమై యజహత్కళంకమై
వంతలఁ బెట్టి యారు[1]పది వక్కలు సేయక పూర్వపక్షపుం
[2]గంతుల కేమి చూచెదవుగా తుది నీ బహుళార్తిభేదముల్ 632

సీ. కమలించెఁగాక యంగజవిరోధిశిరోధి
తలకెక్కఁజాలెనే హలహలంబు
కాచెఁగాక పయోధికాండప్రకాండంబు
పైకిఁబొంగించెనే బాడబంబు
తూరెఁగాక ముకుందతుంద[1]ప్రఘాణంబు
వెడలెనే యెదగాలి విపినకీలి
యణచెఁగాక శిలోచ్చయచ్ఛదాహంకృతుల్
గఱచెనే నీరుగా సురపహేతి

తే.గీ. నీ కరణి నిట్లు దయలేక లోకమేర్చు
నీ కరణియై యల యత్రినేత్రమునకు
ఖరకరాలోకగాఢనిష్ఠురతపోగ్ని
వెడలి పడకున్కి భరమె కృపీటజన్మ 633

మ. విషరాశిం [1]జనియింపవో విషసహావిర్భూతి వాటింపవో
[2]విషభృన్మార్గము నంటవో విషధరు ల్వేష్టింపఁ గాలూదవో
విషభుక్ఫాలికిఁ బిన్ననాఁడె గనవో విఖ్యాతకౌటిల్యమున్
విషమం బెట్లగు నీకు జీవకృతవిద్వేషంబు దోషాకరా. 634

మ. కమలాభర్త భవద్విరోధిపయిఁ జక్రంబున్ బ్రయోగింప సు
త్తమశస్త్రంబది యాత్మనామకభిదాదర్పాంధు నిన్నున్ మొఱం
గి మహారాహువుఁ దున్మి [1]యున్మనుపదక్కెంగాక చక్రంబుచేఁ
దుమురై పోవనివారలుం గలరె నీ దోషంబు గాదే శశీ 635

ఉ. కొండొకసేవు నిన్ను మదిఁగూర్చిన మాధవునంతవానికిన్
బండె వధూవధప్రబలపాతకజాతకళంక మింక నీ
దుండగ మేమిసెప్పనగుఁ దోయజవైరిశిఖండవీథి సి
ఖండముఁ బూను శంకరుఁ డఖండజగన్నుతనుండు గాఁడొకో 636

---

632 — [1] క. పడి ; [2] క. గుత్తుల.
633 — [1] క. ప్రవాణంబు.
634 — [1] జనియించితో ; [2] క. వృషభృన్మార్గము.
635 — [1] క. యుంచనుమెంగాక.

శా. ఈ వబ్జుండవు నీటఁబుట్టితివిజుమ్మీ యంచు మోమోటపుం
దోవల్ సెప్పఁగ సిగ్గుగాదె మఱి నీ తోఁబుట్టు శ్రీదేవి లీ
లావాసంబు సిరుల్ హరింతు వనుచో నయ్యో కళాదుండు చే
తోవీథిన్ సహజాధనాపహరణోద్యోగంబు సేఁగించునే 637

తే.గీ. నీరజారాతి నినుఁ దననెలవు గూల
నేల సృజియించె విధి సృజియించెఁగాక
[1]యేల జైవాతృకునిఁ జేసె నేల తప్పఁ
బుడమిఁ బాపిచిరాయువన్ [2]బెడఁగునుడుగు 638

సీ. వలరాజ మును మ్రానితొఱటలోఁ బుట్టితే
కరుణలే కీ ముగ్ధఁ గణఁగి యేయఁ
దుహినాంశ యింతుల[1]తోఁ బుట్టవే యిట్టి
శీతము వాటించి చెలువ నొంపఁ
గోయిల మింటిపైనే [2]యుట్టిపడితివే
దయమాలి కూసి యీ తరుణి నొంపఁ
జిలుక యెన్నఁడును నింతులమోము చూడవే
పరుసము ల్పలికి యీ బాల నొంప

ఆ.వె. ననుచు సఖులు రాజతనయకు శిశిరోప
చారవిధులు సేసి చాల రోసి
యేయుమదనుఁ గాయునిందుఁ గూయుపికంబుఁ
బలుకుచిలుకఁ బదరి పలికిరంత. 639

మ. చిలుకా పల్కకుమీ లతాంత[1]శరుఁడా చెల్వొం గృపంజూడుమీ
యలులారా మొరపంబుఁదక్క నిలుడీ యాలోలమందానిలా !
[2]కలగందోలకుమీ పికప్రకరమా కంఠధ్వనుల్ [3]నల్లడం
జెలగం గూయక తక్కుమీ యనుచు రాజీవాస్య [4]లుద్భ్రాంతలై. 640

ఉ. కూయుటమానరయ్యా మగకోయిలలార మొఱాలకింపరే
కాయుటదక్క చంద్ర చిలుకా పలుకాగి యొకింత నిల్వుమీ
మ్రోయకు మో మధు[1]వ్రతమ మ్రొక్కెద మెప్పుడు నీకు భక్తిమై
నేయక కాయవేల దయ నిక్షుశరాసన పుష్పకోమలిన్. 641

638 – [1] క. నల ; [2] చ. బెతద.
639 – [1] క. తోఁబుట్టువై ; [2] క.చ. యుండినుమకెం.
640 – [1] క. నఖుఁడా ; [2] ట. కలయంబాఱకుమీ ; [3] ట. నద్దైసం ; [4] ట. లుద్భ్రాన్తులై.
641 – [1] క.చ. వ్రజము.

ఉ. పాఱెడుఁ గన్ను నీ రుడుగఁ బాఱెడు నిశ్వసనంబు వెల్వెలం
బాఱెడు నాననంబు గరుపాఱెడు నంగము [1]తట్టుముట్టనన్
బాఱెడుఁ గేర్పు లేచి పయిఁ బాఱెడుఁ గాయజువహ్ని యింక నే
యూఱట నిల్చు జీవమని యుగ్మలిఁ జూచి సఖుల్భయంబునన్. 642

ఉ. అక్కట యేదు[1]వత్తివిగదప్పు దురంతవిషాదవేదనం
బొక్కెడవచ్చు పాదములఁ బుప్పొడియొత్తుచుఁ జందనంబు నీ
రక్కున మోమునన్ గలయనల్కుచుఁ గోమలి మాయకాముడన్
దెక్కలికాని బారిపడితే యని కుత్తుకనంటి చూచుచున్. 643

సీ. చనుదోయిఁ [1]బొదివిన జలజపత్త్రంబులు
రవరవ [2]రజనయై రాలిపోయెఁ
గర్ణావతంసంబు కలువలు [3]కన్నీట
[4]నుఱసి రేకులపట్లు ముఱిసిపడియె
నురముగంధంబు చిట్టుడుకు[5]వట్టిన [6]నుబ్బి
[7]యందంద మీఁద వేరాపులెగసె
హారవల్లికలుగా నమరించిన మృణాళ
కిసలయంబులు [8]విచ్చి [9]గిజరులయ్యె

తే.గీ. జిగిఁదలిర్చిన క్రొమ్మావిచిగురుఁబఱుపు
[10]వెట్ట పెట్టిన చందాన నట్టగట్టె
నగ్ని కాజ్యాహుతులుఁ బోసినట్టివయ్యె
నకట విరహానలమునకు శైత్యవిధులు. 644

తే.గీ. కొమ్మ విరహాగ్నివేదనకోలఁది[1] చేతఁ
బదతలంబున [2]నిండించు [3]ప్రసవరజము
మంగలంబున వేఁచిన మాడ్కి [4]వెడలెఁ
బెక్కు సఖులకు నరచేతఁ బొక్కు లెగసె. 645

ఉ. అంగన గుబ్బచన్మొఱుఁగుటద్దపుఁగాఁకఁ బసిండికుండలం
బొంగఁదొణంగెఁ జొబ్బిలఁగఁబూసిన గంధపుఁదాపవహ్ని నం
పంగికటారివీరునకుఁ బాలును బియ్యము లేక పొంగలో
పొంగ లటంచు నయ్యలరుఁబోఁటులు సారెకుఁ గేలిసేయఁగన్. 646

642 – [1] ట. తట్టుముల్పయిన్.
643 – [1] క. వత్తితి.
644 – [1] ట. బొందిన; [2] ట. రజములై; [3] ట. కన్నీళ్ల; [4] క. నులిసి; [5] క.చ. వచ్చి; [6] ట. బొంగి; [7] ట. యందుదుమారమై యావులెగసె; [8] ట. పచ్చి; [9] ట. గిజ్జడయ్యె; [10] క. పిట్ట, చ. పిట్టు, ట. పెట్ట.
645 – [1] ట. యెద్ది; [2] ట. నిగిడించు; [3] క.చ. ప్రజవ; [4] చ.ట. దెరవె.

క. ఎంతెంత శిశిరకృత్యము
లంతంతయు విరహవహ్ని యధికము గాఁగాఁ
గాంత తన చెలులఁ[1] జింతా
క్రాంతలగాఁ జూచి పలికెఁ గన్నీ రొలుకన్. 647

మ. విసరం జూడకుఁడమ్మ పువ్వుసురటుల్ విశ్రాంతిమూలంబుగా
ననువుల్[1]వాపుఁ దదంతరాంతరనితాంతామోదహేలాలతాం
తసమాక్రాంతకృతాంతకూపపవమానప్రేంఖణప్రక్రియా
వనరోదంచితచారుసౌరభరసవ్యాలోలరోలంబముల్. 648

ఉ. మూఁకలు గట్టి మన్మథునిమూలబలంబులు చుట్టిముట్టి య
ఱ్ఱాఁకలఁ బెట్టి నొంప వగ నందెడి నాకిది గోరుచుట్టుపై
రోఁకటిపోటు సూపుచు సరోరుహలోచనలార తూర్పునం
బ్రాఁకెడుఁ జూడరమ్మ సితభానుమహోష్ణమరీచిమాలికల్. 649

ఉ. క్రొన్ననవిల్తుబారిఁ బడి గుందుచు నోర్వఁగఁ జాలకున్న యే
గ్రన్నన జాజిక్రొవ్విరులకత్తులపైఁ బడఁ[1] జావు దప్పె నీ
వెన్నెలమంటఁ జొత్తు నరవిందదళాయతనేత్రలార మీ
మన్నన లెల్ల[2]నుం దలఁచి మక్కువ నన్నిఁక మర్వకుండుఁడీ. 650

ఉ. ఎప్పుడు ప్రాచియంద యుదయించెడు చల్లనిచందమామ నేఁ
డిప్పుడు చొప్పుదప్పి[1] యుదయార్కునిమంటలు మింటనంటెనో
యప్ప! మహోగ్రవేషమదె యల్లదె చూడుఁడు తూర్పుకొండపై
నిప్పులకుప్ప దోఁచెఁ బయినెక్కొనియున్న విధూమరేఖలున్. 651

ఉ. ఉల్లము తాల్మిపొత్తు మనమొల్లదు చెల్లదుగాక నాయెడం
బల్లిదుఁడైన కంతునకు బాసటయై[1] చనుదెంచె రోహిణీ
వల్లభుఁ డేమిచెప్పఁ బగవారికి దైవము చుట్టమయ్యె నీ
వెల్లులు చూడరమ్మ యిదె వెన్నెల మిన్నులమీఁదఁ బాఱెడున్. 652

చ. మనమునఁ బొంగి రేపు మునుమాపును డాయుచు రామరామ ర
మ్మని [1]యదలింప నాకె తమయాగ్రహభాషలు చూపి చూపి యే
పనని తొణంగె నింతయును బాముల కూనలఁ బాలుపోసి పెం
చిన కథ వచ్చె నీ కలికిచిల్కలఁ బ్రోఁచుటలెల్లఁ గోమలీ. 653

647 — [1] ట. చిత్తక్లాంతియుఁబడుపాటు.
648 — [1] ట. వోవ.
650 — [1] క. జూపదప్పె; [2] ట. ఁబో.
651 — [1] చ.ట. యెదయెత్తని.
652 — [1] ట. చనునిల్చె: [2] ట. బ్రాఁకెడున్.
653 — [1] చ.ట. చదిబావ.

ఉ. కూయఁగనిమ్ము కోయిలలఁ గోపముఁ దీఱఁగఁ బువ్వుదూపు లి
ట్లేయఁగనిమ్ము మన్మథుని నియ్యెడ[1]వేడగ నీకు నేటికిన్
మ్రోయఁగనిమ్ము తుమ్మెదలఁ గ్రూరతమై నను నేచుటెల్లఁ దా
రీ యుదయించు వెన్నెలపయిం బడునంతకుఁ గాదె కోమలీ. 654

సీ. విరహులపైఁ జల్ల [1]విషచూర్ణ మొనరించి
పట్టిన దంతంపుభరణి వోలెఁ
దెప్పించి పాంథులఁ దెగటార్ప శశికాంత
శిల మటించిన వధ్యశిలయుఁ బోలె
గాంతాపరాధులఁ గౌముది [2]నిగిడింపఁ
బెట్టిన పటికంపుబిందె వోలె
వెస వియోగులఁ దెగ[3]వ్రేయఁ బుల్లడిగించి
నిలిపిన గం[4]డగొడ్డలియుఁ బోలె

తే.గీ. ముదురువెన్నెల గిన్నెల ముంపవచ్చు
కరణి [3]నుత్ఫుల్లకాశనీకాశ యగుచుఁ
[4]దేలి బాఱ మధ్యందినాదిత్యుఁ బోలె
[5]చంద్రుఁ దప్పక చూచె నా చంద్రవదన. 655

క. పుడమిజనంబులు వెన్నెల
వడవడు నను మాట నిక్కువంబై యుండన్
ఉడురాజదీధితులఁ దిరు
గుడువడి తపియించి పలికెఁ గోమలి యంతన్. 656

సీ. తన రశ్మినొల్లక తనవారిలో మను
తమ్ములఁ జెఱచు పాతకుఁడు వీఁడె
చదువంగఁబోయి యాచార్యుని[1] భామకుఁ
గడుపుచేసిన దోసకారి వీఁడె
[2]హరిణాంకమనెడు పే[3]రవసరం బగు నల్ల
[4]గొట్టువట్టిన చెడుగొట్టు వీఁడె
[5]పదియేనుదినముల బ్రదుకుకై నరివాని
దినినాథు నాశించు తిరిప వీఁడె

---

654 – 1 ట. దూఱఁగ.

655 – 1 ట. విషపుఁజూర్ణమునించి; 2 క. నిఱింప. చ. పీడింప, ట. దొడికింప, 3 క. నత్ఫుల్ల; 4 చ. దెలిబార, ట. దెల్లవాటి; 5 ట. దనరుశశిఁజూచెనబ్జలోచనభయమున.

తే.గీ. తనదు [6]ఘాతకుఁ గాక కాతపత[7]నొంద
[8]నిరుల బొరియల డాఁగిన [9]విరహిజనుల
చొప్పు[10] కనిపెట్టుకొని [11]చురుచూండ్లు చూడఁ
గుసుమబాణుండు దెచ్చిన కొఱవి వీఁడె. 657

క. విషధియఁట జననభూమియు
విషధరమౌళియఁట తనకు విడిదియును మహా
విషమతరహాలహలదు
ర్విషమఁట తోఁబుట్టు వితఁడు విషమగు టరుదే. 658

సీ. తనకు బాడబమహాదహన[1]సంగతఘోర
మకరాకరంబు జన్మస్థలంబు
తన సహోదరులు కాధంబరీనామహా
లామహాభీలహాలాహలంబు
తన శరీరముఁ గ్రొచుకొనుట తీవ్రకఠోర
హరిదశ్వకిరణభిక్షాటనమునఁ
దనకు నంతతపాంథజనహర్త పాపిష్ఠి
యంగహీనుఁడు గూర్మిసంగడీఁడు

తే.గీ. పద్మినికిఁ గీడొనర్చెడు పావజాతి
చక్రవాకవియోగాగ్నిసామిధేని
విరహిజనములపాలిటి వేరువిత్తు
దురితములకేల [2]తానోడుఁ దుహినకరుఁడు. 659

సీ. భద్రకాళీభర్త పదతలాహతి బల్లి
పర వోలె [1]నెపమారఁ గ్రాఁమడయ్యె
దక్ష[2]శాపజమైన యా క్షయవ్యాధి ని
ర్జీవిగా నాశిలఁ జేయుదయ్యె
నమృతమంతయుఁ ద్రావి యంకసారంగంబు
బింబమెల్లను నిండఁబెరుగదయ్యె
నాచార్యుఁ దనక భార్యకుఁ దప్పినప్పుడు
[3]పాడుగఱ నీరంకుఁ బొడవదయ్యెఁ

---

657 - [1] ట. కులభామ ; [2] క.చ. హరిణాంకుడను ; [3] క.చ. రబనరంబగు ; [4] క.చ కుష్ఠబట్టిన ; [5] చ. పదియైదు. ట. పదునైదు ; [6]కాంతకుఁగాగ ; [7] చ.ట. నొంది, [8] ట.విరుల ; [9] ట. విరహిజన్ము ; [10] ట. వడిపట్టుకొని ; [11] ట. చుఱచూళ్లు.
659 - [1] ట. నంతత ; [2] ట. నాయోడు.

తే.గీ. ప్రథమకళ యారగించెడి పావకుండు
మీఁగడయుఁబోలెఁ గడిసేసి మ్రింగఁడయ్యె
నేల యిటుసేయుఁ బాంథుల ఫాలవీథి
వనజగర్భుండు వ్రాసిన వ్రాఁతఫలము. 660

మ. జననం బొందితి దుగ్ధవారినిధి నా సర్వేశు జూటంబుపై
జను లేప్రొద్దుఁ బ్రశంససేయ నవతంసంబైతి నీ ప్రాభవం
బునకుం బాంథజనాపహారియగు నాపూవిల్తునింగూడి వా
రని దుష్కీర్తిగఁ దిట్టునంబడకు చంద్రా! రోహిణీవల్లభా! 661

తే.గీ. మతివిహీనత మున్నన్న మాటలెల్ల
నెగ్గు [1] పట్టక నన్ను మన్నింపుమనుచుఁ
గన్నె వెన్నెలవేలుపుఁ గడు నుతించి
తన్ను నలయించు కంతునిఁ దలఁచి పలికె. 662

సీ. వానిఁ [1]దప్పించితి వనజాసనునియంత
వానిఁ [2]గూఁతురునకై వాసి చెఱచి
దోషంబు గట్టి తిందునియంతవానికి
[3]గురుకళత్రంబుపై మరులు గొలిపి
పలుగోడిఁజేసితి పాకశాసనునంత
వాని నహల్యకై [4]వలపు గుడిపి
[5]వెరపు వెట్టితి పరాశరునంతవాని న
ట్టేటఁ బామరకన్య [6]కాటుమఱపి

తే.గీ. నీ ప్రతాపంబు లెన్ని యెన్నికకు లేవు
తొడిబడితి నాటదాన నీ తోయమునను
నన్ను మన్నించి రాజేంద్రునకు మటింపు
మయ్య వెఱతును మదన జోహారు నీకు. 663

సీ. పాపకన్యలు మేఁతపట్టి పోవిడుచు[1]చో
వెన గాడ్పుతెక్కలు విఱిగెనేనిఁ
గలక మామిడిపండ్ల గలజీడి [2]మదకిర
పోతంబు నాలుక పొక్కెనేనిఁ

---

660 – [1] క.చ.ట. నవమార; [2] ట. కోపఱ; [3] క.చ. పొడువడుగని, ట. పొడవఱసీఱంకు.
662 – [1] చ. పెట్టక.
663 – [1] క. దట్టించి; [2] ట. కిఁగూతురువలపుగఱపి; [3] ట. బర; [4] ట. వాసిచెఱచి;
[5] ట. నెరసు; [6] ట. గాటువఱపి.

జంపకప్రసవవానన సోఁకి యెలదేఁట్లు
[3]కూలి విల్వీల దన్నుకొనియెనేని
నిగురుమేఁతల నొగరెక్కి [4]కోయిలలకు
[5]వడిరొమ్ము గడిసిలఁ బడియెనేని

తే.గీ. తియ్యవిలుఁ జీమగమి దొల్చి తినియెనేనిఁ
పొదలి నా వేఁడియూర్పులఁ బువ్వుఁదేరు
[6]కమలిపోయిన నుడుగు నీ గర్వరేఖ
విషమసాయక విచ్చేతు [7]విడిది కపుడు. 664

సీ. ధూర్జటి కోపాగ్ని ధూళిగాఁ [1]గాలిన
నాఁడేల నీ యమ్ము[2] వాడిలేదు
వాడికోఱల రాహు[3]వడిఁద్రొలిఁ గఱచిన
నాఁడేల నీ రశ్మి వేఁడిలేదు
శాపంబు శ్రీరామభూపాలుఁ డిచ్చిన
నాఁడేల కూయరో పోడిగాను
[4]చంపకంబుల కర్గి గుంపెల్ల డుల్లెడు
నాఁడేల మ్రోయరో నేఁడు మీరు

తే.గీ. మగువ [5]యొంటినుండ మగటిమి [6]వాటిల్లి
యేయఁ గాయఁ గూయ మ్రోయ నగునె
మదన! చంద్ర! పికమ! కొదమతుమ్మెదలార!
నాఁడు నాఁడు నాఁడు నాఁడు లేరె. 665

ఉ. నీ విలు నేలపాలుగను నీ శరముల్ తలవిచ్చిపోను నీ
సేవకులెల్లఁ గారడవిఁజెందను నీ ధ్వజ మబ్ధిలోఁబడన్
నీ వలిదేరుఁ బాము దిన నీ మెయి భగ్గునమండిపోను నీ
కావరమేల కొమ్మఁ గసికండలు సేయకు రోరి దర్పకా 666

చ. ననవిలుకాఁడ! మన్మథ! యనాథవధూవధపాతకంబు నిన్
గొనిముసిగించుఁ గ్రూరహరకోపకటాక్ష శిఖిస్వరూపమై
మనమున నిట్లు నిర్దయత మానవు [నీవొగి నే] ముహూర్తవే
ళను జనియించితో యకట లచ్చికి నమ్మథుకైటభారికిన్. 667

---

664 — [1] క. చు ; [2] ట. మధుకర ; [3] చ. కాలవిజ్జున ; [4] చ. కోకిలకును ; [5] చ. నడి ; [6] ట. గమరెనేటట్టబయలగు ; [7] ట. విడిదలకును.

665 — [1] ట. గ్రాఁగిన ; [2] క. వాడ ; [3] ట. వడ ; [4] ట. జనుపకములకర్గికనుకనిజల్గిన ; [5] ట. బాయుటెఱిఁగి ; [6] ట. వాటించి.

తే.గీ. అనుచు ననవింటి పెనుదంట నంటరాని
గంటసము లాడి మఱియు నమ్మంట[1]మారి
గలయ నెక్కించుకొనివచ్చు మలయనగభు
జంగవిషదిగ్ధ[2]పవనుపై చలముఁ[3] బొదలి. 668

క. తెమ్మెర నీ కెంతెమ్మెర
గమ్మనివిలుకానిదొరవు గమ్మని నెలఁ బై
రమ్మని యలిపికశుకనిక
రమ్మని గా [1]నిలిపె ముందఱఁగ వచ్చితివా. 669

క. వలపెక్కడ లేదా యీ
యలికుంతల తలనె వేగెనా యా[1]వలికిం
జలిగా[2]లిఁ దోలి విడువుము
చెలి మిక్కలి మనసుపేద శీతలపాదా! 670

చ. కిసలయశయ్య[1]మీఁద నొకక్రేవ వధూమణి [2]యున్నయంతఁ ద
త్కుసుమ[3]నవాంగమంటికొని క్రొత్తవిరుల్ గనుపట్టె [4]రమ్యలై
మొసలిసిడంబువాని పువుములుకులు నాటినఁ బోటుగంటులన్
రసగిలి పేరఁబడ్డ రుధిరంబుల [5]యోడిక తండమో యనన్. 671

క. ఇత్తెఱఁగున నబ్బాలకి
చిత్తజశరజాతవహ్నిచేతను దన మే
నుత్తలముఁ బొంద నొయ్యన
నెత్తిన తలపోఁతఁ జెలుల కిట్లని పలికెన్. 672

క. ఎల్లసుఖంబులు చేకొనఁ
జెల్లుట యౌవనమునంద చిక్కిన మఱి పా
టిల్లునె వెన్నెల దినములె
యల్లోనేరేండ్లు గాక యావల గలవే. 673

తే.గీ. అడవిఁ గాసిన వెన్నెల యయ్యె నాదు
జవ్వనం బా నృపాలుతో సరసలీల
భావజోపభోగము లందఁ బడయనైతి
నీ నితాంతతాపంబు వన్నెల సైచు. 674

---

668 — [1] క. మారి ; [2] ట. శరము ; [3] ట. పొదల.
669 — [1] క. ని.
670 — [1] క.చ. చలిక, [2] ట. వఁద్రోచి.
671 — [1] ట. డిగ్గియొక ; [2] ట. నిల్చియుండ ; [3] ట. మపాంగ ; [4] ట. నెంతయున్ ; [5] ట. పోడిక.

తే.గీ. వరునఁ బ్రాణంబు లెటువంటివారికైనఁ
బ్రాతియగుఁగాన నాతనిఁ బాయలేని
నాదు ప్రాణంబు నిలుపుడీ నమ్మినట్టి
వారి విడుచుట దోసమౌ వనితలార ! 675

ఉ. అక్కట వెట్టులార ! నను నాతనిపాలికిఁ బుచ్చుటొండెఁ దా
నిక్కడ వచ్చునట్టి తెఱఁగెయ్యది చేయుఁడు చేయరేని నా
కెక్కడి జీవ మేటియొడ[1] లివ్వెడమాయములెల్ల నారటం
బెక్కుడు సేయుఁగాఁగడచునే వల దుండుఁడు శీతలక్రియన్. 676

క. చారుసహకారపరిమళ
భారభరాభుగ్నమలయపవనము లలయన్
బేరామని మీరేమని
యారామనివాసఁ జేసి యలఁచెద రబలన్. 677

చ. పలుచని సన్నగావివలిపంబులు వెన్నెలనీటఁ దోఁచి యీ
కలికి మెఱుంగుఁజన్నుగవఁ గప్పి మరందరసంబు పైపయిం
జిలుకుచు మొల్లపూసురటిచే [ మెల ] మెల్లనె సేదదీర్పుఁడీ
తలకొని కాయుఁడీ మదనతాపముఁ గోమలి నంటకుండఁగన్. 678

మ. మనసారంబు సుగంధసారజలముం గస్తూరి మేదించి యి
య్యన వేఁజెక్కుల నక్కునం దనువుఁడీ యందంద పాదంబులన్
దనువున్ బుప్పొడి యొత్తుఁడీ మదనసంతాపంబు దీపించి భు
గ్గన నుప్పొంగినయేనియుం దుడుపుఁడీ కన్నీరుపన్నీరునన్. 679

చ. పలుకదు చూడదీ యబల ప్రాణము సందియమంచు నాత్మలన్
బలుకులు మానుఁడీ చెలులు ప్రాణవిభుండు నృపాలరత్న మీ
చెలువకు నాతఁడున్నకడఁ జేరిన నీ లలితాంగి ప్రాణమా
చెలువుఁడు వచ్చెనేని సరసీరుహనేత్రకు వచ్చుఁ బ్రాణముల్. 680

ఉ. సంగడితోడ నాదు నృపసత్తము వన్నెలు దీని విన్న ము
న్నంగడివైవఁ జాతురను నా వెఱపెంతయుఁ జాల దానిపై
నంగజుఁ డొప్పఁ డేమఱకుఁడమ్మ తలోదరిచొప్ప మాధవీ
సంగతమల్లికాభవనజాలకపాటలచంద్రరోచులన్. 681

తే.గీ. పద్మగంధికి మదకీర భాషిణికిని
రాజవదనకు నా సఖీరత్నమునకు
సుందరాంగికి నా తత్నసుందరికిని
సేమమే యని పల్కు నచ్చెలులు వలికె. 682

---

676 — [1] క. చ. లివెత.

క. అనుమాన మేలచెప్పెద
వినుమా నలినాక్షితెఱఁగు వేమఱు మదిలో
నను మానవాధినాయక
నిను మానక తలచుచుండు నిశ్చలవృత్తిన్. 683

తే.గీ. చెలువ నినుఁబాయుటయె తప్పుసేసె మరుఁడు
చెఱకుసింగిణి గొనయంబు చిఱుతతేంట్ల
నారి యెక్కించి పుష్పబాణంబు నేసె
సుముఖి నంతంతకును భోగవిముఖిఁ జేసె. 684

సీ. పూఁబోఁడి తనువునఁ బూయదు మృగనాభి
చంద్రమిశ్రితసాంద్రచందనంబు
సరసీరుహాక్షి కుచస్థలిఁ బూనదు
విమలముక్తాహారసముదయంబు
రాజాస్య కబరీభరంబునఁ దుఱుమదు
సురుచిరనవ్యప్రసూనములను
మదగజగామిని చదివింపనొల్లదు
నిద్దంపువేడుక ముద్దుఁజిల్కఁ

తే.గీ. ప్రోదియంచల నడిపింపఁబోవ దబల
నెచ్చెలులఁగూడి యాడదు నీలవేణి.
వీణె వాయింపనొల్లదు విద్రుమోష్ఠి
మించుటద్దంబు చూడదు [1]మెచ్చి యబల. 685

తే.గీ. భామినీమణినఖరాగ్రభాగములను
సలలితములైన కేతకీదళములందు
వరుస మన్మథలేఖలు వ్రాయు వ్రాసి
చెలులచేతను బంప లజ్జించి మాను. 686

తే.గీ. కమలవదనయుఁ బగలెల్లఁ గన్ను మూయ
దుత్పలేక్షణ నిశి నిద్రనొంద దెపుడు
మనుజనాయక నీయాన మందయాన
యమితమైనట్టి విరహా[1]ర్ణవమున మునిఁగి. 687

685 — [1] ట. మించి.
687 — [1] ట. నలమున.

క. [1]సరిమెడఁబెట్టిన హారము
లరుదుగ నీలంపుఁబేరులయ్యెను సతికిం
గురుకుచములపై మెత్తిన
గరమొప్పెడి చందనంబు కస్తురియయ్యెన్. 688

క. ఆలోలమలయపవన
ప్రాలేయకరాంశుజాలపాటవమునకుం
జాలకనీలాలకగృహ
జాలకముల మూయఁబనుచు సహచారికలన్. 689

చ. చిలుకకుఁ బల్కు కోయిలకుఁ జెన్నగురీతి సుధామరీచికి
జ్వలముఖకాంతినంతయు నవారణఁ జూఱగనిచ్చి మారుఁడే
పలరఁగ బాల గెల్చి యడియాసల జీవము దక్షిణానిలుం
గలయకమున్న తన్విఁ గృపఁగాచుట మేలు నృపాలనందనా! 690

చ. సలలితమానినీకుసుమసాయకమోహనరాయ నేఁడు నీ
వలని తలంపునందగిలి వందిన బాలకిఁ గూయుఁ[1] గోయిలల్
సొలపునఁ దమ్మి వైచుటయు[2] సూటిగ నుద్దతి[3] దూఱి పాఱియ
వ్వలుగు [4]గళంబునం దగిలి పోయిన నీ కెఱిఁగింపవచ్చితిన్. 691

ఉ. తీపులవింటివాఁ డనఁగఁ దెక్కలికాఁడు సమీరుఁ[1] డందమా
లోపలివేఁగు రాచిలుక లోకమెఱింగిన పక్షపాతి యు
ద్దీపితచంద్రచంద్రికల తీవ్రత దైవమె యొండెఱుంగునే
భూపకుమార! నీ [2]తలఁపు పొల్తుక భాగ్యము వేయునేటికిన్. 692

చ. సరసిజలోచనా! కుసుమసాయకరాజకుమార యిప్పుడా
తరుణి భవద్వియోగపరితాపమునన్ శశికాంతవేదిపైఁ
బొరలఁగ నింద్రనీలరుచిఁ బొల్చెను వేదిక యెంతమోహమో
హరహర నమ్మకున్నఁ జెలి నంటిన చేతుల కందు చూడుమీ. 693

చ. ఉడుగని కాముబారి నిలుపోపక భూపకులేంద్ర యక్కటా
విడిచిన బాలప్రాణములు వేఱొక యిట్టిశరీర మిమ్మెయిం
బడయుట దుర్లభంబనుచు ప్రాణము లా లలితాంగిమేనిలో
విడువక పోరుచుండఁ గని వేగమె నీ కెఱిఁగింపవచ్చితిన్. 694

---

688 — [1] క. సరిగోడ, ట. ఉరమున.
691 — [1] ట. గోకిలల్ ; [2] ట. జూఱఁగ ; [3] క. జాలిజాలి ; [4] ట. గరంబునం.
692 — [1] ట. తంటిమా ; [2] ట. తపము.

క. మరుచేఁ దొడిబడకుండం
గరుణించి సరోజనేత్ర గావు "మహింసా
పరమో ధర్మ" యనంగా
పరమాత్మనిరూపణంబు భావించి తగన్. 695

సీ. కుంతలంబుల[1] పేరి కొదమతుమ్మెదలను
గ్రాలుఁగన్నుల పేరి గండుమీలఁ
జన్నుగుబ్బల పేరి చక్రవాకములను
హస్తద్వయము పేరి యబ్జములను
త్రివళిరేఖల పేరి నవ్వడిపిచికలను
నతనాభి పేరి నెన్నడిమిసుడిని
గటిమండలము పేరి మనసైకతంబును
కోమలాంగుల పేరి కూర్మములను

తే.గీ. రుచిర[2]మగు రత్నసుందరి రూపసరసి
నీదులాడింపకుండిన నెట్లు వాయు
దర్పితానంగశరజాతదావదహన
తప్త[3]సన్మానసమరాళతాపభరము. 696

ఉ. ఆ నగుమోముచెన్ను శశియందును బంకరుహంబునందు లే
దా నయనప్రభాతి మదనాస్త్రములందు మెఱుంగులందు లే
దా నునుమేనికాంతి లతికావళియందుఁ బసిండియందు లే
దా నళినాయతాక్షి[1]లలితాకృతి నామదిఁ బాయనేర్చునే. 697

వరోపసర్పణము

క. ననవింటి తేఁటినారినిఁ
జన నెక్కిడి యొయ్యనొయ్య సారించి గుణ
ధ్వని చేసి పువ్వుటమ్ముల
మునుకొని వెన నేసె మరుఁడు ముదిత న్విభునిన్. 698

క. అల పులకలయ్యె సిగ్గులు
గులగులలై ధృతులు గలఁగె కులశీలంబుల్
పలుపలనయ్యె మనంబులు
తలతలమనఁ దొఱఁగె[1] నపుడు తగ నిరువురకున్ 699

---

696 — [1] క. వెలి ; [2] ట. మైనవధూటిక ; [3] ట. మన్మానస.
697 — [1] క. నళినా.
699 — [1] [illegible]

ఉ. ఒగ్గకనుండ నింతవడి నొయ్యన మెల్లనఁ బట్టి తెచ్చితిన్
బిగ్గనఁ గౌగిలించి మెఱపింపకు మీ [1]కసుగందుఁ గౌఁగిటన్
దగ్గఱినప్పుడే పదరి తానకముల్ నివురంగఁబోకు మీ
సిగ్గడికత్తె మా యబల చెప్పితి నీకు నృపాలశేఖరా 700

ఉ. దీని మొగంబు చందురుఁడు దీని కనుంగవ నీలకంజముల్
దీని కుచంబు లబ్జములు దీని కరంబులు సన్మృణాళముల్
దీని మృదూరు లచ్చకదళీతరుకాండము లెన్ని చూడఁగా
దీనిని గౌఁగిలించి తను[1]దీపితమన్మథతాప మార్పుమీ 701

నిధువన విహారము

ఉ. భావము పల్లవింపఁ బువుపానుపుమీఁదికి నేర్పునన్ వయ
స్యావళి[1]యట్లు దార్ప కడునర్మిలితోఁ గుసుమాస్త్రశాస్త్రవి
ద్యావిదుఁ డొయ్యఁ బైదిగిచి యక్కునఁజేర్చి భుజాయుగాంకపా
ళీవలయంబులోనఁ దగిలించి కురంగవిశాలలోచనన్ 702

చ. పడఁతి కుమారచంద్రుకరపల్లవముం దనచన్నుదోయిపై
నిడి పులకించి కన్నుఁగవ యించుక [యించుక] మోడ్చి వెండియున్
జిడిముడిపాటుతో నతనిచెక్కులు నొక్కుచు[1]మోవి గోరులం
బుడుకుచునుండెఁ దాల్మిఁగడివోయిన నించుక లజ్జ[2] పెంపునన్ 703

చ. ఒదికిలి పాన్పుమీఁదఁ బతి కొయ్యనఁ గేలు దలాపిసేసి క
ట్టెదురుగఁ గౌఁగలించుకొని[1] యేణవిలోచన మోవి మోవితో
గదియనమర్చి పేర్చి పయి[2]గాదిలినేరమిలేని నేర్పులం
బొదలెడియూర్పులం గరువుపోసిన భంగి లతాంగి యుండఁగన్ 704

సీ. తెమలించి కురులొయ్యఁ దివియలే కటమున్న
[1]నొక్కింత కెమ్మోవి[2] నొక్కి నొక్కి
వెడవెడ [3]సొక్కి మైనదర లే కటమున్న
యలవడ్డ గౌఁగిట నదిమి యదిమి

700 — [1] ట. తనగంధు.
701 — [1] ట. దీనత.
702 — [1] ట. దార్పనెంతయును.
703 — [1] ట. మోము[వేశలన్; [2] ట. లావణన్.
704 — [1] ట. ఒత్తుచు నొత్తుచు మోము మోముతో ; [2] ట. గాలిని.

వలువెడలింపఁ జే [4]వాదులే కటమున్న
పైకొన్న జఘనంబుఁ బ్రాఁకి ప్రాఁకి
తమకించి కొనరు పంతము లే కటమున్న
[5]తలఁచిన చిత్తంబు [6]గలఁచి గలఁచి

తే.గీ. [7]మొదలు కంటెను దుదికంటె మునుపు జాల
[8]చౌలుగతులైన రతులకుఁ జనువులిచ్చి
పూవిలుతుచేతి [9]జంత్రపుబొమ్మఁ జేసె
మానినీతిలకంబుఁ గుమారవరుఁడు 705

చ. కుతుకమునం గురంగమదకుంకుమచర్చ వహించి నీలలో
హితరుచులై స్వయంభులయి యాహితసౌఖ్యవిధాయులైన య
య్యతివ పయోధరంబులకు నర్ధనిశాసమయంబునన్ సమం
చితనఖకింశుకార్చనము సేసె మహీపతి భక్తి యేర్పడన్ 706

సీ. అన్యోన్యసంప్రీతి నలవరింపుచునుండ
వలరాజు కూరట [1]గలుగదయ్యె
రమణీయనూతనరతిరహస్యములకుఁ
గామశాస్త్రంబు [2]లుగ్గడువులయ్యె
[3]నుద్వేగమగుచుఁ బెలుబ్బెడు రాగవా
ర్ధులు లేశమైనను దొలఁకవయ్యె
నితరేతరప్రీతి నెడలించి తలఁచిన
ధృతికి రాఁదెఱపి [4]సంధింపదయ్యె

తే.గీ. మమతలును దత్తరింతలు మక్కువలును
జొక్కులును గౌతుకములును [5]సొలపములును
బ్రియము [6]నయములు గూడి తబ్బిబ్బులాడ
నతియుఁ బతియును [7]రతికేళి [8]నలిపిరపుడు 707

తే.గీ. సతతతాంబూలభోగకషాయితములు
నుదయభాస్కరనవసారభోల్బణములు
నయిన యధరామృతము నింతియును బతియును
నలిపి రన్యోన్యమధుపానసరసకేళి 708

---

705 — [1] ట. కదిసిన ; [2] ట. గమిచి గమిచి ; [3] ట. సోఁకిపై ; [4] ట. వాలు ; [5] ట. కరఁగిన ; [6] ట. గరచి గరచి ; [7] ట. తుది మొదలికంటెఁ దుదికంటెమొదల ; [8] ట. చవులకనువైన ; [9] క. చ. చంద్రంపు.

707 — [1] ట. గలుగనయ్యె ; [2] ట. కడమ ; [3] నుద్వేల ; [4] ట. సిద్ధింప ; [5] ట. సోలపము లును ; [6] ట. లునుగాముకతలుఁదబ్బిబ్బులుగను ; [7] ట. రతిక్రీడ ; [8] ట. నలుపునపుడు.

క.	తరుణీమణికిని విభునికిఁ
బరిచుంబనవేళ దంతవరపీడన మి
క్షురసంబు పానకములో
మిరియపుఁగారంబు వోలె మెచ్చొదవించెన్	709

చ.	సురతముఁ జేసి చేసి పతి సోలుచుఁ జాలక యూరకున్న యా
సరసిజనేత్ర యున్సురని సయ్యనఁదక్కి చలింపకర్థితో
వరునియురంబుమీఁది కతివైళమునం జని క్రీడసల్పెఁబోఁ
గురులుఁ గుచంబులుం [1]గదలఁ గోమలి జంత్రపుబొమ్మకైవడిన్.	710

సీ.	ఒఱపులై కప్పారు మెఱుఁగుఁజన్నుల దీప్తి
[1]పరికించి ముత్తెంపు సరులుఁ బెనఁగ
దళుకులై ప్రసరించు తాటంకరోచులు
గండస్థలంబులఁ గౌఁగిలింప
నాణిముత్తెపుఁజేర్లు వేణీభరంబుపై
కన్నెచెంగల్వల కాంతిఁ గెలువ
నలికంబుపై వ్రాలి లలితకస్తూరికా
తిలకంబుపై నాడి [2]తిరువు గొనఁగ

తే.గీ.	మెఱసి తొలఁగని తొలకరి మెఱుపుఁ బోలి
తెఱవ కెమ్మోవి నగవులు తిరిగికొనఁగఁ
గులుకుఁబలుకుల నమృతంపుమొలక లొదవ
నుపరికేళికళానాట్య మువిద సలిపె.	711

సీ.	కుటిలకుంతలములు నిటలకస్తూరికా
తిలకంబుపై నాడి తిరువు గట్ట
నంకించి రత్నతాటంకరోచులు గండ
పాళికావీథి వాహ్యాళి సేయ
మంచిముత్యపుసరుల్ మించి చన్నులమీఁద
రమణతో వడి[1] నుప్పరంబు లెగయ
సరవిరి సేమంతి విరులతో వెనువెంట
కబరికాభర మంటి గంతులిడఁగ

710 - [1] క. గవలు.
711 - [1] ట. విరచించి ; [2] చ.ట. తిరుపు

అ.వె. దంతనఖముఖాదితంత్రంబులను గళా
స్థానముల నెఱింగి తడవి తడవి
తఱిమి పూవుఁబోఁడి తాండవవిధచిత్ర
గతుల నుపరికేళి గఱఁక మెఱసె. 712

తే.గీ. కుసుమసమగాత్రి కుచముతాఁకులకు వీడ
బాపురే యోర్చనని మెచ్చి పంచశరుఁడు
గురియు పువ్వుల వర్షంబు కరణి నపుడు
హారమౌక్తికమణిసమూహంబు [1]తొలఁగె. 713

క. మగవాఁడు వీఁడు రతులకుఁ
దెగ మనకిఁక నూరకుండఁ దీరునె యనుచుం
దెగె హారంబులు దండలు
తెగె మరుఁడున్ దిగిచె నారి తెగనిండంగన్. 714

ఉ. ఇంచినవేడ్కఁ గేర్కు తెలయించినసిగ్గు [1]తిరస్కరించి లోఁ
గాంచనమేఖలారవము గానము తానములై చెలంగ లీ
లాంచితతారహారము కుచాగ్రతలంబను రంగభూమి నా
డించెఁ గురంగనేత్ర పతిడెందము రాగరసాబ్ధిఁ దేలఁగన్. 715

ఉ. సన్నము నేకమున్ శకలసంగతియుక్తమునైన కామినీ
సన్నుతకంఠకూజితము సారెకు సన్నముగాక నేకమై
మిన్నక దీర్ఘమై మిగుల మించిన యమ్మొలనూలి మ్రోఁతతో
నున్నతిఁ బాయకే చెవుల కొప్పఁగ విందులుసేసె నయ్యెడన్. 716

చ. సురతము పెక్కుభంగులను సొంపుగఁజేసి విభుండు నిందుసుం
దరముఖియున్ బరిశ్రమము తారు వహించుట సేదదేఱఁగా
నదనతఁ గౌగిలించుటల శయ్యలమీఁదట నప్పుడెంతయున్
దితమలరన్ ద్వితీయరతిదీపనకారణమయ్యె మిక్కిలిన్. 717

చ. సురతపరిశ్రమాంతమున సుందరి లేచి నితంబబింబమున్
బురుషుఁడు సూచునో యనుచుఁ బొల్పగు వామకరంబుఁ గప్పె నా
మరు తనయింటివాకిలికి మాఱుభుజంగముఁజేరనీని యా
యురగఫణామణిద్యుతులనొప్పెడు నాగకుమారుఁడో యనన్. 718

---

712 - [1] ట. నుప్పరంబపాఱ.
713 - [1] చ. దొరిఁగె; ట. తొరగె.
715 - [1] క. వికసించి.

సీ. అంతఁ గామిని కన్నులరవిచ్చి సురతసం
క్షుభితవేషము పతి చూడకుండఁ
దనదుచెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి
పొరిఁబొరిఁ దానును బులకితముగఁ
గెంగేల నతని కౌఁగిలియాని యడగొంచు
చేలాంచలము పెఱచేతఁ దడవి
తెచ్చి పాలిండ్లమీఁదికిఁ జొనుపుచు నితం
బావృతి యరసి రెండవచెఱంగు

తే.గీ. కటితటంబెత్తి యెత్తి క్రిందటికిఁ బఱపి
లోనుగా దానిపైయంచుతో న[1]మరఁగఁ
బొక్కిలి గడించి పట్టి మూపునను జెరివి
వదలు తుఱు[2]మారుకొనుచు లేవంగఁగడగె. 719

తే.గీ. ఇపుడు కెమ్మోవి చిఱుకాటు నెపము గాఁగఁ
దామరసనేత్ర కోపింపఁ దగవు గాదు
ఫలరసాస్వాదమొనరించు చిలుకమీఁద
బింబవల్లిమతల్లి కోపించుటెట్లు. 720

తే.గీ. చూడవేటికి నిడువాలు [1]సోగమీల
చూడు చల్లంగఁజాలిన చూపుగములఁ
బలుకుపలుకున కప్పృతంపుమొలక లొదవఁ
బలుకవేటికిఁ జిలుకలకొలికి యిపుడు. 721

ఉ. వారిజలోచనా హృదయవల్లభవై చను నీవు లేనిచో
నారయ నాకు నేల లనదంశుకమున్ శుకమున్ వినూత్నశృం
గారము గారమున్ భటనికాయముఁ గాయము జీవనోచితా
హారము హారము న్మధుసమంచితపుష్పవనీ విహారమున్. 722

మ. వరబింబాధరమున్ బయోధరములు న్వక్త్రాలకంబు ల్మనో
హరలోలాక్షులుఁ జూపనొల్లక పిఱుందై వత్తె యేమయ్యో నీ
యురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు నాకుం జాలదే గంగ యి
ద్దరి మే లద్దరికిదునాఁ గలదె యుద్యద్రాజబింబాననా! 723

---

719 — [1] ట. నరఁగ ; [2] క.చ. దురుమారు, ట. ట. నరుమారు.
721 — [1] క. సోన.

చ. వెనుకటినుండి డాసి యరపీడిన యా చపలాక్షికేశబం
ధనమున నొప్పు క్రొవ్విరులతావికిఁ జొక్కుచు మేను మేనునిం
పున గదియించినం దెలివిపొంది కనుంగవ వాదుదేర నొ
య్యనఁ జరితార్థుఁజేసె హృదయాధిపతిం [1]గడగంటిచూపునన్. 724

తే.గీ. అలుక దిగఁద్రావి కుచములనంటి విభునిఁ
గౌఁగిలించుచు మిగుల సీత్కారమెసఁగఁ
జుంబనంబుల [1]నలరించి పంచికొనిన
నిద్ర వేఁగన్నుఁగవ మోడ్చె నీలవేణి. 725

సీ. తలగడగా లీల మెలఁగిన కేళిపై
కరమూలరోచులు గ్రమ్ముదేఱ
సుకుమారదృగ్దీప్తులకుఁ దెరచీరలై
కరమొప్పు తెప్పల గప్పుదనర
వామస్తనముమీఁదఁ బ్రేమంబుగల భంగి
నాదిక్కు వ్రాలిన హారమమర
వరునిపైఁ జేర్చిన పెఱచేతి ముద్దియ
మణిదీప్తి దివ్వియ మాయఁజేయఁ

తే.గీ. జందురునిఁ జక్రవాకలు [1]గుందసేయు
చందమున ముద్దుమోమును జన్నుగవయుఁ
జెన్ను దళుకొత్త నొదికిలియున్నవాఁడు
[2]దేలియును దాను [3]నలసి నిద్రించు విభుఁడు. 726

తే.గీ. సకినలకిలుమంచములుఁ జంద్రశిలామయకుట్టిమంబులున్
శుకకలహంసశారికలు నున్నపురంగులు గాజుటోవరుల్
మకరపతా[1]కబద్ధములు మంజిటిపట్లును హేమపీఠికల్
ముకరముఁ దాళవృంతములు మున్నుగ నొప్పెడు నా గృహంబునన్. 727

తే.గీ. సురతపారవశ్యంబులఁ జొక్కి చొక్కి
కేళి నిద్రాసుఖంబులఁ దేలి దేలి
మేలుకొని బాహ్యరతికేళి మించి మించి
దంపతులు క్రీడసల్పిరి తనివినసక. 728

---

724 — ట. గడగంటఁజూచుచున్.
725 — [1] క. ననలించి.
726 — [1] క. బొందు ; [2] ట. దెలవయును ; [3] క. గలిసి.
727 — [1] ట. కునద్దములు.

## ప్రత్యూషవర్ణనము

సీ. ఉదయాచలేంద్రంబు తుది సరోవరమున
మొలచిన నవరత్నజలజ మనఁగ
నురుతరపూర్వపయోరాశిలోనుండి
వెడలెడు బడబాగ్ని మిడుగు రనఁగ
గగనయోగీంద్రుఁ డాకర్షింపఁగావచ్చు
ఫణిరాజు తలమీఁది మణి యనంగ
వృత్రారి చెండాడు వ్రేటున మీఁదికిఁ
[1]దూలిన రత్నకందుక మనంగఁ

ఆ.వె. గళలు లేక [2]హీనగతులచేత నలఁత
[3]నందియున్న విరహిబృందమునకుఁ
గొంతకొంత వంత గురియుచుఁ దెలుపారి
చొక్కమైన వేగుఁజుక్క పొడిచె. 729

తే.గీ. నేల దెలుపెక్క జక్కవల్ నింగికెక్క
విధుఁడు రుచిఁదక్క మదనుండు వెనుకఁద్రొక్క
కమలములు నిక్క సౌగంధికములు స్రుక్క
విరహిణులు వెక్క నుదయించె వేగుఁజుక్క. 730

ఆ.వె. ఉడుగణములతోడ నుడురాజు పట్టంగ
సూర్యుఁ డరుగుఁదెంచె నురగుఁడనుచు
వేగు చెప్పవచ్చు వేగరియును బోలె
వెడలె ప్రాఙ్ముఖమున వేగుఁజుక్క. 731

తే.గీ. వానరాంగన [1]మదికి నుల్లాన మొదవ
వల్లభుని రాక యెఱిఁగింప వచ్చినట్టి
కాలరియుఁ బోలె మిక్కిలి కాంతి దోఁచె
విరహిజనములు వెగరెక్క వేగుఁజుక్క. 732

ఉ. నారుల ప్రాణనాథుల ఘనంబుగ నా పురిలోన రేయి దా
నేరుపుమీఱ శయ్యల ననేకగతిన్ రతికేళిలీలలం
బోరఁగఁజేసి వేకువను బొల్పగు కుక్కుటకంఠకాహళిన్
మారుఁడు [1]ధర్మదార రయమారఁగ వే మొఱయించె నొక్కెడన్ 733

---

729 — [1] మాలిననవరత్నకందువనగ; [2] క. దాన; [3] క. వాయగ విభవరాగమునలతంది యున్న, ట. వాయగ రాగమున నలతంది యున్న ?

732 — [1] క. మహానులాన.

733 — [1] ట. తమ్ముఁదార.

ఉ. పోయె విభావరీమహిమ పొల్పెసలారె నహర్ముఖంబు భ
ద్రాయితనిత్యకర్మనిరతవ్రతు లేటికి నిద్రఁగూరలే
రో యిట వేగ మేలుకొనరో యని తెల్పెడి భంగిఁ గొక్కొరో
కోయని కూయఁజొచ్చెఁ బురికుక్కుటవర్గము మిక్కుటంబుగన్ 734

ఉ. రోయక రోయుఁడీ ప్రియుల రూఢిగఁ జక్కవలేమలాత మీ
పాయుటలున్ సరోజవనభంగములున్ దలపోసి యుద్భవ
శ్రీయుతుఁడయ్యె భానుఁడని చెప్పెడునట్లును బోలెఁ గొక్కొరో
కోయను రావముల్ సెలఁగెఁ గుక్కుటపంక్తులయందు నెల్లెడన్ 735

ఉ. ఏయఁగలేక మన్మథుఁడు నిక్షుశరాసన మెక్కుడింపఁగాఁ
గాయఁగలేక వెన్నియల గర్వము డిందుఁగఁ బువ్వుశయ్యలం
బాయఁగలేక దంపతులు భ్రాంతిపడ న్నిశి వేగఁ గొక్కొరో
కోయని కూయఁజొచ్చెఁ బురికుక్కుటసంఘము లక్కజంబుగన్ 736

తే.గీ. ఎట్టకేలకు నలుక రేయెల్లఁ దీర్చి
యువిదయధరామృతముఁ గ్రోలుచున్న వేళఁ
బానవిఘ్నంబుగా మ్రోసెఁ బాపకర్మ
జాతిచండాలమైన వేసడపుఁగోడి 737

మ. లలనా యేటికిఁదెల్లవాఱె రవి యేలాదోఁచెఁ బూర్వాద్రిపై
కలకాలంబు నహంబుగాక నిశిగాఁ గల్పింపఁ డా బ్రహ్మయున్
వలఱేడున్ దయలేదు కీరములు దుర్వారంబు లెట్లోకదా
కలదే మాపటికాలమందు నిఁక నో కంజాక్షి సంభోగముల్ 738

క. తెలతెల వాఱఁగ వచ్చిన
వెలవెలఁ బాఱుచును దొగలు విలవిలఁ బడియెన్
బలపల నయ్యెను జుక్కలు
కలకల నగె దిశలు పక్షి కలకల [1]మెగసెన్ 739

మ. సురతారంభముల న్విజృంభితకళాశుంభత్పరీరంభని
ర్భరకేళి న్నొకరుండు [1]కాంతపటము న్బాయంగఁ బోవైచె ను
ద్ధురుఁడై వేకువ బండికంటి కరణిన్ దోరంబునై [2]వట్రులై
[3]బరఁగన్ దజ్జఘనంబు చూచుటకునై భావించెఁ దా నెంతయున్ 740

---

739 — 1 ట. మెసఁగెన్.
740 — 1 క. నాత్తపటము, చ. కాంతపటము ; 2 చ. ట. వట్రనై ; 3 ట. బరగెన్.

చ. వెలవెలనయ్యె దీపములు వెన్నెల నిక్కె నభస్స్థలంబునన్
వలవలనయ్యెఁ జుక్క లటఁ బద్మిని లో నగుచుండెఁ దూర్పునం
బొలిసె ననూరురేఖ మెయిపొందులు శీతములయ్యె ముత్యముల్
చెలువలు ప్రాణవల్లభులఁ జేర్చి కవుంగిట నంతకంతకున్ 741

మ. సరసస్నేహఘనంబు లాయతదశాసంసక్తముల్ కజ్జల
స్ఫురితోపాంతము లిష్టభూరివిషయంబుల్ కామినీనేత్రభా
సురరోచుల్ దము నేలుదెంచు కరణిన్ సుస్నిగ్ధరాగంబులై
పరగంగా వెలవెల్లనయ్యె గృహదీపవ్రాతముల్ వేకువన్ 742

ఉ. చల్లనివాఁడు గావున [1]నిశాచరుప్రాపున దీప్తిలీలమై
నెల్లజగంబులు న్మిగిలి యిమ్ములనుండితి [2]మింక నెంతయుం
దెల్లము తీవ్రమూర్తి యొరుతేజము సైపఁడు భానుఁగూడి వ
ర్తిల్లఁగవచ్చునే యను గతిన్ [3]వడిఁ జుక్క లణంగెఁ దోడుతన్ 743

సీ. లెక్కింపఁ జులుకనై చుక్క లాకసమునఁ
బ్రాఁతముత్తియముల పగిది నుండ
నొదవెడి కెంజాయ యుదయాచలము [1]దిక్కు
మాణిక్యవేదితో మచ్చరింప
ఆకాశనదిక్రేవ నమృతభానుఁడు మేని
మించుఁ గోల్పడి ముది యెంచఁ [2]బోలఁ
జలిగాలిసోకునఁ దెలిసి కొండొకవడి
కవలెల్ల జక్కవకవలఁ బెరయ

తే.గీ. వెలరువాఱుచు గృహదీపవితతి [3]యెల్ల
[4]మరువ మెఱపైన గోరంటవిరుల బెరయు
నళినములు కుముదముల నవ్వ [5]నాల్గుదెసలు
[6]వెలిఁగి తనరారెఁ బ్రత్యూషవేళ[7]యందు 744

ఉ. రాతిరియెల్లఁ జాల ననురాగముతోడఁ గుముద్వతీరతిం
బ్రీతి భజించి ఖేదమునఁ బ్రేమసియున్ సొగయంగ దా నను
ద్భూతరతిశ్రమార్తుఁడగు పోలిక చంద్రుఁడు పశ్చిమాబ్ధి శ
య్యాతలసుప్తి కైవడి యనల్పవిభావిరళాంగరాగుఁడై 745

---

743 — [1] ట. నిశాకరు ; [2] బ. మింత ; [3] ట. దివి.
[illegible]

ఉ. ఇనుని సమాగమంబున నిజేశుఁడు పొందెడి దీనభావముం
గనుఁగొనజాల కేఁగెడు ప్రకారమునన్ జనెఁ దారలు న్నిశా
వనితయుఁ దద్వియోగపటువహ్నిఁ గృశింపఁగ నోర్వలేక య
వ్వననిధిఁబడ్డ చందమున వారిజవైరియుఁ గ్రుంకె నంతటన్ 746

చ. మునుకొని తమ్ముల న్వగల ముంచితిఁ జక్రవాకలన్
దిన మనుపేరు మాన్చితి [1]వధించితి రాజస మింతచాలు న
య్యినుఁడు ప్రతాపి వాఁ డెఱిఁగెనేనిఁ బగల్ జనియించునంచు డాఁ
గిన క్రియఁ బశ్చిమాచలముక్రేవ నడంగె శశాంకుఁ డత్తఱిన్. 747

క. పలపలని తారకంబులు
తెలతెలనై తోఁచు తూర్పుదిక్కును విలస
త్కలకలకలవింకంబులు
వెలవెలనగు దీప[1]తతియు వేకువ దెలిపెన్. 748

క. తెలతెలవాఱెడి వేళను
గలకలమని పల్కెఁ బక్షిగణ మెల్లెడలన్
మిలమిలని ప్రొద్దు రాకకు
తళతళమని వెలిఁగె దిగ్వితానం బెల్లన్. 749

క. అంత ఖగంబులు మేల్కని
యెంతయు నెలిగింపఁదొడఁగె నింపార రతి
శ్రాంతి న్నిద్రించిన తమ
కాంతలఁ గాముకులు మేలు[1]కలిపెడి భంగిన్. 750

సీ. కమలగర్భునిఁ బుత్త్రికా[1]ముకుఁ గావించి
కౌశికి వెలయాలిఁ గవయఁబనిచి
యిందిరావిభు గొల్లయిల్లాండ్రఁ దగిలించి
రజనీశు గురుసతిరతు నొనర్చి
రుద్రుని నర్ధపౌరుషునిగా నియమించి
శుకుని తాతకు రతిసుఖము మఱపి
కులిశాయుధునిఁ బట్టి [2]కోడాట లాడించి
ఋష్యశృంగుని తపోరీతిఁ జెఱిచి

---

747 — [1] చ. మథించితి, ట. నదించితి.
748 — [1] ట. వితతి.

తే.గీ. విషమశరునకుఁ ద్రైలోక్యవిజయ మొనఁగ
నిట్టి వానంతు మహిమంబు లెఱిఁగి నరుల
విజితకాముల మనుమాట విడువుఁ డనుచుఁ
బలుకు గతిఁ బల్కెఁ దోటలఁ జిలుకగములు. 751

## సూర్యోదయ వర్ణనము

సీ. ప్రాచీవధూచారుఫాలపట్టిక మీఁదఁ
బొనఁగు కుంకుమచుక్కబొట్టనంగ
నుతరాజు దేవి భానురలీలఁ దనహస్త
మునఁ దాల్చు మాణిక్యముకురమనఁగ
వేడ్క నైరావణద్విపకంఠమున వ్రాలఁ
గట్టిన రత్నంపు ఘంట యనఁగ
పూర్వాబ్ధి నడుదీవిఁ బూచిన కింశుక
మంజులనవపుష్ప మంజరనఁగ

తే.గీ. సకలజనలోచనోజ్జ్వలజలజమునకు
[1]మేదురామోదవికసితశ్రీ దొలంక
నెండుతేజంబు దిక్కుల మెండుకొనఁగ
మిహిరబింబంబు పూర్వాద్రిమీఁద వెలిఁగె. 752

సీ. కామితఫలము జక్కవలకు నొసఁగెడు
సాంద్రపల్లవపారిజాతమనఁగ
రంజిల్లఁ గెందామరలకు వన్నువ వెట్ట
నలువ గూర్చిన కెంపుఁగుళిశమనఁగ
నుదయశైలంబున నున్నతగంధహ
స్తికి నిడ్డ సిందూరతిలకమనఁగ
బహుళతఁ బూర్వాద్రిపైఁ దోఁచు నవపద్మ
రాగపుంజప్రభారాశి యనఁగ

ఆ.వె. యామినీభుజంగి యడరినఁ బారవ
శ్యంబు నొందు సకలజంతువులకు
బోధ మావహింపఁబూని యేతెంచిన
వెజ్జనంగ దివసవిభుఁడు దోఁచె. 753

751 – [1] ట. కాము ; [2] క. చ. కోడెలాడించి.

సీ. పౌలోమి తన బాహుపాన్పుపై గనుపట్టఁ
బన్నిన పవడంపుబంతి యనఁగ
నాయురర్థంబులఁ బ్రాయ మెత్తిన చాటు
కాలజాంఘికు చేతి పంట యనఁగ
మనజంతుజీవిక కాలరాశుల విధిఁ
గొలువ నెత్తిన పైడికుంభ మనఁగ
పశ్చిమదిక్కాంత పరఁగఁ గైసేయుచు
ముందఱ నిడుకొన్న ముకురమనఁగఁ

తే.గీ. గోకతాపోపశమదివ్యఘుటిక యనఁగఁ
బద్మినీకాంత నోముల ఫలమనంగ
మూఁడు మూర్తుల సారంపుముద్దయనఁగ
మిహిరమండల ముదయాద్రిమీఁద[1]వెలిఁగె. 754

సీ. కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన
పురుహూతు నిల్లాలి బొట్టనంగఁ
జక్రవాకములకుఁ జల్లగా మందు [1]ద్రా
గించిన చంద్రంపుగిన్నె యనఁగఁ
పార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్న
యలరుఁగెందమ్మి [2]కోహళి యనంగఁ
దొలిదిక్కు తొయ్యలి చెలులపైఁ జల్లంగ
నిండముంచిన పైఁడికుండ యనఁగ

తే.గీ. మేరుధరణీ[3]ధరముతోడ మేలమాడ
నుదయగిరిరాజు తలయెత్తెనో యనంగఁ
గ్రమముతో నించుకించుక గానఁ[4]బడఁగ
భానుఁ[5] డుదయించె దేదీప్యమానుఁడగుచు. 755

ఉ. కంజము లుల్లసిల్ల[1] రవికాంతము[2]లందును వహ్నికీలముల్
గెంజిగురొత్తఁ గైరవము కేలిఁదొఱంగఁ దమఃప్రకాండముల్
పుంజము వీడ జక్కవలు పొందు వహింప ఖరాంశుఁడొప్పె ది
క్కుంజరకంఠభాగమున గ్రుచ్చిన రత్నపుబొమ్మ కైవడిన్. 756

754 — [1] క. వెలఁగె, ట. దెలిసె.
755 — [1] క. రాగించిన; [2] క. రోహళి, చ. రోహళి;
[3] ట. ధరంబుతో; [4] క. లడక, ట. నగుచు; [5] ట. బింబంబుకన్నులపండువయ్యె.
756 — [1] [illegible]

ఉ. బ్రొక్కల యిక్క వేదముల ముద్ద త్రిమూర్తుల యాటపట్టు పే
రెక్కిన పెన్గ్రహంబు నుతికెక్కిన దృష్టపువేల్పు చీఁకటిం
జెక్కెడు కత్తి తామరల చెన్ను నభోంగన కంఠరత్న మా
చుక్కలరాజుతోడి దొర సూర్యుఁడు దూర్పున దోఁచె నెంతయున్. 757

సీ. ఊర్వీధరంబుల నొప్పెడు జేవురు
చఖుల కాంతికి నునుమెఱుఁగు వెట్టి
ధరణీజగుల్మలతావితానము పల్ల
వములకుఁ[1] గట్టెఱ్ఱ వన్నె వొసఁగి
యరుణాంబుజంబుల నంతర్దళంబుల
ధళధళయను జిగి దళము గొలిపి
చక్రవాకద్వయీసంతతి యరకులఁ
గొమరారు కెంజాయ క్రొత్త సేసి

ఆ.వె. తనదు బాలబింబ మనుపమేయప్రభా
పటలజటిలగగనభాగమగుచు
నుల్లసిల్లె జగములెల్లను వికసిల్లఁ
బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు. 758

సీ. ఘనతమి[1]స్రోద్ధతకరిరక్తజలములఁ
జెలువారఁ దోఁగిన సింహమనఁగఁ
బూర్వపయోరాశిఁ బొందున[2] నుండక
వచ్చు బాడబమహావహ్ని యనఁగ
ప్రథమాద్రిశృంగంబుపైఁ దెచ్చిపెట్టిన
ఘనపద్మరాగైకకలశమనఁగఁ
బ్రాచీవధూకరపల్లవతలమునఁ
గొమరారు విద్రుమగుచ్ఛమనఁగ

తే.గీ. భానుఁ డుదయించె దేదీప్యమానహృదయ
భవ[3]మనోరాగతరుపక్వఫలమనంగ
భూరితేజంబు వెలుఁగంగ భువనభవన
తిమిరహతిఁ జేయఁజాలిన దీపమనఁగ. 759

చ. వరుఁడు చెఱంగు పట్టినను వల్వ దొలంగినఁ గొంత లజ్జప
ట్లురుతరరత్నముద్రికల నొప్పగు దాపలికేల మూసినం
గరమమరెం గరాబ్జరుచితామనిధానము గాచియున్న వి
స్ఫురితఫణామణిద్యుతులఁ బొల్పగు నాగకుమారుఁడో యనన్. 760

---

758 — [1] క.చ. కట్టెరుకు.

759 — [1] క.చ. స్రోద్యత ; [2] ట. మింగఁగనెడ ; [3] ట. తపఃక్రియా.

ఉ. పాటలగంధి మేల్కొని ప్రభాతమునం దన జీవితేశు లా
లాటమునందు లత్తుకగళంబున నంగజముద్ర వాతెఱం
గాటుక తమ్ములంబు కడకన్నుల నుండఁగఁ జూచి యంగుళి
స్ఫోటన చేసి యూర్పు దగఁబుచ్చెఁ గరాంబురుహంబె యూతగన్. 761

ఉ. క్రిక్కిఱిచన్నుదోయి యిరుక్రేవలఁ గాంతియుఁ ఖంచబాణు | కొ
వ్వెక్కఁగఁ జేయు హస్తయుగమెత్తి విహారభరంబు పేర్మిఁ[1]గై
పెక్కు ప్రసూనముల్ గురియ వేనలి వీడిచి కొప్పుపెట్టుచో
జొక్కులఁబెట్టె భూవరుని చూపులఁగోమలి బాహుమూలముల్. 762

మ. అకలంకామృతపూరమైన రమణీయాస్యంబు[1]కే సాటియే
నకలంకుండ నటంచు సిగ్గువడి ప్రాక్చేలంబు పైనుండి కొం
కక సానుస్థలిఁ బడ్డ చంద్రశకలాకారంబులుం బోలె నా
శుకవాణీకుచపార్శ్వ మందు నమరెన్ సొంపై నఖాంకావళుల్. 763

సీ. ప్రాణేశు నొసలి లాక్షాంకంబు పొడగని
మునిముని [1]నవ్వుతో మోము వంచు
నేలనవ్వితి చెప్పు మిప్పుడం చడిగిన
నధిపుచేతికి మించుటద్ద మిచ్చు
మరుఁబెట్టి చనుదోయి మదనాంకములు చూచి
తను నవ్వు విభునిఁ జూపున నదల్చు
రాజుచేఁ జికురభారము సెజ్జ మోవంగ
ప్రమొక్కించుకొనుఁ బాదములకు నలిగి .

తే.గీ. రుద్రమూర్తి [[2]కిఁ దెగి] భానురూపుఁ డగుచు
నతనుఁ డేకాదశాకృతియైన భంగిఁ
జరణనఖదర్పణములందు జనపనుతుఁడు
లీలఁ బ్రతిబింబితుఁడు గాక లోలనయన. 764

ఉ. అద్దములోనఁ జూచెఁ జపలానన నాథు నఖక్షతంబులన్
బిద్దములైన యట్టి తన బింకపుఁజన్నుల తూర్పుఁగొండపై
ప్రొద్దుదయించెనాఁ గలువపువ్వుల నర్చన చేసినట్లు పై
నిద్దములైన నేత్రముల నీడలు వాని నలంకరింపఁగన్. 765

---

762 — [1] ట. గంపెక్క.
763 — [1] ట. నాపాటి.
764 — [1] ట. నగవుతో; [2] క. చేసి.

చ. అలరులు గోయుచు న్మధుకరావళిఁ బ్రోచుచుఁ గీరపోతకం
బుల పలపాటుమాటలకుఁ బొంచుచు నంచలజాడ నేఁగుచున్
లలితమయూరవర్తనవిలాసముఁ జూచుచు బోటిపిండుతోఁ
గలయుచుఁ బాయుచుం బహుళకౌతుకవృత్తిఁ జరించు నయ్యెడన్. 766

ఉ. మిన్నక చేరవచ్చి యొక మేలపుమేవడిపువ్వుబోణి గ్రాల్
గన్నుల మూసి [1]మోది కమలంబుల భూపతి [2]నవ్వుచున్న యా
సన్నసఖీజనంబుఁ గనుసన్న నదల్చుచు నవ్వధూటి వా
ల్గన్నులు చేరలం గొలుచు కైవడిఁ గన్నుల నవ్వు దేఱఁగన్. 767

తే.గీ. ఒక్క పూబోడి భ్రూసంజ్ఞ నొయ్యఁ బిలిచి
యాత్మహస్తాధికార మయ్యబ్జవదన
హస్తముల కిచ్చి యెఱుఁగని యట్ల తాను
వసుమతీశుండు [1]నగు నవ్వు వచ్చినట్లు. 768

క. రేయిఁ జకోరస్థితిఁ [1]గవ
పాయక, జక్కవల భంగిఁ బగలు మిథునమై
పాయక రేయింబగలును
నా[2] యధిపతియున్ సుఖించె నతివయుఁ దానున్. 769

చ. మదగజరాజకుంభముల మచ్చర[1]మొందు నురోజ[2]దుర్గముల్
గదిసి కలంత మేరయును గైకొనియున్నవి యెల్లవారికిన్.
విదితముగాఁగ నిట్టితఱి వేమఱు నీ చెలి డెందమందునన్
గదలక మాకు నుండ నవకాశము లేదుగదే మదాలసా. 770

క. అని నగుచు నట్ల పలికిన
జననాయకతనయఁ జూచి సంతసమున న
వ్వనజాస్య రత్నసుందరి
వినుచుండఁగ నిట్టులనియె విశదప్రీతిన్. 771

నాయికోపాలంభనము

తే.గీ. రమణిహృదయంబునను మహారాజ వీవు
కరము విచ్చేసియుండిన కారణమున
వీని వక్షోరుహంబు లాలోన నుండ
నెడములేకున్న మఱిగాదె వెడలె వెలికి 772

---

767 - [1] క. మోడి, చ. వాఁడి, ట. పోఁడి; [2] ట. గవ్వు.
768 - [1] ట. దగు.
769 - [1] ట. గవి; [2] ట. యువనిపతి సుఖియించె.
770 - [1] ట. కించు; [2] ట. కుంభమున్.

ఉ. వంచన యింత లేక కరవాఁడినఖంబుల నొక్కి నొక్కి నొ
ప్పించితి రెండు చేతులను బెద్దయు లావున నొత్తి యొత్తి పీ
డించితి విట్టి రాయిడికి డెందము పాడవు నీకుఁగాక మా
చంచలనేత్ర యొప్పుల కుచంబులు పయ్యెదలోన డాఁగెడిన్. 773

శా. క్షోణీశోత్తముఁడైన భూపతికిఁ దేజోరాశికిన్ రాణియై
యేణీలోచన రత్నసుందరి తగన్ హేలామనోహారి క
ల్యాణాకారసరోజగంధికుచభారానమ్రమత్తన్వంగి య
క్షీణప్రౌఢవివేకమాన యగుచున్ జెల్వొందె నందంబునన్. 774

ఉ. ఆ నరనాథభామిని సమంచితవర్తన మింత యొప్పనే
మానితమైన యచ్చెఱఁగు మాసిన వల్వ గృహంబు వెళ్లినన్
హీనమటంచుఁ దా రజకునింటికిఁ[1] బంపక కీలికిచ్చె న
మ్మానవతీలలామ కభిమానమె చాలదె చీరయేటికిన్ 775

శా. ఆ లీలావతితోడ నవ్విభుఁడు కామాసక్తరాగక్రియా
లోలుండై విహరించునెప్పుడును సంలుప్తావనీకామ్యుఁడై
కేలీపర్వతరత్నకందరములం గ్రీడానివాసంబులన్
లీలోద్యాన మదాళిసంతమసవల్లీగేహ[1]కుడ్యంబులన్. 776

చ. పొరిఁబొరి కోర్కులుం దమకమూల్ దయివాఱఁగఁ జిన్నియల్క ల
బ్బురమగుచుండ మోహములు పొంగెడి మన్మథసౌఖ్యలీలలన్
బరవశులై సతీమణియుఁ బార్థివుఁడు న్నిజభావవీథులం
దరయఁగనేర రర్కుఁ డుదయంబున మించుట లస్తమించుటల్. 777

చ. [1]నిడుదలు గాని యల్క[2]లకు నిండి తొలంకుచునుండు కాంక్షలం
దడబడు[3] కామతంత్రములఁ దప్పులెఱుంగని తత్తఱింతలం
[4]గడపటలేని కూటములఁ గప్పెడి చొక్కులఁ గాన రెన్నఁడున్
బడతియు మేదినీశుఁడు ప్రభాతము రాకలు[5] రేల పోకలున్. 778

సీ. అంగనాకుచమండలాసక్తమై బుద్ధి
భూమండలము దెసఁ బోవదయ్యె
లలనభ్రూచాపవిలాసంబు మనమునఁ
బెనఁగొనఁ బట్టెడి ధనువు మఱచె

---

775 – 1 క. పరకెలికిచ్చినం.
776 – 1 ట. మధ్యంబులన్.
778 – 1 ట. నిడుపలు ; 2 ట. లును ; 3 క. గానిమంత్రములు, చ. గానతంత్రములు ;
4 క. కడవల, చ. కడవల ; 5 ట. రాత్రి.

భామినీరుచిరాంగపరిరంభణములచే
సప్తాంగరక్షణస్మరణ మెడలెఁ
దరళాక్షి చూడ్కులఁ దా నాజ్ఞఁబడి యుని
ధర నాజ్ఞ చెల్లించు తలపు మఱచె

ఆ.వె. రమణితోడి సతతరతిరాజతంత్రమో
హమున రాజతంత్రవిముఖ మయ్యె
ధరణివిభుని కూర్మిఁదనరి నానాఁటికిఁ
గట్టువడక నాఁటి రెట్టిపడఁగ. 779

చ. సుకవులు కోవిదోత్తములు జోస్యులు మంత్రులు బంధు వంది వై
ణికులును నాట్యకౌశలులు నీతికళాయుతులు న్విలాసినీ
నికరము నింగితజ్ఞులును నేర్పరులున్ నృపులు న్నవీనకౌ
తుకమునఁ గొల్వ వైభవముతో ధర యేలుచునుండె నెమ్మదిన్. 780

జలకేళి

చ. పెరిగిన హారతత్పముల పెల్లుల నొక్కటఁ దామ్రపర్ణియై
నెరసిన సొగవెన్నెలకల నిగ్గుల నొక్కట భానుకన్యయై
గురుకుచకుంభలిప్తఘనకుంకుమ నొక్కట శోణయై నభ
శ్చరనది యొప్పె[1]నవ్యజలజాతముఖుల్ జలకేళి నల్పఁగన్. 781

తే.గీ. మేటి జంబేటి యనట క్రొమ్మించు మించుఁ
బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టి
తమ్మిగద్దియ దాకంట కమ్మి దీసి
కొమ్మ [1]గావింపఁబోలు నెత్తమ్మిచూలి. 782

సీ. కణవిలాసమె కాని గజనిమ్మపండ్లును
సరియె దుర్గాధివాసముల మనినఁ
బైపూత రుచి గాక ప్రతియె కిన్నెరకాయ
లరిది మేరువు తలయంపి నిడినఁ
బొద్దువన్నియె కాక యుద్దియె తమ్మిమొ
గ్గలు చక్రములఁ గూడి దళము కొనినఁ
గాకచాయలె కాక కనకకుంభము లీడె
శ్రీకరుని శిరోగ్రసీమనున్న

తే.గీ. మిళితఘనసారమై నున్న మిగిలి కదిసి
యంతరము సూత్రమున కిఁక యలరి జోడు
వదలక మితరసప్రౌఢిఁ బొదలి మెఱయు
నన్నువల మిన్న వలిగుబ్బచన్నుగవకు. 783

చ. నతి హృదయాలవాలమున జవ్వనమున్ బెనుగాకఁ జేసియ
య్యతనుఁడు గుబ్బపొంబనటలారను లోహశలాక లెత్తి యా
ర్జితరుచి నించఁ గాంతులను జెందిన రాఁబొడి బాహుమూలజ
ద్యుతియగుఁ గానిచో నచట దోర్మయభర్మలతల్ జనించునే. 784

సీ. కొమ్మ వాతెఱతో గుణమ్ము గైకొని వచ్చి
కఠినవిద్రుమముచేఁ గట్టఁబడియెఁ
గోమలి యధరంబుతో మొనల్ పచరించి
యరుచిబింబఫలంబు విరిసిపడియె
మృగనేత్ర పెదవితో సొగసుఁ బూనఁ గడంగి
కెంపు నీరసము[1] చెక్కించుకొనియె
నతి మోవితో రసస్థితులఁ జూపి సుగంధ
వికలబంధూక మూరకయె విరిసె

తే.గీ. దాయ పగడంబునకుఁ బగడంబు బింబ
మునకు బింబంబు మెఱయఁ గెంపునకుఁ గెంపు
బంధు[2]జీవంబునకుఁ దానె బంధుజీవ
మౌన యా కుందరదన రదాంశుకంబు. 785

ఉ. ఇంతి మృదూక్తిమాధురికి నిక్షురసం బెనఁబోల జాలకా
ద్యంతము నోడి మధ్యమగుణాశ్రయమైననె కాక యెన్ని జ
న్మాంతరము ల్వహించియుఁ ద[నంత]నె ఖండములయ్యెఁ గాని యా
వంతయుఁ బూన దెంత వొడియయ్యు నఖండతదీయసంపదన్. 786

మ. తన రాజీవశరం బెఱుంగదు నిశా[1]తత్త్వంబు లేఁగల్వతూ
పునకుం జాలదు [2]వేగ లీల యని యా పూవుల్కు లెగ్గించి గ్రొ
న్ననవిల్కాఁడు నవాంబుజోత్పలవితానం[3]బైన మీనాక్షిలో
చనముల్ వింట ఘటింపఁ బొల్చునవి నిస్తంద్రాంబకద్యోతలన్. 787

---

785 — [illegible]

సీ. పవమానమానవప్లవమానకైరవ
చ్యవమానరజము మై నంటిదివురఁ
గరసారసాగ్రతామరసాతిసాంద్రసీ
ధురసాప్తిగన్నీరుఁ దుడువఁగోరు
మదనానలప్రభానదనామ్రకోమల
చ్ఛదనార్చిపైఁ జూపుఁ జరవఁజూచు
నలయాహతలతాకినలయాగమలయాగ
నిలయానిలున కూర్పు దెలుపఁదలఁచుఁ

తే.గీ. గుంజపుటగుంజదళపుంజశింజితంబు
వెగ్గలంబైన చెవియొగ్గి వినఁగణంగుఁ
బంచశరభూతపరిభూతపంచభూత
ములఁ దదీయస్థలంబులఁ గలుపుకరణి. 788

ఉ. ఇచ్చ హితాహితంబు గణియింపనిగోలపు గానఁ గానకున్
వచ్చితిగాక యీ పథికవర్గము నొంటిఁ జరింపనిచ్చునే
యిచ్చటి యన్యపుష్టచయ మిచ్చటిమత్తమధువ్రత [వ్రజం]
బిచ్చటిపల్లవోత్కరము లిచ్చటిపాంసులపంక[1]జావళుల్. 789

సీ నిబిడదుస్సహదీర్ఘనిశ్వాసపవనంబుఁ
బఱచు తేఁటులు బరాబరులు సేయ
నుజ్జ్వలావయవతాపజ్వాలికల వేఁడిఁ
జివురుజొంపములపై నవమళింప
లలితాననేందుపాండురమండలచ్ఛాయ
వనరుహావళి హళాహళియొనర్ప
శ్రమజలాభివ్యక్తి సహజసాంకవమదా
మోదంబు చిలుకల మూలకొత్త

* * *

790

ఉ. నోములు నోచినమ్మలు మనోరథముల్ దయివాఱ నత్తఱిం
దామరతంపరై ప్రియులుఁ దారు విహారము సల్ప వీరిలో
నీ మెయి దుఃఖశీలనగు నే వసియింపఁదరంబె పోదమా
రామమఱఁ జూడ నందు సుకరంబగు సర్వము నంబుజాననా 791

789 — 1 క. జాలముల్.

క. అని పలికి పాన్పు డిగి కా
మిని చంద్రాతపము వేఁడిమికిఁ బైట చెఱం
గున ముసుఁగిడి నిజకేళీ
వనిఁ జొచ్చి వియోగవహ్ని వడఁబడి తెగువన్ 792

సీ. [1]చనుగప్పు దొలఁగు వాసన గాలి కెదురేఁగు
[2]పరువొప్పు నలుగులుఁ బారుకరణి
మొలనూలు బిగియించి వెలఁదివెన్నెలఁ జొచ్చు
బిరుదీయ కేటిలో నురుకుకరణి
నిడుదపెన్నెఱివేణి ముడిఁబెట్టు చిగురాకుఁ
బొద దూరు కార్చిచ్చుఁ గదియుకరణి
పసిఁడిగాజులు పైకి వెనఁద్రోఁచి నునుదీఁగెఁ
దెమలించు నుర్రిదాడు [3]నెమకుకరణి

తే.గీ. జడియ దళులకుఁ గురియుపుప్పొడుల మునుఁగు
మావికడ నిల్చు విరులనెత్తావిఁ గ్రోలు
విషమసాయకు నేవుల విసిగి విసిగి
తనువు దొరుగంగఁ దలఁచి యా వనరుహాక్షి 793

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ
బట్టి సఖీజనము [1]వేణిఁబట్టి [యు] దగునే
యిట్టి తెగువనుచుఁ జెక్కులఁ
దొట్టిన కన్నీరుఁ బోవ దుడుచుచుఁ బలికెన్ 794

ఉ. పూఁత పసిండి వంటి కులమున్ బచరింపఁ గులంబునీతికిన్
లేఁతగదమ్మ యిత్తెఱఁగు లేమ సురాంగనలెల్ల నిట్టి నీ
చేఁతకు మెత్తురమ్మ ద [యు] చేయక తిన్నని మేను వెన్నెలన్
వేఁతురటమ్మ యింత కనువేదురుఁ జెల్లునటమ్మ యింతికిన్ 795

చ. తొడిబడఁ బాళిపై కురికి ధూర్జటి కంటికడింది మంటలో
నడఁ బొడగానరాక తెగటారఁగఁ గాలినయట్టి మోటుకై
పడి రతిలోచనాంబువు[1]ల వాన నిగిల్చితి పాంథ[2]బాధకై
మడియ కనంగ యవ్వేలఁది మంగళసూత్రమహత్త్వ మెట్టిదో 796

793 — [1] క. కనుకవ్వ ; [2] క. పరవొవ్వ ; [3] క. నేచు.
794 — [1] క. వేకాంగు పట్టితగునే.
796 — [1] క. లవానని గిర్చితి ; [2]చ. బావ.

శా. సాహంకారత శంకరుం దలిగి నేత్రాగ్నిన్ బయిన్పంపినన్
స్వాహాకాముకుఁడౌట నిన్నతఁడు గావంబోలు [1]మోమోడి నం
దేహంబేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండుటె
ట్లాహా దైవము దోసకారులకె దోడై వచ్చు నెప్పట్టునన్ 797

సీ. కుసుమవాసనలెల్లఁ గొల్లలాడితి మింకఁ
బఱచుటామని యెంత పరువులిడునొ
చివురుజొంపములెల్లఁ జిదిమివైచితి మింకఁ
దగరకోయిలయెంత యగలిపడునొ
ఫలపరంపరలెల్ల నులిమివైచితి మింకఁ
గొదమచిల్కలు[1] నెంత వదరుకొనునొ
కమ్మదేనియలెల్ల గుమ్మరించితి మింకఁ
గట్టలుక నళులెంత చుట్టుకొనునొ

తే.గీ. యెఱుఁగరా దింతులార యీ తెరవ నిచట
మనలగానీక దోఁతెందు మనము గొనిన
కుసుమకిసలయఫలనవప్రసవరసము
ననమశరునకు నర్పింతమనుచు వెడలి 798

క. మందారముకుళకుహళీ
కందళితమరంద[1]తుందికాళిందవధూ
బృందాభినందితంబగు
మందానిల మొలయ విజితమార్గశ్రములై 799

చ. వనజముఖు ల్గనుంగొని రవారితవారితరంగరంగన
ర్తనసలిలభ్రమద్భ్రమరరంగదభంగరథాంగనాదముల్
మనసిజ[1]హేలామకుండనిభమంజులకుంజగళాళిధూమముల్
ధనధనరోజధామనమధామము నొక్క సరోలలామమున్ 800

సీ. తనయిల్లుఁ దామరతంపరై మెఱయ నం
పన్నలినాక్షి గాఁపున్న చోటు
వలరాజు ముజ్జగంబులు[1] గెల్చి దర్పమే
ర్పడ నిజాంకశతంబు లిడిన చోటు

---

797 — 1 క. బో.
798 — 1 చెంతపదరికొనెనొ.
799 — 1 క. చ. తుందిలకళింద.
800 — 1 చ. వో.

వలిగాలి పన్నగావళి గ్రాహితగరాగ్ని
ఘోరసంజ్వరము పీడ్కొనిన చోటు
తొగకొమ్మ తమిగ్రమ్మఁ దగురాజు కరమంటి
యొండకన్నెఱుఁగక యెసఁగు చోటు

తే.గీ. నిందుముఖులార! యిదె సుమీ యిందుఁ గ్రుంకి
మదనుఁ బూజింపఁ గోరిక లొదవు ననుచుఁ
దొడవు లటుఁబెట్టి వలిపెపావడలుఁ గట్టి
[2]శృంగములు వట్టి నీరాడఁ జేరునపుడు. 801

చ. కరముల మూపు లూదుకొని కన్నెలు చన్నులఁబంటి యొండొరున్
పరిగొని నిల్వఁ దత్పరిధిఁ గ్రాంశుకలాపకలాపపూరితాం
తరమయి పొల్చె భావభవదైవత [ - ] హేమకుంభసం
భరితమృణాళమండలితపద్మమయప్లవమండలంబునన్. 802

చ. నెలతలు బంతి కట్టుకొని నీ రెగఁజల్లఁ దదీయమంజులాం
జలికలితోదకం బెగయుజాడ నుతింపఁగనయ్యెఁ దత్కుచాం
చలజఘనాభిఘాతములు సైపక మ్రోయుచుఁ బద్మయుక్తమై
కొలను సరోజబాంధవునకున్ మొఱవెట్టఁగ నేఁగు కైవడిన్. 803

ఉ. బంగరుకొమ్ముఁ బూని యొక ప్రౌఢరయంబున నీరుఁజల్ల ము
గ్ధాంగన యోర్తు వక్త్రకిరణాప్తిఁ గరంగెడు చంద్రకాంతపున్
శృంగముఁ బూని వాని గెలిచెన్ వెస నక్షయకాండలబ్ధి ను
ప్పొంగరె రాజరత్నపరిపూర్ణబలంబున నెట్టివారలున్. 804

సీ. కేలఁ దమ్మి ఘటించి పాలమున్నీటిలోఁ
బొడమిన జవరాలిఁ బోలె నొకతె
యమలమృణాలనాళాక్షసూత్రము లెదఁ
గీలించి యజురాణిఁ బోలె నొకతె
వెలిదమ్మిరేకు వేనలినంట వెన్నెల
పువ్వుఁ దాల్చు భవానిఁ బోలె నొకతె
కలువపుప్పొడిరాల్పఁ గాయజాస్త్రముల తు
ప్పులుదుల్చు రతిదేవిఁ బోలె నొకతె

801 - [1] చ. గెల్వ ; [2] చ. అంగములు.

తే.గీ. సారకాసారసాగర జనితజలజ
కుందమాధ్వీసుధాధారఁ గ్రోలదివురు
ప్రబలరోలంబమాలికారాహుఁ బఱపు
దంభనారాయణి యనంగఁ దనరె నొకతె. 805

---

# ప ద్య సూ చి

అ

ఆ

ఇ

ఏ



ఒ



క

## చ

స

# సంకేత సూచి

| | గ్రంథ సంకేతము | గ్రంథము | గ్రంథకర్త |
|---|---|---|---|
| 1. | అ.చ. | అనిరుద్ధ చరిత్ర | పెమ్మనబావన |
| 2. | అ.పు. | అరుణాచలపురాణము | పెదపాటి సోమయ |
| 3. | అప్ప. | అప్పకవీయము | కాకునూరి అప్పకవి |
| 4. | అంబి. | అంబికాశతకము | రావిపాటి త్రిపురాంతకుడు. |
| 5. | ఆ.పు. | ఆదిపురాణము | సర్వదేవుఁడు |
| 6. | ఉ.ఉ. | ఉదయనోదయము | నారన సూరన |
| 7. | ఉ.హ. | ఉత్తరహరివంశము | నాచన సోమనాథుఁడు |
| 8. | క.క.ర. | కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి |
| 9. | క.పూ. | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| 10. | కాదం. | కాదంబరి | భాస్కరునికేతనప్రెగడ |
| 11. | కు.సం. | కుమారసంభవము | నన్నె చోడుఁడు |
| 12. | కే.బా.చ. | కేయూరబాహు చరిత్ర | మంచెన |
| 13. | క్రీ.డా. | క్రీడాభిరామము | వల్లభామాత్యుఁడు |
| 14. | చా.చం. | చారుచంద్రోదయము | చెన్నమరాజు |
| 15. | చా.ప.మం. | చాటుపద్యమణిమంజరి | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 16. | ధ.రా. | ధనాభిరామము | నూతనకవి సూరన |
| 17. | నా.ఉ. | నాసికేతూపాఖ్యానము | దగ్గుపల్లి దుగ్గన |
| 18. | నృ.పు. | నృసింహపురాణము | ఎఱ్ఱన |
| 19. | పారి. | పారిజాతాపహరణము | నంది తిమ్మన |
| 20. | పు.చ. | పురాతనచరితము | ? |
| 21. | ప్ర.ర.ము. | ప్రబంధరత్నాకరము | పెదపాటి జగన్నాథకవి |
| 22. | ప్ర.ర.ళి. | ప్రబంధరత్నావళి | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 23. | బే.పం.విం. | బేతాళపంచవింశతి | ? |
| 24. | భాగ. | ఆంధ్రమహాభాగవతము | పోతన |
| 25. | భార.ఆది. | ఆంధ్రమహాభారతము ఆదిపర్వము | నన్నయ |
| 26. | భా.రా. | భాస్కరరామాయణము | భాస్కరాదులు |
| 27. | మ.చ. | మనుచరిత్ర | పెద్దన |
| 28. | మ.సే. | మదనసేనము | నందిమల్లయ |

| | | | |
|---|---|---|---|
| 29. | ర.రా. | రఘునాథరామాయణము | రఘునాథరాయలు |
| 30. | రు.చ. | రుక్మాంగదచరిత్ర | ప్రౌఢకవి మల్లన |
| 31. | ల.శి. | లక్షణశిరోమణి | పొత్తపి వేంకటరమణకవి |
| 32. | ల.సా. | లక్షణసారము | పెనుమర్తి వేంకటార్యుడు |
| 33. | వ.చ. | వసుచరిత్ర | భట్టుమూర్తి |
| 34. | వా.చ. | వాల్మీకిచరిత్ర | రఘునాథరాయలు |
| 35. | వి.శ్ర.సే. | విక్రమసేనము | తిక్కన |
| 36. | వి.చ. | విక్రమార్కచరిత్ర | జక్కన |
| 37. | వి.వి. | విజయవిలాసము | చేమకూర వేంకన |
| 38. | వి.సే. | విజయసేనము | చిమ్మపూడి అమరేశ్వరుఁడు |
| 39. | శృ.నై. | శృంగారనైషధము | శ్రీనాథుఁడు |
| 40. | శృం.శా. | శృంగారశాకుంతలము | పిల్లలమఱ్ఱి పినవీరన |
| 41. | శ్రీ.కా.మ. | శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యము | ధూర్జటి |
| 42. | శ్రీ.మ. | శ్రీరంగమహత్త్వము | భైరవకవి |
| 43. | శ్రీ.వి. | శ్రీకృష్ణవిలాసము | వెన్నెలకంటి వేంకటాచలము |
| 44. | సిం.ద్వా. | సింహాసనద్వాత్రింశిక | కొఱవి గోపరాజు |
| 45. | మా.రా.క. | | మానవల్లి రామకృష్ణకవి |
| 46. | ని.వెం రా. | | కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు |
| 47. | కొ.శ్రీ.మూ. | | ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి |